రామాయణకథాపాఠే మంగళాన్యకరో ద్విజః
రామాయణ ప్రభావేణ సర్వే నాశితపాతకాః ౬౫

దివ్యరూపధరా భూత్వా దేవానీతవిమానగాః
రామాయణపరంతం తం నమస్కృత్వా బ్రువంశ్చతే ॥ ౫౬

వైభవం భవతోఽధీనం పరలోక విజృంభితం
శ్రీరామ రామాయణకథా త్వం విశిష్టోఽసి వాచకః ॥ ౫౭

ముక్తింగతా వయం సర్వే భవతోఽస్యచ దర్శనాత్
రామాయణకథాం శ్రుత్వా వధం పాపస్య నిర్గమాత్
ఆరుహ్య స్వర్గసౌఖ్యాని భజామఃకృతినోయథా ॥ ౫౮

ఇత్యుక్త్వా బ్రహ్మరక్షాంసి పరిక్రమ్యప్రణమ్యతం।
దేవత్వం సమనుప్రాప్యయయుర్దేవగతింతదా ॥ ౫౯
రామాయణఫలందేవీ శ్రుత్వైవం ప్రాహ శంకరం ॥ ౬౦

పార్వతీ॥ భగవన్ దేవదేవేశ శ్రీరామాయణ వైభవం
శ్రుత్వాత్వన్ముఖతోఽభూవం కృతార్థాహంనసంశయః ॥౬౧

ఇత్యాశ్చర్యరామాయణే
రామాయణ మాహాత్మ్యం సంపూర్ణం

తత్త్వసంగ్రహరామాయణే రామోత్సవ రత్నాకరేవ

౫౫-౫౬. ఆవటవృక్షము క్రిందున రామాయణ పారాయణముఁ జేయు చున్న బ్రాహ్మణుడు రామాయణమునందలి మంగళ శ్లోకములనుఁ బఠించుచుండగా వటవృక్షముపై నున్న బ్రహ్మరాక్షసులు మంగళ శ్లోకములనువినినమాత్రముననే సర్వపాపవిముక్తులై దివ్యరూపము లను ధరించి తమకొఱకుఁ దీసికొనిరాబడిన విమానముల నెక్కిన వారలై రామాయణమునుఁజదువుచున్న బ్రాహ్మణునకు నమస్క రించి యిటులఁబల్కిరి.

౫౭. తా॥ ఓద్విజోత్తముఁడా! పరలోక వైభవము నీయధీనమైయున్నది. సర్వపాప హరమగు రామాయణకథను నీవు పఠింపగా మేము వింటిమి. నీవు గొప్ప కథకుడవు, అని యాబ్రాహ్మణుని బ్రహ్మ రాక్షసులు పొగడిరి.

౫౮-౫౯. మఱియు నిట్లనిరి. ఓ మహాత్మా! నీ దర్శనమునను నీవు పఠించిన రామాయణ శ్రవణము వలనను మాపాపములన్నియు నశించి మేము ముక్తినిఁబొంది విమానములనెక్కి పుణ్యవంతులవలె స్వర్గసౌఖ్యములనొందఁ బోవుచుంటిమి.

౬౦-౬౦. ఇవ్విధముగ బ్రహ్మరాక్షసులు చెప్పి బ్రాహ్మణునకు నమస్క రించి దివ్యరూపములతో దేవలోకమునకుఁబోయిరి. ఇవ్విధముగ శంకరుడు రామాయణ ఫలమునుఁ జెప్పగాఁ బార్వతి విని సంత సమునుఁబొంది శంకరునితో నిటులఁబల్కెను.

౬౧. ఓ దేవదేవా! నీ వలన రామాయణ మాహాత్మ్యమునువిని కృతా ర్థురాలనైతినని పరమేశ్వరునితోఁ బల్కెను.

ఆశ్చర్యరామాయణమున
రామాయణ మహాత్మ్యము సంపూర్ణము.

# శ్రీమదాశ్చర్య రామాయణే

## బాలకాండే ప్రథమ స్సర్గః

వందామహే మహేశానచండకోదండ ఖండనం ।
జానకీ హృదయానంద చందనం రఘునందనం ॥ ౧

*ఏకదా మునయ స్సర్వే నానారణ్యనివాసినః ।
సత్రయాగం ప్రకుర్వాణా స్సంస్థితా నైమిశేవనే ॥ ౨

*ఏతస్మిన్సమయేతత్రసమాగాద్రోమహర్షణః ।
తం పూజయిత్వా పప్రచ్ఛు ర్వ్యాసశిష్యం తపోధనాః ॥ 3

---

* ౨ వ్యా॥ ఏకదేతి - నైమిశమితి-ఏకదా మహర్షయః వేధసోఽంతికం గత్వా తప స్తప్తుమేకం పావనం స్థలం ప్రదర్శయేతి ప్రార్థయామాసుః తదా బ్రహ్మా కుశై ర్నేమిం (చక్రం) కృత్వా హస్తేన తాం గృహీత్వామునీ నవాదీత్ భోమహర్షయః మయేయముత్క్షిప్యేత యత్రేయంపతేత్· తత్స్థలం పవిత్రమిత్యుక్త్వా, నేమిందూరతస్తూత్క్షేపయామాస, యత్ర నేమిః పతితా తత్స్థలం నైమిశమభూత్, తత్స్థలస్యారణ్యమయత్వా న్నైమిశారణ్యమిత్యాఖ్యా సమజనీతి.

నానారణ్యాని ధర్మారణ్య వింధ్యారణ్యాదిని పుణ్యారణ్యానీత్యర్థః.

* 3 వ్యా॥ రోమహర్షణఇతి. యస్య సుభాషితైః శ్రోతౄణాం శరీరేషు రోమహర్షణం (రోమాంచః) జాయతే సరోమహర్షణఇతి వాయుపురాణే 1 అధ్యాయే ప్రతిపాదితం.

# ఆశ్చర్య రామాయణమునందు

## బాలకాండ ప్రారంభము.

౧ తా॥ మహేశ్వరుని ధనువును ఖండించినవాడును, జానకీహృదయానంద కరుడునగు శ్రీరామచంద్రుని నమస్కరించెదను.

౨* తా॥ ఒకానొకప్పుడు నానారణ్యములయందుడెడి మహర్షులందఱును నైమిశారణ్యమునందుఁగలసి దీర్ఘ సత్రయాగమునుఁజేయుచుండిరి.

౩* తా॥ ఈసమయమునందు నచ్చటకు రోమహర్షణుడను వ్యాసశిష్యుడు వచ్చెను. అచ్చటి మహర్షులు వ్యాసశిష్యుడగు నా రోమహర్షణుని బూజించి ప్రశ్నించిరి.

---

*వ్యా॥ నైమిశారణ్యమనగాఁ బురాణముల యందివ్విధమునఁ జెప్పబడినది. (ఏమన) ఒకప్పుడు మహర్షులు బ్రహ్మదేవునొద్దకువెళ్ళి మేము తపస్సు చేసికొనుటకుఁ బవిత్రమయిన స్థలమునుఁ జూపుమని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు మహర్షులతో నిట్లనెను. ఓ మహర్షులారా కుశలతో నేనొక చక్రమునుఁగల్పించి దూరముగా విసరివేయుదును ఈకుశచక్ర మెచ్చటఖడునో యదిపవిత్ర స్థలముగా భావింపుడని చెప్పి యానేమిని (చక్రమును) ఎగరవేసెను. ఆనేమి (అచక్రము) పడినప్రదేశము నైమిశమయ్యెను. అది యరణ్యప్రదేశ మగుటవలన నైమిశారణ్యమని పిలువబడుచున్నది.

నానారణ్యములనగ ధర్మారణ్యము, వింధ్యారణ్యము, మొదలగు పుణ్యారణ్యములు.

(రోమహర్షణుడు) ఏమహనీయుని కథాశ్రవణముచేత భక్తులగు శ్రోతలకు, రోమహర్షణము (ఆనందముచే శరీరమున గగుర్పాటు) కలుగునో యామహాత్మునకు రోమహర్షణుడను పేరు కలిగెనని వాయుపురాణమునందు 1 అధ్యాయమునఁ జెప్పబడినది.

పౌరాణిక మహాబుద్ధే రోమహర్షణ సువ్రత
త్వత్తశ్శ్రుతా మహాపుణ్యాః పురా పౌరాణికీకథాః ॥ ౪

న మనో నిర్మలం జాత మస్మాకం రోమహర్షణ ।
తస్మాద్రామకథాం బ్రూహి పాపహాం చిత్తశుద్ధిదాం ॥ ౫

రామాయణాని బహుశ స్సంతీతి శృణుమో వయం ।
తేషాం సారం సముద్ధృత్య కథాంత్వం వక్తుమర్హసి ॥ ౬

సూర్యవంశభవానాంహి రాజ్ఞాం చారిత్ర మద్భుతం ।
ప్రథమం సంగ్రహేణోక్త్వా త్వాసూర్యాజసుతావధి ।
పశ్చాత్త్వం రఘువీరస్య చరితం విస్తృతం వద ॥ ౭

సూతః॥ ధన్యాయూయం ద్విజశ్రేష్ఠాః యేషాంవోమతి రీదృశీ
రఘువీర పదద్వంద్వ మకరంద స్పృహావతీ ॥ ౮

సఫలం జీవితం మేఽద్య యద్రామ స్సంస్మరితః పునః ।
సురాసురకిరీటౌఘ మణి నీరాజితాంఘ్రికః ॥ ౯

రావణారికథావార్ధా మశకో మాదృశః కియాన్ ।
యత్ర బ్రహ్మాదయో దేవామోహితా నవిదంత్యపి ॥ ౧౦

తథాపి వో మయా త్వద్య వక్తవ్యం స్వీయశక్తితః ।
పక్షిణ స్స్వగతిప్రాయం ఖే గచ్ఛంతి సువిస్తరే ॥ ౧౧

౪. సర్వపురాణములనుఁ దెలిసిన మహాబుద్ధిమంతుడ వగు నో రోమ హర్షణుడా! పూర్వమునందు నీవలన మేము సర్వపురాణ గాథలను విని యుంటిమి.

౫. ఓరోమహర్షణుడా నీవలన బురాణములన్నియు వినినను మాకుజిత్త శుద్ధి కలుగనందునఁ జిత్తశుద్ధినిఁ జేయునదియును, సర్వపాప హరమునగు రామకథను జెప్పుము.

౬. తా॥రామాయణము లనేకములుగా నున్నవని వినుచున్నాము అరామా యణము లన్నిటిలోని సారమునెత్తి యొకకథనుగా జెప్పుము.

౭౪.తా॥మఱియును సూర్యవంశపురాజుల చరిత్ర మత్యద్భుతముగాన, బ్రథమమున సూర్యుడు మొదలుగ దశరథుని పర్యంతముగల కథా భాగమును సంగ్రహముగ జెప్పి యనంతరము సూర్యవంశ మణి భూతుడగు నా రామచంద్రుని కథావృత్తాంతమును విస్తారముగ వర్ణింపుమని మహర్షులు కోరిరి.

౮౪.తా॥రోమహర్షణు డిట్లు చెప్పఁదొడంగెను. ఓమహార్షులారా! మీచు చిత్తము శ్రీరాముని పాదారవిందముల యందలి మకరందమును గ్రోల నుద్యమించిన కతంబున మీరు ధన్యాత్ములై తిరి.

౯౪. మఱియు నోమహర్షులారా! మీరు ధన్యాత్ముల రగుటయేకాదు సురాసురుల కిరీటములయందలి మణులచే నీరాజింపబడు పాద పద్మములుగల యారామచంద్రుని స్మరణము నాకు లభించినందున నేనును కృతార్థుడనైతి. నా జన్మము సఫలమయ్యెను.

౧౦౪.తా॥మహర్షులారా! బ్రహ్మాది దేవతులును మాయామోహితులై యే రామకథను బూర్ణముగ దెలియజాలకుండిరో యారామకథ యనెడి మహాసముద్రమున నాబోటియల్పు డొక దోమయని చెప్పనొప్పును (అనగా మహాసముద్రమువంటి యా రామకథను వర్ణించిచెప్పుటకు నేనెంతవాడనని భావము.

౧౧౪.తా॥అట్లయ్యును, బహువిశాలమగు నాకాశమునందుఁ బక్షులు తమ గమనానుసారము సంచరించిన విధమునఁ నాశక్తికొలది మీకుఁ జెప్పెదను.

రఘునాథస్య సత్కీర్తి ర్మద్బుద్ధిం నిర్మలీమసాం ॥
కరిష్యతేఽగ్నిసంపర్కా త్కనకం త్వమలంయథా ॥ ౧౨

పురా కైలాసశిఖరే పార్వతీం ప్రతి శంకరః ।
తత్పృష్టోయాంకథాంప్రాహ తామేవాద్యవదామివః ॥ ౧౩

ఏవముక్త్వా మునీ న్సర్వాన్ ధ్యానస్తిమితలోచనః ।
జ్ఞానేనాలోక్య వై చిత్రాంకథాంవక్తుముపాక్రమత్ ॥ ౧౪

కథా ప్రారంభః

[1] ఆదినారాయణాద్బ్రహ్మాఽభూన్మరీచిర్విధేస్సుతః ।
మరీచేః కశ్యపః పుత్రః లోకేసృష్టిప్రవర్ధకః ॥ ౧౫

[2] అదితి స్సుషువే పుత్రమాదిత్యం కశ్యపా ద్ద్విజాః ।
సూర్యస్య పత్నీ సంజ్ఞాఽభూ త్తనయా విశ్వకర్మణః ॥ ౧౬

అసూత తపసా సాతు మనుం జ్యేష్ఠం వివస్వతః ।
యమాపున రసూతా సా యమంచ యమునాంతతః ॥ ౧౭

శాతవర్ణంచ తద్రూపం దృష్ట్వా సంజ్ఞా వివస్వతః ।
అసహంతీ స్వకాం ఛాయాం సవర్ణాం నిర్మమే తదా ।
ప్రాంజలిఃప్రయతా భూత్వాఛాయాసంజ్ఞామభాషత॥౧౮-౧౯

1 ఆనందరామాయణే 2 వాయుపురాణే 84 అధ్యాయేచ

౧౨॥ మహర్షులారా! సువర్ణమునందలి మాలిన్యమగ్ని సంపర్కముచేఁ బోయిన విధమున నా బుద్ధియందలి మాలిన్యము రఘువీరుని సత్కీర్తిని వర్ణించుటచే నశింపగలదు.

౧౩॥తా॥ మహర్షులారా! మీరలు నన్నడిగిన విధముననే పూర్వముఁ గైలాసపర్వతమునం దొకప్పుడు పార్వతి పరమేశ్వరుని రామకథను జెప్పవలసినదిగాఁ బ్రశ్నించెను. అప్పుడు పార్వతికిఁ బరమేశ్వరుడు చెప్పిన కథనే నేనిప్పుడు మీకుఁ జెప్పెదను వినుడని రోమహర్షణుడు మహర్షులతో ననెను.

౧౪॥తా॥ ఈవిధముగ రోమహర్షణుడు మహర్షులతోఁ జెప్పి నేత్రములను మూసి ధ్యానముచేసి సమస్తమును జ్ఞానదృష్టిచేఁ జూచి మహర్షులకుఁ జిత్రమగు కథానకమునుఁ జెప్ప నారంభించెను.

(కథాప్రారంభము)

౧౫॥ ఓ మహర్షులారా! నారాయణమూర్తివలన బ్రహ్మయు బ్రహ్మవలన మరీచియు వానివలన కశ్యపుడును జనించిరి.

౧౬॥ కశ్యపునకదితియందు సూర్యుడుద్భవించి తపస్సుచేత గ్రహరాజై త్వష్టయను విశ్వకర్మపుత్రికయగు సంజ్ఞాదేవినిఁ బెండ్లియాడెను.

౧౭॥ ఆ సంజ్ఞాదేవియుఁ దపముఁజేసి యా తపోబలముచే సూర్యునివలన నొక పుత్రునిఁగనెను ఆపుత్రునకు వైవస్వతమనువను నామమిడిరి. పిమ్మట నొక కుమారుడును పుత్రికయు జన్మించిరి. ఆ పుత్రునకు యముడనియుఁ బుత్రికకు యమునయనియు నామములై యున్నవి. ఈవిధమున మనువు, యముడు, యమున, అను ముగ్గురు సంజ్ఞాదేవికి సూర్యునివలనఁ గలిగిరి.

౧౮-౧౯-తా॥ సంజ్ఞాదేవి దుస్సహమగు సూర్యుని తేజస్సును సహింపలేనిదై తనతో సమానాకారముగల ఛాయను (నీడను) తన తపోమహిమచే బ్రాణవంతురాలినిగా నిర్మించెను.
అచ్ఛాయాదేవి ప్రాంజలియై సంజ్ఞాదేవితో నిట్లనెను.

1 శ్లో॥ వదస్వేతి । మయాకార్యంసా సంజ్ఞాతా మథాబ్రవీత్
అహం యాస్యామి భద్రం తే । స్వమేవ భవనంపితుః ౨౦

శ్లో॥ త్వయేహ భవనే మహ్యం వస్తవ్యం నిర్విశంకయా
ఇమౌ చ బాలకౌ కన్యారక్షణీయా స్త్వయా మమ॥ ౨౧

శ్లో॥ భర్త్రేనైవ మాఖ్యేయ మిదం భగవతే త్వయా
ఏవముక్తాఽబ్రవీత్సంజ్ఞాంఛాయా ప్రాంజలిసంయుతా ౨౨

1శ్లో॥ ఆకేశగ్రహణా ద్దేవి ఆశయం నైవ కర్హిచిత్
ఆఖ్యాస్యామి మతం తే త్వంగచ్ఛ దేవి! స్వమాలయం ౨౩

శ్లో॥ సమాధాయ చ తాం సంజ్ఞా తథేత్యుక్త్వా తయాచ సా
త్వష్టుస్సమీప మగమ ద్వ్రీడితేవ తపస్వినీ॥ ౨౪

శ్లో॥ పితా తా మాగతాం దృష్ట్వా క్రుద్ధ స్సంజ్ఞామథాబ్రవీత్
భర్తుస్సమీపం గచ్ఛ త్వం మాజుగుప్సదివాకరం॥ ౨౫

శ్లో॥ అగమ ద్బడబా భూత్వాఽచ్ఛాద్య రూప మనిందితా
ఉత్తరా న్స కురూన్గత్వా । తృణాన్యథ చచార సా ౨౬

శ్లో॥ ద్వితీయాయాంతుసంజ్ఞాయాం సంజ్ఞేయమితి చింత్యతాం
ఆదిత్యో జనయామాస పుత్రా వాదత్యవర్చసా॥
శనైశ్చరం మనుం చాన్యంఛాయా దేవ్యాంతతఃపరం॥ ౨౭

---

1 వాయుపురాణే 84 అధ్యాయే

౨౦-౨౧ ఓ సంజ్ఞాదేవి ! నన్ను నీవిటులనిర్మించుటకు నావలనఁ గావలసిన కార్యమేద్దియో చెప్పుము. అని ఛాయాదేవిపల్కఁగా, సంజ్ఞాదేవి యాచ్ఛాయాదేవితో నివ్విధముగఁ జెప్పెను. నీకు శుభము గలుగుగాక నేను నా పుట్టినింటికి వెళ్ళెదను. నాకుఁ బ్రతినిధిగ నీవు నా గృహంబుననుండి నా ముగ్గురు పిల్లలను రక్షించుచుండుము.

౨౨ మఱియు నా వృత్తాంతమును నాభర్తయగు సూర్యునకుఁ జెప్పకుము. అని చెప్పగా ఛాయాదేవియుఁ జేతులు జోడించి సంజ్ఞాదేవితో నిటులఁ బల్కెను,

౨౩ ఓ దేవి, నాకు ప్రాణసంకటము కలుగునంతవఱకు నేను చెప్పను నీవు పితృగృహమునకు వెళ్ళుమనెను.

౨౪ అపుడు సంజ్ఞాదేవి, ఛాయను సమాధానపరచి లజ్జపడుచు, దీనురాలవలె పితృగృహమునకు వెళ్ళెను.

౨౫తా॥ సంజ్ఞాదేవి తండ్రియగు విశ్వకర్మ, తనగృహమునకు వచ్చిన కొమరి తనఁ జూచి కోపము నొంది, ఇటులఁ బుత్రికతోఁ బల్కెను, పుత్రి! నీవు, తిరిగి, భర్తృసమీపమునకుఁ బొమ్ము. భర్తయగు సూర్యుని నవమానించి ఇటులవచ్చుట, యుక్తముకాదనెను.

౨౬ పూజ్యురాలగు సంజ్ఞాదేవి, పైవిధమున తండ్రి చెప్పగఁ వచ్చుటనుండి బయలుదేరి నిజరూపమునుఁ గప్పిపుచ్చి, యాడగుఱ్ఱము రూపమును ధరించి, యుత్తర కురుదేశమునొంది యచ్చట తృణములను భక్షించుచుండెను.

౨౭-౨౮తా॥ సంజ్ఞాదేవికిఁ బ్రతినిధియగు ఛాయను సంజ్ఞాదేవియని తలచియామెతో సూర్యుడు సుఖించుచుఁ నామెవలన శనైశ్చరుని సావర్ణిమనువను నిద్దఱు పుత్రులనుఁ బడసెను.

శ్లో॥ ఛాయా తు పార్థివీ సా వై । స్వపుత్రే ద్వితయే యథా
చకారాభ్యధికం స్నేహం న తథా పూర్వజేషు వై॥
మనుస్తచ్చాక్షమత్సర్వంయమస్తన్నైవచాక్షమత్॥ ౨౮-౨౯

శ్లో॥ విమానితశ్చబహుశో స్నాపత్న్యా దతిదుఃఖితః ।
తాం వై రోషాచ్చ బాల్యాచ్చభావినోఽర్థస్య వై బలాత్ ।
పదా సంతర్జయామాస ఛాయాం వైవస్వతో యమః ॥౩౦॥

1 శ్లో॥ సా శశాప తతః క్రోధా త్సవర్ణా జననీ యమం ।
పదా తర్జయసే యస్మా త్పితృభార్యాం యశస్వినీం॥
తస్మాత్తవైవ చరణః పతిష్యతి నసంశయః। ౩౧-౩౨.

శ్లో॥ యమస్తు తేన శాపేన। భృశం పీడితమానసః ।
మనునా సహధర్మాత్మా।పితు స్సర్వం న్యవేదయత్॥ ౩౩

శ్లో॥ ఆదిత్య స్త్వాపి త్వాజ్ఞాం । సమర్థం తనయేషు వై ।
తుల్యేష్వప్యధిక స్నేహః కేషుచి త్క్రియతే త్వయా॥౩౪

శ్లో॥ సా తత్పరిహారంతీ వై । నాచచక్షే వివస్వతః॥ ౩౪
తాం శప్తుకామో భగవా న్ధ్యానాయ సుస్థితః ప్రభుః।
సా తస్మై సర్వం యథాతత్త్వ నాచచక్షే వివస్వతః॥౩౫

శ్లో॥ దదర్శ యోగమాస్థాయ । స్వాంభార్యాం వడబాం తథా।
అదృశ్యాం సర్వభూతానాం । తేజసా స్వేన సంవృతా॥ ౩౬

---

1. కా॥ పు॥ 84 అ. లింగపురాణే 85 అ-శివరామాయణేచ.

౨౮-౨౯ ఛాయాదేవి తన పుత్త్రులయందెట్టి ప్రేమతో నుండెనో, సంజ్ఞాదేవిపుత్త్రులయందట్టి ప్రేమతో నుండకపోయెను. ఛాయాదేవిదుష్కృత్యమును మనువు సహించెను కాని యముడు సహింపకపోయెను.

౩౦. యముడు ఛాయాదేవివలన ననేకపర్యాయము లవమానింపబడి బహుదుఃఖితుడై రోషముచేతను, బాల్యముచేతను, భావికార్యబలముచేతను, కాలితోఁ దన్నెదనని ఛాయను భయపెట్టెను.

౩౧-౩౨. పిమ్మట ఛాయాదేవి కోపముతో యముని శపించెను. ఓరి యముఁడా! యశస్వినిపన్నరాలను తల్లినియగు నన్ను పాదముతోఁ దన్నెదనని భయపెట్టినకతంబున నీపాదము పడిపోఁగాక యని శపించెను.

౩౩. తా॥ యముఁడా శాపముచేతను మిక్కిలి పీడింపఁబడిన మనస్సు గలవాఁడై తన సోదరుఁడగు వైవస్వత మనువుతోఁగూడఁ దండ్రిసమీపమునకు వెళ్ళి వృత్తాంతమునంతయుఁ దెలియఁజేసెను.

౩౪. తా॥ సూర్యుఁడు ఛాయాదేవితో నిట్లుఁ బల్కెను. ఓ ప్రియురాలా! నీకు కొమరులందఱు సమానులైనను, కొందఱియందే యధిక ప్రేమతో నుండుటకుఁ గారణం బేమనెను.

౩౫. తా॥ వైవిధముగ భర్తయగు సూర్యుడు ఛాయాదేవినిఁ బ్రశ్నించినను సమాధానము జెప్పకుండెను.

౩౬. తా॥ ఛాయాదేవి సమాధానము చెప్పని కారణమున సూర్యుఁడు కోపించి నశింపుమని శపింప నుద్యుక్తుఁడు కాఁగా నప్పుడు భయమొంది ఛాయాదేవి సూర్యునకు జరిగిన వృత్తాంతము నంతను యథార్థముగాఁ జెప్పెను

౩౭. తా॥ అప్పుడు సూర్యుడు యోగదృష్టిచేత (తన భార్యయగు సంజ్ఞాదేవి నాడగుఱ్ఱము రూపముతో సర్వభూతములకు నదృశ్యురాలై యుత్తరకురుదేశమునందున్న దానినిగాఁ దెలిసికొనెను.

శ్లో॥ అశ్వరూపేణ మార్తాండ స్తత్రగత్వాతయాన్వితః
జనయామాసనాసత్యం దస్త్రింతస్యాముఖాశ్వినా॥ ౩౭౪

సంజ్ఞాదేవిం సమాశ్వాస్య రవిస్తాం గృహమానయత్
విశ్వకర్మా సుతాం ద్రష్టుం సమాగాద్రవిమందిరం॥ ౩౮౪

రవిమాహ తత స్త్వష్టా సాంత్వపూర్వంగ్వజో త్తమాః ౩౯

1 తవాసహంతీ భగవన్ మహత్తేజ స్తమోనుదం।
బడబారూప మాస్థాయ గతా సంజ్ఞా దివాకర॥ ౪౦

అపనేష్యామి తే తేజో యంత్రే కృత్వాదివాకర।
తథేత్యుక్త స్స రవిణా భ్రమకాం కృత్వా దివాకరం॥ ౪౧

పృథక్చకార తత్తేజః విష్ణోశ్చక్ర మకల్పయత్।
త్రిశూలంచైవ శర్వస్య వజ్ర మింద్రస్య చాధికం॥ ౪౨

వచనం శ్రుత్వా రవే ర్వృత్తం ప్రపచ్ఛా రోమహర్షణం।
ఋషయ స్తుష్టమనసో మహాశ్చర్యకరం తదా॥ ౪౩

శ్లో. సూర్యపుత్ర కథాం శ్రోతుంపరం కౌతూహలంహి ః
యమస్యశాపముక్తించ వద న స్సూత సత్వరం॥ ౪౪

---

1 మార్కండే 11 అధ్యాయే

౩౭. తా॥ అనంతరము సూర్యుఁ డశ్వరూపమునొంది బడబారూపముతో (ఆడగుఱ్ఱపు రూపముతో) నున్న సంజ్ఞాదేవియొద్దకు వెళ్ళి యామెనుఁ గలిసి యామెయందు దేవవైద్యులగు నశ్వినీదేవతల నిద్దఱనుఁ బుట్టించెను. (వారికే నాసత్యుఁడనియు దస్రుఁడనియు నామములు.)

౩౮. తా॥ అనంతరము సూర్యుఁడు సంజ్ఞాదేవితోఁ దార్చియామెను స్వగృహమునకుఁ దీసికొనివచ్చెను విశ్వకర్మయును సంజ్ఞాదేవి సూర్యునింటికి వచ్చినదని తెలిసి తనపుత్రికయగు సంజ్ఞాదేవినిఁ జూచుటకు సూర్యునిగృహమునకు వచ్చెను.

౩౯. తా॥ ఓమహర్షులారా? పిమ్మట విశ్వకర్మ. సూర్యునిఁగూర్చి సామవాక్యములతో నిటులఁ బల్కెను.

౪౦. తా॥ భగవానుఁడగు నో సూర్యుఁడా? అంధకారమునుఁ బోఁగొట్టునదియు. మహత్తరమునగు నీదు తేజస్సును నాకొమరిత, సహింపలేక బడబారూపమునొంది (ఆడగుఱ్ఱపురూపమునొంది) కురుదేశమునకు వెళ్ళిపోయెను

౪౧-౪౨. తా॥ ఆ కారణమువలన నీతేజస్సును యంత్రమునందుంచి కొంతభాగమునుఁదగ్గించెదను. అని విశ్వకర్మ చెప్పఁగా నందునకు సూర్యుఁడంగీకరించెను అప్పుడు విశ్వకర్మ సూర్యుని, భ్రమియందుంచి యతని తేజస్సును సానబట్టెను అట్లుసానబట్టఁగావచ్చిన తేజస్సుతో విష్ణుమూర్తికిఁ జక్రమును, శంకరునకుఁ ద్రిశూలమును దేవేంద్రునకు వజ్రాయుధమును విశ్వకర్మ చేసియిచ్చెను.

౪౩. తా॥ ఇవ్విధముగా మహాశ్చర్యమగు సూర్యుని వృత్తాంతమును. రోమహర్షణుఁడు చెప్పఁగా మహర్షులువిని సంతసించి తిరిగి యారోమహర్షణునిఁ బ్రశంసించిరి.

౪౪. తా॥ ఓ రోమహర్షుఁడా? సూర్యపుత్త్రులకథనఁగూడ మాకు వినుకుతూహలముఁడుటవలన జెప్పుము-మఱియు. యమునకు ఛాయాదేవివలన శాపముకలిగెనని చెప్పితివుఁటివి శాపవిముక్తి యతనికి నెట్లయ్యెనో యావృత్తాంతమును గూడఁ జెప్పుమని మహర్షులు సూతుని ప్రశ్నించిరి. (సూతునకే రోమహర్షణుఁడని నామాంతరము)

సూతః॥ శ్లో॥ ఆరాధయ న్మహాదేవం లోకపాలత్వ ముత్తమం।

పితౄణా మాధిపత్యం చ శాపమోక్షం యమ స్తథా

లబ్ధవా న్దేవదేవస్య ప్రసాదా చ్ఛూలపాణినః॥ ౨౫

ఛాయాదేవీసుతో యోఽసౌ ద్వితీయః కథితో మనుః।

పూర్వజస్య సవర్ణోఽసౌ సావర్ణి స్తేన కథ్యతే॥ ౨౬

శనిర్గ్రహత్వం యమునా నదీరూపం తథాఽభజత్।

వైవస్వతమనో ర్వృత్తం వదేయం శృణుత ద్విజాః॥ ౨౭

ఇత్యాశ్చర్యరామాయణే ప్రథమస్సర్గస్సమాప్తః.

౭౫॥ సూతుడిటులఁజెప్ప నారంభించెను. ఓ మహర్షులారా! యముడు ఛాయాదేవి వలన శపింపఁబడి యా శాపముచే నొకపాదముకుళ్ళిపడి పోఁగా దుఃఖితుడై పరమేశ్వరుని గూర్చి చిరకాలము తపముచేసి యాపరమేశ్వరుని యనుగ్రహమును సంపాదించికొని శాపవిముక్తిఁ బొంది తిరిగి పడిపోయిన పాదమునుఁ బొందుటయే కాక యుత్తమమగు లోకపాలకత్వమునుగూడ నాపరమేశుని యనుగ్రహమువలనఁ బొందగల్గెను.

౭౬॥తా॥ ఛాయాదేవియందు సూర్యునకుద్భవించిన రెండవమనువు, సంజ్ఞాదేవి పుత్త్రుడగు వైవస్వత మనువుతో సమానవర్ణము గలవాడగుట చేతను సావర్ణిమనువని పిలువఁబడుచుండెను. (ముందువచ్చు మన్వంతరము సావర్ణిమన్వంతరమే)

౭౭॥తా॥ ఓ మహర్షులారా! ఛాయాపుత్త్రుడగు శనైశ్చరుడు. తపోబలముచే నవగ్రహములలో నొక గ్రహమగుటనుఁ బొందెను. సూర్యుని వలన సంజ్ఞాదేవియందు జనించిన యమున, నదీరూపమునొంది లోకోపకారిణి యయ్యె- సూర్యపుత్రులలో వైవస్వతమనువృత్తాంతమును జెప్పెదను - సావధానులై వినుడని సూతుడు శౌనకాది మహర్షులకుఁ జెప్పెను.

ఆశ్చర్యరామాయణమున

ప్రథమసర్గము సమాప్తమయ్యెను.

## ద్వితీయ సర్గః.

* వైవస్వతమనుం భూమ్యాః పాలనేఽజో నియుక్తవాన్
తస్య శ్రద్ధా మనోః పత్నీ పతిభక్తిరతాఽనసత్॥ ౧

అయోధ్యా నిర్మితా తేన పాతి భూమిం స తత్స్థితః।
ఏకదా స మను ర్వసిష్ఠ ముద్యుక్తో గురు మబ్రవీత్॥ ౨

యజ్ఞం కర్తుమనా శ్చాహం త్వయాఽఙ్గ క్రియతే యది ౨½

అత్ర తీర్థం పరం నాస్తి నాస్తి శ్రేష్ఠా మహానదీ
ఆనయస్వ నదీం రమ్యాం మానసాత్పాపకాపహాం॥ ౩½

తద్గురో ర్వచనా ద్రాజా మనుర్వైవస్వతో మహాన్
రణత్కృత్య మహాచ్చాపం సందధే శర ముత్తమం॥ ౪½

శ్లో॥ స శరో మానసం భిత్త్వా తస్మా న్నిష్కాస్య తాం నదీం
అయోధ్యా మానయామాస పంథానం దర్శయన్నివ॥ ౫½

శ్లో॥ ఆనీతా సా శరేణైవ శరయూ శ్చేతి కథ్యతే।
సరోవరాత్సముద్భూతా సరయూ శ్చేతి కేచన॥ ౬½

---

* వాయుపురాణే 85 అధ్యాయే శివరామాయణే చ.

## రెండవ సర్గము.

౧ తా॥ బ్రహ్మదేవుడు సూర్యపుత్రుడైన వైవస్వతమనువును, భూపరిపాల
నమునకు నియోగించెను. అతడు బ్రహ్మచే నియమింపఁబడి భూమండ
లమును ధర్మముగాఁ బరిపాలించుచుండెను. ఆ వైవస్వత మనువు
నకు శ్రద్ధయనెడి భార్యకలదు. ఆమె పతిభక్తికలదై యుండెను.

౨ తా॥ ఆ వైవస్వతమను వయోధ్యయను పత్తనము ను నిర్మింపఁజేసి యచ్చ
టనుండి రాజ్యపరిపాలనము చేయుచుండెను. వైవస్వతమను వొకా
నొకప్పుడు యజ్ఞమునుఁ జేయఁదలచి గురువగు వసిష్ఠుఁతో నిటుల
బల్కెను

౨ తా॥ ఓ గురువర్యా! నీవంగీకరించితివేని నేనొక యజ్ఞమునుఁ జేయఁ
దలచితి ననెను.

౩ తా॥ అప్పుడు వసిష్ఠుడిట్లనియెను. ఓ రాజా; నీవు యజ్ఞమునుఁ జేయఁ
బూనుట నాకు సంతసమే కాని యిచ్చట మహానది కాని తీర్థము కాని
లేదయ్యె (యజ్ఞము మహానదీ ప్రాంతమునఁ జేసినచో మహాఫల
ప్రదమని యాశయము) కాన మహాపాపహరమగు నొక రమ్యమగు
నదిని మానస సరోవరమునుండి తీసికొని రమ్మనెను.

౪ తా॥ వసిష్ఠుని వాక్యమును విని వైవస్వతమనువు ధనుష్టంకారముఁ జేసి
యా ధనువునందు బాణమును సంధించి విడిచెను.

౫ తా॥ ఆ బాణము మహావేగముగా, మానస సరోవరమును భేదించి
యా సరోవరమునుండి యొకనదిని బయలుదేరఁదీసి మార్గమునుఁ
జూపుచున్నదివలె నయోధ్యాపురికిఁ దీసికొనివచ్చెను.

౬ తా॥ ఆనది శరముచేఁ (బాణముచే) దీసికొనిరాబడినది కాన శరయూ
నది యని చెప్పఁబడుచున్నది. మఱికొందఱు మానస సరోవరము
నుండి యుత్పత్తిగలది కాన సరయూ నది యని చెప్పుదురు.

అథాకరోత్పుత్రకామః పరమేష్టిం ప్రజాపతిః ।

తత్ర శ్రద్ధా దుహిత్రర్థం హోతారం సమయాచత ॥

తేన హోత్రపచారేణ కన్యేళానామ సాఽభవత్ ॥ ౭-౮

మిత్రావరుణయో రాసీ త్ప్రసాదాత్పుంస స్త్విళా ॥ ౮౫

*శ్లో॥ సుద్యుమ్న ఇతి విఖ్యాత స్త్రిషు లోకేషు పూజితః ।

గత్వా శరవణం తత్రపునః స్త్రీరూప మాప సః ॥ ౯౫

---

వ్యా॥*సుద్యుమ్న ఇతి సుద్యుమ్నస్య పునః స్త్రీరూపత్వ ప్రాప్తేః కారణం మత్స్యపురాణే । అధ్యాయే ప్రతిపాదితం॥ తథాహి - రమతే యత్ర దేవేశః శంభు స్సోమార్ధశేఖరః ఉమయా సమయ స్తత్రపురా శరవణే కృతః॥ పుంనామసత్త్వం యత్కించి దాగమిష్యతి తే వనే । స్త్రీత్వమేష్యతి తత్సర్వం దశయోజన మండలే । అజ్ఞాత సమయో రాజా ఇలశ్శరవణే పురా, స్త్రీత్వ మాప విశన్నేవ బడబాత్వం హయ స్తథా॥ఇతి॥

---

1 వ యుపురాణే ౭౧ మహారామాయణేచ బ్రహ్మాండేచ.

౭౫ తా॥ అనంతరము వైవస్వతమనువు పుత్రకాముఁడై పుత్రకామేష్టినిఁ జేసెను. ఆయాగమున వైవస్వతమనుభార్యయగు శ్రద్ధాదేవి, హోతను తనకుఁ బుత్రిక గలుగునట్లు హోమమునుఁ జేయవలయునని ప్రార్థింపగా నాహోతయును, శ్రద్ధాదేవి కోరిక ననుసరించి మిత్రావరుణులకు హవిర్భాగముల నిచ్చునపుడు పుత్రిక గలుగఁజేయుఁడని ప్రార్థించగా, నాదేవతలు నవ్విధముననే యనుగ్రహించిరి ఇవ్విధమున హోతయపచారముచేసి బుత్రునకుఁ బదులు పుత్రిక జన్మించెను, (ఆమెకు, ఇళ యని పేరు)

౭౬ తా॥ వైవస్వతమనువు, తనకుఁ బుత్రుఁడు పుట్టుటకుఁ జేసిన పుత్రకామేష్టివలనఁ బుత్రిక యెట్లాయెనని విచారించి తెలిసికొని తిరిగి మిత్రావరుణులనుఁ బ్రార్థింపఁగా వారలనుగ్రహించి యిళయను నాకన్యనుఁ దిరిగి పురుషునిఁగాఁ జేసిరి.

*౭౭ తా॥ ఆపురుషుఁడు సుద్యుమ్నుఁడను నామముతోఁ ద్రిలోకములయందుఁ బ్రసిద్ధుఁడై యొకానొకప్పుడు వేఁటకరణ్యమున కేగి యశ్వముచే బహుదూరము తీసికొనిపోఁబడి శరవనమను నొక వనమునుఁ జేరెను. ఆవనమునుఁ బ్రవేశించుటతోడనే తనపురుషరూపముపోయి తిరిగి సుద్యుమ్నుఁడు స్త్రీరూపమునుఁ బొందెను.

---

* సుద్యుమ్నునకుఁ దిరిగి స్త్రీరూపము గలుగుటకుఁ గల కారణము మత్స్యపురాణమున పదునొకండవ యధ్యాయమునఁ జెప్పఁబడినది (ఏమన) చంద్రశేఖరుఁడగు శంకరుఁడు పార్వతీదేవితో నొకప్పుడు శరవనమునందు గ్రీడించుచుండఁగఁ గొందఱు మునీశ్వరులు పార్వతీపరమేశ్వరుల సందర్శనమున కచ్చుటకు రాఁగఁ బార్వతి లజ్జితురాలై యావనమునకు నిట్టి విధమున శాపమిచ్చెను. దశయోజన విస్తీర్ణముగల (పదియామడల చతురముగల) శరవనమునకు నేపురుషజంతువైనను బ్రవేశించినచో, స్త్రీ రూపమునుఁ బొందగలదని" సుద్యుమ్నుఁడు, పార్వతీ శాపవృత్తాంతము నెఱుఁగక యవ్వనమునఁ బ్రవేశించి స్త్రీరూపము నొందెననియు సుద్యుమ్నుఁడెక్కిన మొగగుఱ్ఱముకూడ వెంటనే యాఁడగుఱ్ఱమయినదనియుఁ జెప్పఁబడినది.

శ్లో॥ బుధస్యాశ్రమ మాసాద్య మైథునాయోపమంత్రితా ।
సోఽతపుత్రాద్బుధా చ్చాస్యా ఐరోజజ్ఞే పురూరవాః॥ ౧౦౪

శ్లో॥ తతః పుంస్త్వాభిలాషాచ్చ మునిభి శ్చ ప్రసాదితా।
పునః పుంస్త్వం గతా నారీ స్త్రీపౌర్వ్యాద్రాజ్యభాజ్నహి॥
వశిష్ఠ వచనా చ్చాసీ త్ప్రతిష్ఠానపురేతు సః ౧౧-౧౨

శ్లో॥ ధ్రువతశ్చ మనోః పశ్చా దిక్ష్వాకు రభినిస్సృతః ।
సతు రాజ్యాభిషిక్తస్స న్పాలయామాస మేదినీం॥ ౧౩

1 శ్లో॥ మంత్రిష్వాధాయ వై రాజ్యంచకార సుమహాత్తపః
సాక్షాత్కృత్య హరి స్తస్మై దదౌ శ్రీరంగమందిరం॥౧౪

శ్లో॥ సప్తద్వీపవతీం భూమిం సశైలవనకాననాం।
పాలయామాస ధర్మాత్మా పూర్వాన్వస్థితమార్గతః॥ ౧౫

1, వాయుపురాణే 85 అ.

౧౦౫ తా॥ సుద్యుమ్నుడు వైవిధముగ స్త్రీరూపము నొంది యచ్చటచ్చట సంచరించుచు బుధుని యాశ్రమమునకుఁ జేరి బుధునిచేఁ గామ క్రీడలకుఁ బ్రేరేపింపఁబడి యతనితో గలసి సుఖించుచుండగా గొంతకాలమునకు నామెకు బుధునివలన నొక కొమరుడు కల్గెను. అతడే పురూరవుడని పిల్వఁబడుచుండెను. (ఇతని వలననే చంద్రవంశమభివృద్ధినొందెను)

౧౧-౧౨ తా॥ ఇళయను పేరుతో నామెయాబుధుని గృహమునందుండి, పురూరవుడు కలిగిన పిమ్మట బురుషరూపము బొందదలచి, యచ్చటి మహర్షులను బ్రార్థింపగా, నామహర్షులనుగ్రహించిన కారణమునఁ దిరిగి యామె పురుషరూపమునుఁ బొందెను, కాని యతడు మొదట స్త్రీరూపముతోజనించిన, హేతువుచే రాజ్యార్హుడుకాడయ్యె, వసిష్ఠుడు చెప్పిన కారణమున ప్రతిష్ఠానగరమును మనువు నిర్మింపఁజేసి, సుద్యుమ్నున కివ్వగా, నచ్చటనే, యతడు నివాసముగా నుండెను.

౧౩॥ తా॥ అనంతర మొకానొకదినమున వైవస్వతమనువు, తుమ్ముచుండగా దైవసంకల్పముచే నొకశిశువుజన్మించెను. (అనగా తుమ్ముచున్నపుడు లోపలనుండి బయల్వెడలెను.) ఆహేతువువలననే యిక్ష్వాకువని వానికి నామకరణముచేసిరి) ఆ యిక్ష్వాకువు రాజ్యాభిషిక్తుఁడై భూమిని ధర్మముగాఁ బరిపాలించుచుండెను.

౧౪. ఇట్లుకొంతకాలము, రాజ్యమును పరిపాలించి, యిక్ష్వాకువు రాజ్యమునుమంత్రులకప్పగించి వనమునకేగి గొప్పతపస్సుచేసెను. శ్రీహరి ప్రత్యక్షమై, యతనికి శ్రీరంగ మందిరమును పూజానిమిత్తమొసంగెను.

౧౫. పిమ్మట తిరిగి వచ్చి మనుపుత్రుడైన యిక్ష్వాకువు, పర్వతారణ్యసహితమును సప్తద్వీపయుతమునగు భూమిని. పూర్వుల మార్గము ననుసరించి ధర్మముతోఁ బాలించుచుండెను.

తస్య పుత్రశతం హ్యాసీ దిక్ష్వాకోస్తు మహాత్మనః।
తేషాం విచిత్రచరితా వికుక్షిర్నిమిదండకౌ॥ ౧౬

శకునిప్రముఖా స్తస్య పుత్రాః పంచాశతస్తు తే
ఉత్తరాపథదేశస్య రక్షితారో మహీక్షితః॥ ౧౭

శ్లో॥ శేషా స్తస్య సుతా రాజ్ఞః। దక్షిణాపథరక్షిణః॥ ౧౮

తేషాం జ్యేష్ఠో వికుక్షిస్తు గుణైః శ్రేష్ఠోఽభవత్తథా॥ ౧౯

శ్లో॥ ఇక్ష్వాకు స్తు వికుక్షిం వై అష్టకాయాముథాఽశత్
మాంస మానయ శ్రాద్ధేహ్యం మృగాన్ హత్వా మహాబల॥ ౧౯

2 సగత్వా మృగయాం కృత్వా మృగాన్ హత్వా శ్రమాన్వితః
భుక్త్వా చ శశకం తత్ర వికుక్షి గృహమాగతః॥ ౨౦

శ్లో॥ ఆగతే తు వికుక్షౌ తు సమాంసే సనరాధిపః।
వసిష్ఠం చోదయామాస మాంసం వై ప్రోక్షితామితి ౨౧

శ్లో॥ సదృష్ట్వోపహతం మాంసం క్రుద్ధో రాజా న సుబ్రవీత్
తుల్యేణోపహతం మాంసం పుత్రేణ తవ పార్థివ॥ ౨౨

శశభక్షణాత్ ఽభోజ్యం తవ మాంసం మహాద్యుతే।
శశో దురాత్మనాఽనేన భక్షితో యేన వై నృప।
శశాద ఇతి లోకేస్మిన్నాఖ్యాతశ్చ భవేదయం॥ ౨౩

శ్లో॥ ఇక్ష్వాకు స్తు తతః క్రుద్ధో వికుక్షి మిద మబ్రవీత్॥ ౨౪

---

2. ఇక్ష్వాకోస్తు వికుక్షిహి శశాదశ్చ సఏవహీతి, ఆనందరామాయణేచ.

౧౬. ఆతనికి నూర్గురుపుత్రులుగల్గిరి. ఆనూర్గురు పుత్త్రులలో విచిత్ర చరిత్రముగల వారలు మువ్వురుండిరి. (వికుక్షి, నేమి, దండుడు, అను వారలు)

౧౭. ఆపుత్రులలో శకుని మొదలగు నేఁబదిమందిపుత్త్రులు ఉత్తరదేశమును బరిపాలించుచుండిరి. మిగిలిన వారిలో నలుబది యేడుగురు దక్షిణదేశమునుఁ బరిపాలించుచుండి-.

౧౮. ఇక్ష్వాకు పుత్త్రులలో జ్యేష్ఠుండగు వికుక్షి, గుణగణముచే శ్రేష్ఠుఁడైయుండెను.

౧౯. ఇక్ష్వాకు మహారాజొకప్పుడష్టకా శ్రాద్ధముచుజేయఁదలచి, వికుక్షిని మాంసమును దెచ్చుటకు నియమించెను.

౨౦. అతఁడు తండ్రిచే నియమింపఁబడి, వేటకుఁబోయి, శ్రాద్ధార్హములగు మృగములను గొన్నిటిని జంపి, శ్రమచే నొకచోట విశ్రమించి క్షుద్బాధచే నొకకుందేటి మాంసమును భుజించి, పిమ్మట గృహమునకు వచ్చెను.

౨౧. ఇట్లు వికుక్షి, మాంస సహితముగా గృహమునకు రాఁగా నిక్ష్వాకుఁడు తనగురువగు వసిష్ఠుతో, మాంసమును బ్రోక్షించవలసినదిగాఁ జెప్పెను.

౨౨. అవ్వసిష్ఠుఁడు వికుక్షిచే దీసికొని రాఁబడిన మాంసమును జూచి యాగ్రహించి రాజుతో నిట్లనెను, ఓరాజా! క్షుద్రబుద్ధిగల నీ పుత్త్రునిచే మాంస మపవిత్రముగాఁ జేయఁబడినది.

౨౩. ఓరాజా! దురాత్ముఁడగు నీపుత్త్రునిచే నొక చెవులపిల్లి మాంసము భక్షింపఁబడిన కారణమున, ఈమాంసము భుజింపఁదగనిదయ్యెను. ఇతఁడులోకమున శశాదుఁడను నామముతోఁజెప్పబడును.

౨౪. ఇక్ష్వాకువు పిదపఁ గోపముతోఁ దనపుత్రుఁడగు, వికుక్షినిగూర్చి యిటులపలికెను.

పితృకర్మణి నిర్దిష్టో మయా త్వం మృగయాం గతః।
శశం భక్షయసే ఽరణ్యే నిర్ఘృణః పూర్వమద్య నః॥ ౨౫

శ్లో॥ తస్మాత్పరిత్యజామి త్వాం గచ్ఛ త్వం స్వేన కర్మణా।
ఏవ మిక్ష్వాకునా త్యక్తో వసిష్ఠేన నివారితః॥ ౨౬

*1శ్లో॥ ప్రజాసంక్షోభకరణా దిక్ష్వాకో ర్దండ ముత్సృజత్।
పిత్రా నిష్కాసితో దండః వనం గత్వాఽటవీజనాన్
వశీకృత్యాయం తేషాం ప్రభుభూత స్సమావసత్॥ ౨౭

శ్లో॥ సంపాద్య రాజ్యం గహనే స్థిత స్సన్నేకదా తు సః।
శుక్రకన్యాం తపస్యంతీం దృష్ట్వా మోహవశంగతః॥ ౨౮

---

* ప్రజాసంక్షోభ ఇతి — దండో నామకశ్చి దిక్ష్వాకుసుత, స్తత్పుత్రశతాంతర్గత ఏవాసీత్, సస్వప్రజానాం పీడాకరత్వాత్, సతుపిత్రా నిష్కాసితః కస్మింశ్చిద్వనే త్వాటవికై ర్మిళిత్వా తేషా ముపరి ప్రభుర్భూత్వా క్రమేణ రాజ్యమపి సంపాద్య, స్థిత స్సన్కదాచన శుక్రకన్యాం బలాత్కృతవాన్, తత్పితృశుక్రశాపా త్సప్తాహాభ్యంతరే తద్రాజ్యే మృద్వృష్టిపతనా త్సర్వం తద్రాజ్యం వినష్ట మభవత్ క్రమేణ వన మప్యభూత్ తదేవ దండకారణ్యమితి, లోకే ప్రథితమితి, దండ ఏవ దండక ఇతివ్యుత్పత్తిః

---

1. విష్ణుపురాణే

శ్లో॥ బలాత్కృత్యచ తాం దండః శప్త స్తద్గురుణాఽభవత్ ।
శుక్రశాపాత్తు తద్రాజ్యం వినష్ట మభవ ద్ధ్రువం
తదేవ దండకారణ్య మిత్యద్యాపి ప్రథాం గతం॥ ౨౯, ౩౦

*¹శ్లో॥ నిమి ర్నామ మనోః పౌత్రః వికుక్షే రనుజ స్తు యః।
సశాపేన వసిష్ఠస్య విదేహా స్స్వయమభవ్యత॥ ౩౧

---

* నిమిరితి—ఇక్ష్వాకుసుతానాం మధ్యే త్రయో, విచిత్రచరితా, ఇతి. ప్రథమత, స్తూక్తం. ఏకః, వికుక్షిః, ద్వితీయో, దండః, తృతీయః, నేమిరితి, ద్వయో, ర్వృత్తాంత ముక్త్వా, తార్తీయీకం, బ్రవీతి నేమి, స్సర్వదా, యజ్ఞాదీ, న్కర్తవ్యాసీత్, ఓకవారం, నేమి, స్స్వగురుం, వసిష్ఠ, ముపసృత్య యాగం, కారయేత్యు వాచ, సగురుస్తు, ఇతః పూర్వమేవ, యాగం కృతవానసి, పున, రిదానీమేవ, యాగం, కరోషి చేత్, యాజకస్య, మమాపి, శ్రమ, స్సంభవేత్, తస్మాత్కించిత్కాలముపేక్ష్య, పశ్చాత్కుర్వేత్యు వాచ, సనేమిస్తు, ధర్మస్య, త్వరితా, గతి రితిన్యాయేనా, ద్యైవ, కర్తుం, సముద్యక్తోఽహం, మాన్యథావ క్తవ్యమితి, ప్రార్థయామాస, సగురుస్తునాగంతు మద్యాహ మఃమితి యదావద త్, తదానేమి రన్యం గురు మానీయ యాగం కరవాణీత్యు వాచ, తదావసిష్ఠశ్శశాప త్వం విదేహోఽభవేతి.

---

1. వాయుపురాణే॥ ౮౯ అధ్యాయే

౨౯౫-౩౦. అదండుఁడు. శుక్రకన్యకను బలాత్కరింపఁగా నామె తండ్రి తోఁజెప్పగా నాశుక్రుఁడు దండుని నిట్లు శపించెను. ఓదండుఁడా. నీరాజ్యము ఏడుదినములు మట్టివానకురిసి నష్టముగుగాక నీవును నశించెదవుగాక" ఇట్లు శుక్రశాపమువలన దండుఁడు నిజరాజ్యముతోఁగూడనశించెను. నష్టమైన దండకరాజ్యప్రదేశ మరణ్యమగుటచే దండకారణ్యమని ప్రసిద్ధినొందెను. దండునకే దండకుఁడనియు నామాంతరము కలదు.

*౩౧ ఇక్ష్వాకు పుత్రులలో నిమియనురాజు వసిష్ఠునిశాపముచే విదేహుడయ్యెను (దేహములేనివాడయ్యెను).

---

* (నిమి, విషయము చెప్పఁబడుచున్నది)

(మనుపుత్త్రులలో ముగ్గురు విచిత్రచరిత్రులు కలరని ప్రథమముననె చెప్పబడినది (1 వికుక్షి, 2, దండుఁడు, 3, నిమి) ఇరువురవృత్తాంతములఁ జెప్పి, మూడవవాఁడగు నిమి వృత్తాంతము చెప్పఁబడుచున్నది.

నిమియను రాజు (రాజ్యముబాలించుచు) నెల్లప్పుడు యాగముల నుజేయుచుండెను. ఒకప్పుడు నిమి తనగురువగు వసిష్ఠుని సమీపించి గురువర్యా! నేను మరల యాగము జేయుటకు సంకల్పించితి నేయింపుమన నవ్వసిష్ఠుడు నిమిరాజోత్తమా? ఇంతకుఁపూర్వము యాగము నుజేసి మరల నిప్పుడే యాగముఁజేసితివని, యాజకుడనగు నాకును గష్టముగా నేయుఁడును. కానకొంత కాలము పేక్షించి యనంతరమునఁ జేయుమనియెను. అప్పుడు నిమియనురాజు నిట్లనెను ధర్మకార్యముఁ జేయవలెనని సంకల్పముపొడమి నపుడే దానిని నెరవేర్చవలెనని శాస్త్రోక్తిచే నేనిప్పుడే చేయుటకుద్యమించితిని. మఱియొకవిధముగాఁ జెప్పకుడని ప్రార్థింపఁగా నవ్వసిష్ఠుఁడు నీవిపుడే చేసినచో నేను వచ్చుటకువీలుకాదనఁగా, నిమిచక్రవర్తి, మఱియొకపురోహితు చేర్చుకొనియజ్ఞముఁ చేసెదనని వసిష్ఠునితోఁ జెప్పెను-అప్పుడు వసిష్ఠుఁడు కోపగించి నీవువిదేహుఁడవగుమని శపించెను.

శ్లో॥ వైవస్వతమనోః పుత్త్రః ఇక్ష్వాకుర్బ్రహ్మణో వరాత్ ।
దివ్యం యానం సమాసాద్య నారాయణపరాయణః
3 షట్త్రింశచ్చసహస్రాణి త్వబ్దాన్ రాజ్యం తదాకరోత్ ॥ 32

1 శశాదోఽప్యథ ధర్మ్మేణ స్వప్రజాః పరిపాలయన్ ।
శతహీనాం స్తదబ్దాంశ్చ రాజ్యం కృత్వా దివం గతః॥ 334

* శశాదస్య తు దాయాదః కకుత్థ్సో నామ వీర్యవాన్ ।
1 ఇంద్రస్య వృషభూతస్య కకుత్స్థేన । సస్స్మృతః
2 కకుత్థ్సేన కృతం రాజ్యం శతహీనం తదబ్దకం॥ 38_39

---

* వికుక్షేరేవ శశాదఇతి నామాంతర మితి పూర్వం ప్రతిపాదితం తస్యపుత్త్రః పురంజయః తస్యైవకకుత్థ్సఇతి నామాంతరం కర్మణాసమభూదిత్యత్రప్రమాణం మానంద రామాయణాదికం తథాహి—వికుక్షేస్తు కకుత్థ్సశ్చ। సఏవాత్ర పురంజయ ఇతి" పరంతు కకుత్థ్స ఇతి నామపురంజయస్య కథమాగత మిత్యత్ర బ్రహ్మాండ వాయు లింగ పాద్మాదిషు

---

3. భవిష్యపురాణే ప్రతిసర్గపర్వణి । అధ్యాయం.

1 శశాదస్య రాజ్యపాలన కాలః (36800) ఇతి భవిష్యే
శశాదస్యేక్ష్వాకుపుత్త్రత్వే ఆనంద రామాయణంచప్రమాణం
కకుత్థ్స రాజ్యపాలన కాలః 36700) ఇతి భవిష్యే.

౩౨. వైవస్వతమను పుత్త్రుడగు నిక్ష్వాకువు వైవిధమున సూర్య్యని పుత్త్రులం గలవాఁడై యెల్లప్పుడు భగవద్భజన జేయుచు బ్రహ్మదేవుని వరప్రభావముచే నొకదివ్యవాహనముఁ బొందిదానితో సంచరించుచు మూప్పదియారువేల సంవత్సరములు రాజ్యపరిపాలనము జేసి తనపుత్త్రులలో జ్యేష్ఠుఁడగు శశాదునకే రాజ్యమునిచ్చి వైకుంఠమునొందెను.

(౩౩) తా|| అనంతరము, ఇక్ష్వాకు మహారాజు పుత్త్రుడు వికుక్షియను నామాంతరముచే నొప్పు శశాదుడను రాజుధర్మముతోఁదనప్రజలను బాలించుచుఁ దన తండ్రికంటె నూరు సంవత్సరములు తక్కువగా (అనఁగా ౩౫౯౦౦సం|| రాజ్యముఁజేసి పిమ్మట స్వర్గమునకేగెను.

(౩౪-౩౫) శశాదుని యనంతరము తత్పుత్రుఁడగు పురంజయుఁడు రాజ్యమునుఁ బాలించెను. అతడు రాజ్యమును బాలించుకాలమున దేవదానవులకు యుద్ధముజరిగి యాయుద్ధమున నింద్రాదులు పరాజయము నొంది విష్ణునొద్దకేగి తమ యపజయవృత్తాంతమునుఁ జెప్పికొనఁగా నమ్మాధవుఁడు" పురంజయుఁడను రాజునందు నాశక్తినిఁ బ్రవేశపెట్టెదను మీరు వానిని సహాయునిఁగాఁ గోరితీసికొనివచ్చితిరిగి యుద్ధము చేసినచో నారాక్షసులు నశించెదరని చెప్పఁగా, నింద్రుఁడు పురంజయుని సహాయునిగాఁ గోరెను అతఁడు మహేంద్రునితో నిట్లనెఁ జెప్పెను. నీవువృషభరూపమును ధరించినయెడల నీమూపురముమీదనెక్కి యుద్ధముచేసి రాక్షసంహారముఁ జేసెదనన నందునకమ్మహేంద్రుం డంగీకరించి వృషభరూపముండఁగా నతని మూపురమునఁ గూర్చుండి యుద్ధముఁజేసి విష్ణ్వంశము తనయందుఁ బ్రవేశించియుండుటచే దానవులనుసంహరించెను అతఁడు వైవిధము * వృషభరూపముగల యింద్రునిమూపురమునందుండి యుద్ధముఁజేసి

౩ అనేనాస్తు కకుత్స్థస్య దాయాదః పరికీర్తితః।
శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ ౩౬

---

తత్ప్రతిపాదితం తథాహి॥ ఏకదా। దేవదానవానాం సమరే దేవాః పరాభూతా హరిం శరణమాగతా స్స్వం తస్మైన్యవేదయన్, తదా శ్రీహరి స్తానాహ భో దేవాః! భూలోకే,పురంజయోనామ, రాజాఽస్తి, మత్తేజ స్తస్మి న్నావేశయేయం, తం, సహాయంకృత్వా, పునస్సమరం దానవైఃకురుత, జయస్సంభవేద్వ స్త్వితి తచ్ఛ్రుత్వా మహేంద్ర స్స్వయ మేత్య, పురంజయం సహాయం, వవ్రే సపురంజయం స్త్వేవమవోచత్ మహేంద్ర యదిత్వం వృషరూపం ధృత్వా, వాహన భూత, స్స్యాశ్చే త్తదా, సమాగచ్ఛేయ మహమితి. మహేంద్రోపితథైవాభవత్, తదాపురంజయః, వృషభూతస్య, మహేంద్రస్య, కకుది, స్థిత, స్సమరే దానవా న్నిహత్యాగతః, తస్మాత్కకుత్స్థ, ఇతి గౌరవనామ సమభూత్ ఏవం పురంజయస్య, కకుత్స్థ, ఇతినామాంతరం॥ సతుకకుత్థ స్స్వపితుశ్శతహీనాః పూర్వోక్తాబ్దాన్ రాజ్యం, కృతవానితి.

---

౩ అనేనసః పాలనకాలః (౩౫౪౦౦) ఇతి భవిష్యే

౩౮. కకుత్స్థునియనంతరము వానిదాయాదుడు అనేనుఁడు" అను రాజు భూమినిఁబరిపాలించెను. అతఁడును తనతండ్రికంటె నూరుసంవత్సరములు తక్కువగా (అనఁగా (౩౫౮౦౦) సంవత్సరములు) భూమి యందు రాజ్యపాలనము చేసెను.

---

న కారణముచేతఁ గకుత్స్థుఁడనిబిరుదునామము కలిగెను. అప్పటినుండిక కుత్స్థుఁడని పురంజయునకు నామాంతరము గలిగెను ఆకకుత్స్థుఁడును దనతండ్రిపరిపాలనకాలముకంటె నూరుసంవత్సరములు తక్కువగాఁ అనఁగాముప్పదియైదు వేలయెనిమిదివందలసంవత్సరములు రాజ్యమును బాలించి పిమ్మట స్వర్గస్థుఁడయ్యెను.

శ్లో॥ పృథు[1] రానేన స శ్చాపి శతహీనం తదబ్దకం ।
రాజ్యం చకార ధర్మేణ స్వప్రజా స్స్వనురంజయన్ ॥32

శ్లో॥ తస్మాజ్జాతో విశ్వకశ్చ[2] శతహీనం తదబ్దకం ।
రాజ్యంచకార ధర్మేణాప్యాసముద్రాంమహీమిమాం॥33

శ్లో॥ తదాత్మజ స్త్వార్ద్రికోపి శతహీనం తదబ్దకం ।
ఆసముద్రక్షితీశానో పాలయామాస ధర్మతః॥ 34

---

వ్యా॥ అయం పృథు రన్యః వైవస్వత మన్వంతరాం తర్గతః, యేన గోరూపధరా, భూమి ర్దుగ్ధా, యేన భువః పృథ్వీతి వ్యవహృతి ర్లోకేసమజని సచాయం పృథుః చాక్షుషమన్వంతరీయ ఇతి వాయుపురాణే 62 అధ్యాయే దృశ్యతే. తథాహి॥ శ్లో॥చాక్షుషస్య నిసర్గేతు సంభూతః కశ్యపాన్వయే తస్యాన్వవాయే సంభూతః పృథుర్వైన్యః ప్రతాపవానితి॥

2 పృథోఃపుత్రఃవిశ్వ ఇతి లింగపురాణే॥

విష్వగశ్వ ఇతి భవిష్యే—

పృషదశ్వ ఇతి వాయావభిన్నథావర్తతే ఏకస్యైవతాని నామాంతిరాణీత్యను సంధేయం ఆర్ద్రికః విశ్వకపుత్ర ఇతి లింగపురాణే భవిష్యే చ వర్తతే.

---

1 వాయుపురాణే 85 అధ్యాయేభవిష్యపురాణే ప్రతిసర్గే రాజ్యకాలనిర్ణయశ్చ

* 1 పృథోః రాజ్యపాలనకాలః, సం॥ 35600—

2 విశ్వకపాలన కాలః ...సం॥ 35500

3 ఆర్ద్రికపాలన కాలః ...సం॥ 35400

* ౩౬ తా॥ ఆ వేనసునిపుత్రుఁడగు పృథువు తండ్రికంటె నూఱు సంవత్స రములు తక్కువగా (అనఁగా ౩౫౬౦౦) సం॥ ప్రజలను సంతోష పెట్టుచు ధర్మముగ రాజ్యమును బాలించెను.

౩౭ తా॥ పృథుపుత్రుఁడగువిశ్వకుఁడును జలుస్సముద్రపర్యంతముగల భూమి నంతనుధర్మముగాఁబరిపాలించెను. అతనిరాజ్యపాలనకాలముతండ్రి కంటె నూఱుసంవత్సరములు తక్కువ(అనఁగా౩౫౫౦౦) సంవత్స రములని యెఱుంగనగును.)

౩౮ తా॥ విశ్వకుని పుత్రుఁడగు నార్ద్రకుఁడును దనతండ్రికంటె నూఱుసంవ త్సరములు తక్కువగా (౩౫౪౦౦ సం॥) సముద్ర పర్యంతకమైన రాజ్యమును ధర్మముగఁ బాలించెను.

---

* వైవస్వతమన్వంతరాంతర్గతుఁడగు నీపృథువువేఱని యెఱుఁగునది,ఏపృథువు వలన భూమికి పృథివి యనివ్యవహారము కల్గెనో, గోరూపమును ధరిం చిన భూమియందుసర్వౌషధులను నేపృథువు పిదికెనో,యాపృథువు చాక్షుషమన్వంతరాంతర్గతుఁడని వాయుపురాణమున ౯౩ అధ్యా యమునఁ జెప్పబడినది. (ఏమన) చాక్షుషమన్వంతరమునందు కశ్య పవంశీకుఁడగు వేనుఁడు, అను రాజుయొక్క దక్షిణహస్తమునుమథిం చగాఁబుట్టిన పృథువు చక్రవర్తియు మహాప్రతాపవంతుఁ డౌకఁడు. కలఁడని॥

శ్లో॥ యువనాశ్వ స్తత్సుతశ్చ శతహీనం[1] తదబ్దకం।
రాజ్యంకృత్వాదివం యాతఃధర్మతఃపాలయన్ప్రజాః॥ ౪౦

శాబస్తిఃపాలయామాస శతహీనం[2] తదబ్దకం
అసమద్రక్షితం ధర్మా చ్ఛాబస్తీ యేన నిర్మితా॥ ౪౧

ఉదయా దస్తపర్యంతం తైర్న్యపై ర్భూమిమండలం।
భుక్తం నీతిపరై ర్భూపైః శ్రావస్తేన చ భూతలే॥ ౪౨

శ్లో॥ శ్రావస్తస్యతు దాయాదః బృహదశ్వో మహాయశాః
* శతహీనం[2] కృతం రాజ్యం తేనరాజ్ఞాపి భూతలే॥ ౪౩

1శ్లో॥ కువలాశ్వం స్వపుత్రంతు శూరముత్తమ ధార్మికం
బృహదశ్వోஉభ్యషించత్తం తస్మిన్రాష్ట్రేనరాధిపః
పుత్రసంక్రామితశ్రీకః వనం గతు మియేష సః॥ ౪౪

---

1 వాయౌ 88 అధ్యాయే ఆనందరామాయణేచ వంశక్రమోஉస్తి లింగపురాణే 65 అధ్యాయేచ॥

| | |
|---|---|
| 2 శాబస్తిరాజ్యకాలః | సం—351000 |
| 1 యువనాశ్వరాజ్యకాలః | సం—35300 |
| 3 బృహదశ్వరాజ్యకాల | సం—35000 |

సర్వేషాం రాజ్ఞాం రాజ్యపాలన కాలనిర్ణయస్తు భవిష్య పురాణేప్రతిసర్గేలిఖితఃతమనస్మృత్యైవ మయాత్రలిఖ్యతే.

౮౦ తా॥ ఆర్ద్రిసవిపుత్త్రుఁడగు యువనాశ్వుఁడు తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా ౩౬౨౦౦ సం॥) రాజ్యమునుఁ బాలించి స్వర్గస్థుడయ్యెను"

౮౧ యువనాశ్వ పుత్త్రుడగు శాబస్తియనురాజు తన పేరుతో శాబస్తియను పత్తనమును నిర్మింపఁజేసి సముద్రపర్యంతకమైన భూమిని ధర్మముతోఁ బాలించెను. అతని రాజ్యపాలన కాలము ౩౬౧౦౦ సంవత్సరములని యెఱుఁగనగు"

౮౨ తా॥ ఇక్ష్వాకువంశీయులగు రాజులందఱును నీతితో నుదయాద్రిమొదలుకొని యస్తాద్రి పర్యంతము భూమినిఁ బాలించినవిధముననే శాబస్తియును భూమండలమును ఉదయాద్రిమొదలుకొని యస్తాద్రి పర్యంతము పరిపాలించెను శాబస్తికిఁ శ్రావస్తుఁడని యను నామాంతరమని యెఱుఁగవగను.

౮౩ శాబస్తిపుత్త్రుఁడగుబృహదశ్వుఁడు మహాకీర్తినిసంపాదించి తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా ౩౬౦౦౦ సంవత్సరములు) రాజ్యముచు బాలించెను.

౮౪॥ బృహదశ్వమహారాజు తనపుత్త్రుఁడును శూరుఁడును ధార్మికుఁడునగు కువలయాశ్వునిఁ బట్టాభిషిక్తుఁగాఁజేసి పుత్త్రునకు రాజ్యలక్ష్మిని సంక్రమింపఁజేసి తపస్సుఁ జేసికొనుటకు వనమునకుఁగూర్చి పోవ నిశ్చయించెను.

శ్లో॥ బృహదశ్వం మహారాజం శూర ముత్తమ ధార్మికం ।
[1] ఉత్తంకస్తు ప్రయాంతంతం బ్రహ్మర్షిః ప్రత్యవారయత్॥ ౪౫

ఉత్తంకః॥శ్లో॥ భవతా రక్షణం కార్యం తత్తావత్కర్తుమర్హతి
నమద్యోగస్త్వయా కర్తుం నహిశక్నోమి పార్థివ॥ ౪౬

శ్లో॥మమాశ్రమ సమీపేషు సమేషు మరుధన్వసు!
సముద్రో వాలుకాపూర్ణః తత్ర తిష్ఠతి భూపతే॥ ౪౭

శ్లో॥ దేవతానా మవధ్యస్తు మహాకాయో మహాబలః।
అంతర్భూమిగత స్తత్ర వాలుకాంతర్హితో మహాన్॥౪౮

శ్లో॥ దంధు ర్లోకవినాశాయ తపఆస్థాయదారుణం।
సంవత్సరస్య పర్యంతే సనిశ్వాసం విముంచతి
యదాతదా మహీ తత్ర చలతిస్మ సకాననా॥ ౪౯-౫౦

శ్లో॥ తస్యనిశ్వాస వాతేన రజఉద్ధూయతే మహత్
ఆదిత్యపద మావృత్య సప్తాహం భూమికంపనం॥ ౫౧

శ్లో॥ సవిస్ఫులింగం సజ్వాలం సధూమమతిదారుణం ।
తేనరాజ న్నశక్నోమి తస్మిన్ స్థాతుం స్వఆశ్రమే॥ ౫౨

---

1 వాయు పురాణే 88 అధ్యాయే.

౪౫ తపోవనమునకుఁ బోవుచున్నట్టియు, ధార్మికుఁడును మహాశూరుఁడు నగు బృహదశ్వమహారాజు నొద్దకు” ఉత్తంకమహర్షి వచ్చి తపోవనమునకుఁ బోవనుద్యుక్తుఁడైన యాబృహదశ్వ మహారాజును వారించి యిట్లు బల్కెను.

౪౬ ఓబృహదశ్వుఁడా! నేను నిర్భయముగాఁ దపముచేసికొనుటకువీలు లేకుండ నున్నందున నీవు నా యాశ్రమమునకువచ్చి రక్షణముచేయవలయును. కానఁ దపోవనమునకుఁ బోవఁజనదు.

౪౭ ఓబృహదశ్వుఁడా? నాయాశ్రమ సమీపమునందు సముద్రసంబంధమగు నిసుక తిప్పయొకటి యున్నది.

౪౮ ఆభూమిలోపల నిసుకచేఁ గప్పఁబడి గొప్పశరీరముగలిగి మహాబలవంతుఁడై దేవతలకు నవధ్యుఁడైన దుంధువను పేరుగలవాఁడొకఁడు కలఁడు”

౪౯-౫౦ తా॥ ఆదుంధువనువాఁడు లోకనాశమగునట్లు దారుణమగు తపమునుఁజేయుచు సంవత్సరమునకొక పర్యాయము నిట్టూర్పు వాయువును వదలుచుండును. అట్లు వదలినపుడు భూమి పర్వతారణ్యములతోఁ గూడఁ గంపించును.

౫౧-౫౨ తా॥ ఆదుంధువు వదలిన నిశ్వాసవాయువుచే భూమినుండి గొప్ప ధూళి బయలుదేరి సూర్యమండలమును వ్యాపించి యేడు దినముల పర్యంతము భూకంపమును జేయుచునే యుండును. మఱియు నాధూళి యగ్నిజ్వాలలతోను, ధూమముతోను నిండి భయంకరమై యున్న కారణముచేతను నేను నాయాశ్రమమునందుఁ దపముజేసికొనఁ జాలకుంటిని.

1 శ్లో॥ తం వారయ మహాబాహో లోకానాం హితకామ్యయా
త్వం పాపస్య వధార్థాయ సమర్థః పృథివీపతే॥ ౫౩

శ్లో॥ ఏవ ముక్తస్తు రాజర్షి రుత్తంకేన మహాత్మనా
కువలాశ్వం సుతం ప్రాదా త్తస్మై స్తుంధునివారణే॥ ౫౪

శ్లో॥ రాజా సస్య స్తతస్తో ప్రిహ మయం తు తనయో మమ
భవిష్యతి ద్విజశ్రేష్ఠ దుంధుమారో నసంశయః॥ ౫౫

శ్లో॥ సతం త్వాదిశ్య తనయం దుంధుమారణ కర్మణి।
జగామ పర్వతాయైవ తపసే బృహదశ్వకః॥ ౫౬

శ్లో॥ కువలాశ్వస్తు ధర్మాత్మా పితు ర్వచన మాస్థితః
సహస్రై రేకవింశత్యా పుత్రాణాంసహ పార్థివః
ప్రాయా దుత్తంక సహితో దుంధో స్తస్య నివారణే॥ ౫౭

శ్లో॥ త మావిశ త్తతో విష్ణుర్భగవా న్స్వేన తేజసా।
ఉత్తంకస్యనియోగాత్తు లోకానాంహిత కామ్యయా॥ ౫౮

శ్లో॥ తస్యపుత్రైః భవద్భిస్తు వాలుకాంతర్హిత స్తదా
దుంధు రాసాదిత స్తత్ర దిశ మాశ్రిత్య పశ్చిమాం॥ ౫౯

శ్లో॥ సర్వే దుంధుముఖశ్వాసానిలదగ్ధా స్త్రయ స్సుతాః।
అవశిష్టా దృఢాశ్వస్తు చంద్రాశ్వ కపిలాశ్వకౌ॥ ౬౦

---

1 వాయుపురాణే 83 అధ్యాయే.

౫౩,౫౪,౫౫ మహాశూరుడవగు నో బృహదశ్వమహారాజా! వానిని వధించు టకు నీవు సమర్థుడవు కాన లోకహితముకొఱకు వానిని వధింపుమని యుత్తంక మహర్షి బృహదశ్వమహారాజుతోఁ జెప్పగా నాబృహదశ్వుడును దుంధువను రాక్షసుని సంహరించుటకుఁ దన పుత్రుడగు కువలాశ్వుని నియోగించి యామహర్షితో నిటులఁబల్కెను. ఓయుత్తంకమహర్షి! నేను శస్త్రసన్యాసమును జేసియుంటిని కానఁ దిరిగి శస్త్రమును ధరించుట న్యాయము కాదు కాన నా కుమారుడు నీ వెంటవచ్చి దుంధువును సంహరించును. సందియ మొందవలదనెను.

౫౬ బృహదశ్వమహారాజు దుంధుమారణమునకుఁ బైవిధముగఁ దనపుత్రుని నియోగించి యుత్తంకమహర్షి యానతిచేఁ దపోవనమునకేగెను.

౫౭ ధర్మాత్ముడగు కువలాశ్వుడును తన తండ్రి యానతిచే దుంధువును సంహరించుటకు నిరువదియొక్కవేల సంఖ్యగల తనపుత్రులతోడను, మహర్షితోడను గూడి దుంధువు తపము చేయుచున్న పశ్చిమసముద్రతీరమునకుఁ బోయెను.

౫౮ అపుడా మహర్షియును కువలాశ్వునియందు విష్ణుతేజమును బ్రవేశపెట్టుటకు విష్ణుమూర్తిని బ్రార్థింపఁగా నామాధవుడును మహర్షికోరిక ననుసరించి తన తేజమును లోకహితముకొఱకుఁ గువలాశ్వుని యందుఁ బ్రవేశపెట్టెను.

౫౯ తా॥ కువలాశ్వపుత్రులు పశ్చిమసముద్రతీరమునందలి వాలుకాప్రదేశమును (ఇసుకదిబ్బను) త్రవ్వగా దుంధువను రాక్షసుడు కనపడెను

౬౦ అప్పుడు దుంధువు దీర్ఘముగా వేడినిట్టూర్పును విడువగా వానిశ్వాసాగ్నిచేఁ గువలాశ్వపుత్రులందఱు దగ్ధమైరి. పైవిధముగఁ గువలాశ్వపుత్రులు (21000) లో (20997) దగ్ధముకాగా దృఢాశ్వుడు చంద్రాశ్వుడు, కపిలాశ్వుడు అను మువ్వురు మాత్రము మిగిలిరి.

తతస్సరాజాఽతి బలో దుంధుం సంహృత్యవాం స్తదా
ఉత్తంకశ్చవరం ప్రాదాత్ తస్మైరాజ్ఞే మహాత్మనే
అదాత్తస్యాక్షయం విత్తం శత్రుభిశ్చాపరిధృష్యతాం॥ ౬౨

1॥ శతహీనం కృతం రాజ్యం కువలాశ్వేన భూతలే
దుంధుమార సమాఖ్యాం చలేభే సకువలాశ్వకః॥ ౬౩

2॥ శతహీనం కృతం రాజ్యం తత్పుత్రేణ మహాత్మనా
దృఢాశ్వేన యథాన్యాయం। స్వప్రజాస్త్వభిరక్షతా॥ ౬౪

3॥ దృఢాశ్వస్య తు దాయాదః నికుంభస్త్వ భవన్నృపః
సహస్రహీనం రాజ్యం తు కృతం తేన మహాత్మనా॥ ౬౫

4॥ నికుంభస్య చ దాయాదః సంహతాశ్వోఽభవ న్నృపః
సహస్రహీనం రాజ్యం తు కృతం తేన చ భూతలే॥ ౬౬

5॥ సంహతాశ్వసుత శ్చాభూత్ రణాశ్వ ఇతి విశ్రుతః
సహస్రహీనం రాజ్యం తత్కృతం తేనాపి భూతలే॥ ౬౭

ద్వితీయస్సర్గ స్సమాప్తః.

---

1 వాయు పురాణే కాల నిర్ణయస్తు భవిష్యే:—

1. కువలాశ్వ రాజ్యపాలన కాలః 34900.
2. దృఢాశ్వపాలన కాలః సం. 34800,
3. నికుంభ రాజ్య కాలః సం 33800.
4. సంహతాశ్వపాలన కాలః సం. 32800,
5 రణాశ్వపాలన కాలః 31800.

౬౧ ౬౨ తా॥ పిమ్మట విష్ణుశక్తి కలిగిన కువలాశ్వుఁడు దుంధువను రాక్షసుని సంహరించెను. ఉత్తంకమహర్షియును సంతసించి కువలాశ్వ మహారాజునకు వరములనిచ్చెను. (ఆవరము లెవ్వియన ధనమక్షయముగ నుండుటయు శత్రువులకజేయుఁడగుటయు ననియెఱుఁగనగును.)

౬౩ తా॥ ఆకువలాశ్వుఁడు దుంధువును సంహరించిన కారణమున దుంధుమారుఁడని ప్రసిద్ధినొందె. తనతండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా 34900) సం॥ రాజ్యమును బరిపాలించెను.

౬౪ ఆ కువలాశ్వుని పుత్రుఁడగు దృఢాశ్వుఁడును యథాన్యాయముగఁ దన ప్రజలను రక్షించుచుఁ దన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (34800 సం॥) రాజ్యమును బాలించెను.

౬౫ తా॥ దృఢాశ్వుని దాయాదుఁడగు నికుంభుఁడను రాజును పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (33300సం॥) రాజ్యమును పాలించెను.

౬౬ నికుంభుని దాయాదుఁడగు సంహతాశ్వుఁడను రాజు పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (32800 సం॥) భూమిని పాలించెను.

౬౭ తా॥ సంహతాశ్వుని పుత్రుఁడగు రణాశ్వుఁడును పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (31800సం॥) భూమియందు రాజ్యమును బాలించెను.

ద్వితీయ సర్గము సమాప్తము.

## తృతీయసర్గ ప్రారంభః

1॥ అథతస్యసుతో లోకే । యువనాశ్వఇతిశ్రుతః.
సహస్రహాయనంరాజ్యంతు కృతవాన్ఖ్యాతలేన్నృపః॥ ౧
అత్యంతధార్మికా గౌరీ తస్య పత్నీ పతివ్రతా॥

అనపత్యత్వనిర్వేదా ద్దృష్ట్వాశ్రమగతో నృపః
తేనవై కారయామాస రిష్టిం పుత్త్రప్రదాం చ తే॥ ౨౹

తస్యా మిష్టౌ మధ్యరాత్రే మంత్రపూతజలాన్వితం
కలశం వేదిమధ్యేచ నివేశ్య సుష్పుప్సతే॥ ౩౹

పిపాసయా నృపో రాత్రౌ తజ్జలం కలశే స్థితం
స్వభార్యాగర్భసంధాయి పపా వజ్ఞానితావశాత్॥ ౪

యువనాశ్వోదరే గర్భో వవృద్ధే క్షణమాత్రతః
దక్షిణాంకుక్షితో భిత్వా నిశ్చక్రామోదరం శిశుః॥ ౫౹

---

1. యువనాశ్వపరిపాలనకాలః (30800) సం॥
యువనాశ్వఃరణాశ్వపుత్రఇతి లింగపురాణే
ప్రసేనజిత్పుత్రఇతి వాయవా భిన్నథాపర్తతే
ఏకస్యైవరణాశ్వఇతిప్రసేన జిదితి
నామాంతర మిత్యాహ్యం.

## మూడవ సర్గము.

* ౧ అనంతరము రణాశ్వుని పుత్త్రుడగు యువనాశ్వుడనురాజు తన తండ్రికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (30810 సం॥) రాజ్యమును బరిపాలించెను.

౨॥ తా॥ ఆయువనాశ్వుని భార్యయగు గౌరీదేవియుఁ బతివ్రతయును ధార్మికురాలునైయున్నది. కానివారిద్దరకు సంతానము లేనందున గనువిచారముతోనుండిరి. ఒకప్పుడు యువనాశ్వుడు తనభార్యతోగూడ ఋష్యాశ్రమమునకు వెళ్ళి యచ్చటి మహర్షులతోఁ దమయనపత్యత్వమునుగూర్చి చెప్పుకొనగా వారలు యువనాశ్వునిచే బుత్త్రకామేష్టినిఁ జేయించిరి.

౩॥ మహర్షులు యువనాశ్వుని భార్యకు గర్భధారణమగునటుల మంత్రోదకము నభిమంత్రించి యా జలమును గలశము నందుంచి ప్రాతఃకాలమున యువనాశ్వుని భార్యకా జలము నివ్వదలచి మంత్రోదకముతో నిండినకలశమును వేదిమధ్యయందుంచి యా రాత్రిభాగమున నమ్మహర్షులు నిద్రించిరి.

౪॥ తా॥ తనభార్యకు గర్భోత్పత్తినిఁ గలుగఁజేయు కలశమందలి జలమును యువనాశ్వుడు తెలియక దాహముచేఁ బానముచేసెను.

౫॥ తా॥ గర్భోత్పత్తినిఁ గలుగఁజేయు మంత్రోదకమును యువనాశ్వుడు త్రాగుటవలన వెంటనే యా యువనాశ్వునకు గర్భముకలిగి క్షణమాత్రములో వృద్ధినొందెను. ఆగర్భమునందలి శిశువు బయటబడుటకు మార్గాంతరము లేనందున తనబొటనవ్రేలితో నా యువనాశ్వుని యుదరమును జీల్చుకొని బయటఁబడెను.

---

* యువనాశ్వుడు రణాశ్వపుత్త్రుడని లింగపురాణమునందును, ప్రసేనజిత్తుకుమారుడని వాయుపురాణమునందునుగలదు. ఒకనికే నామాంతరమని యూహింపనగును.

జాతో నామైష కం ధాస్యతీ తి తే మునయ స్తదా
ప్రోచుః పరస్పరం తత్ర దేవరాజ స్సమాగతః॥ ౬౫

మాంధాతాఽయమితి ప్రోక్త్వా ధాపయిత్వాఽఙ్గుళింగతః
తేన మాంధాతృనామాఽసౌ బభూవ ధరణీతలే॥ ౭౫

1 యువనాశ్వసుత శ్శ్రీమాన్మాంధాతా పృథివీపతిః
మాంధాతా భూమిపాలోఽభూచ్ఛత్రహీనం తదద్భకం॥ ౮౫

మాంధాతా యౌవనాశ్వో వై త్రైలోక్య విజయీ నృపః
అత్రాప్యుదాహరంతీమం శ్లోకం వంశవిదో జనాః॥ ౯౫

2 యౌవనాశ్వం మహాత్మానం యజ్వాన మమితౌజసం
మాంధాతా తు తను ర్విష్ణోః పురాణజ్ఞాః ప్రచక్షతే॥ ౧౦౫

---

1. వాల్మీకిరామాయణే బాలకాండే సప్తతిసర్గే యువనాశ్వసుతః మాంధాతేత్యత్ర ప్రమాణం.
2. వాయుపురాణే 68 అధ్యాయః.

౬। అప్పుడు మహర్షులును భయసంభ్రమములు కలవారై యీ పుట్టిన శిశువు స్తన్యములేక యెట్లు జీవింపఁగలదు, దేనినిఁ బానము చేయును, అని పరస్పరము సంభాషించుకొనుచుండగ నచ్చటకు దేవేంద్రుడు వచ్చి మహర్షులతో నిటులఁ జెప్పెను.

౭। తా॥ ఈశిశువు నాయంగుళిఁ బానము చేసి జీవించునని మహర్షులతో చెప్పి తన యమృతాంగుళిని (తన వ్రేలును) శిశువునకుఁ గుడిపి స్వర్గమునకు దేవేంద్రుడు వెళ్ళెను. దేవేంద్రుడు స్వయముగా వచ్చి యీ శిశువు నా యమృతాంగుళిఁ బానము చేయునని చెప్పిన కారణముచే నా శిశువునకు మాంధాతయని నామము భూమియందుఁ బ్రసిద్ధమయ్యెను. (మాం) నన్ను అనగా నా వ్రేలును "ధాతా" పానముచేయును అని యింద్రుడు చెప్పిన కారణమున మాంధాతయని పేరు కలిగెనని భావము.

*౮। తా॥ యువనాశ్వుని పుత్త్రుడగు మాంధాత మహారాజు తన తండ్రికంటె ౹౹౹ సంవత్సరములు తక్కువగ (30700 స.॥) రాజ్యమును బాలించెను."

౯। యువనాశ్వపుత్రుడగు మాంధాత మహారాజు త్రిలోకములను జయించి ప్రసిద్ధినొందెను. ఈ మాంధాత మహారాజువిషయమై పురాణజ్ఞులును వంశవృత్తము నెఱిగినవారునగు పెద్దలు క్రిందివిధముగఁ జెప్పుదురు.

౧౦। యువనాశ్వపుత్రుడగు మాంధాత మహారాజు మహాత్ముడనియు బహుయాగములను జేసినవాడనియు, అమిత తేజస్సు గలవాడనియు, విష్ణ్వంశసంభూతుండనియు బురాణవేత్తలు చెప్పుదురు.

---

* యువనాశ్వుని పుత్త్రుడు మాంధాతయని వాల్మీకి రామాయణము బాలకాండమున 70 సర్గమునఁగూడ కలదు మఱియు నవమాంశము విష్ణుపురాణము చతుర్థాంశము 2 అధ్యాయమునఁ జూడఁదగు.

వాయుపు॥ 35 అధ్యాయమున బ్రహ్మాండపు॥ 63 అధ్యాయమున.

3॥ యావత్సూర్య ఉదేతి స్మ యావచ్చ ప్రతితిష్ఠతి
సర్వం తద్యౌవనాశ్వస్య మాంధాతుః క్షేత్రముచ్యతే॥౧౧
4॥ తస్య బిందుమతీ నామ రూపేణా ప్రతిమా భువి
తస్యాముత్పాదయామాస మాంధాతా త్రీన్సుతాన్ప్రభుః ౧౨
పురుకుత్స మంబరీషం ముచుకుందంచ విశ్రుతం॥
కన్యాశ్చ యౌవనాశ్వస్య పంచాశజ్జజ్ఞిరే క్రమాత్ ౧౩
కన్యా వవృధిరే గేహే తస్య రాజ్ఞో సులక్షణాః॥
* సౌభరి స్త్వేకదాఽగత్య। మాంధాతార మువాచహ। ౧౪

---

* సౌభరిర్నామ మహర్షి రంతర్జలే ద్వాదశాబ్దకాల మువాస తత్రచాంతర్జలే సంమదోనామ బహుప్రజోఽతిప్రమాణ మీనరాజోఽవసత్ తస్య పుత్రపౌత్రదౌహిత్రాః పృష్ఠతోఽగ్రతః పార్శ్వతశ్చ పరిభ్రమంతః సచాపత్యస్నేహోపచీయమానహర్షప్రకర్షో బహుప్రకారం పుత్రపౌత్రాదిభిః రేమే అథాంతర్జలస్థిత స్సౌభరిః ఏకాగ్రతాసమాధాన మపహాయాఽనుదినం తన్మత్స్యస్యాలలిత మవేక్ష్య చింతయామాస అహో ధన్యోఽయం మతిరమణీయః మమాపి స్పృహాం జనయతి.

అహమప్యేవం పుత్రాదిభి స్సహ రమిష్యామీతి నిశ్చిత్య జలాన్నిష్క్రమ్య సంతానకామః కన్యార్థం మాంధాతార మగచ్ఛత్ తేనపూజిత స్సౌభరిరువాచేత్యనుసంధేయం.

---

3. విష్ణుపురాణే చతుర్థాంశే 2 అధ్యాయే
4. బ్రహ్మాండే పురాణే ఉత్తరే 63 అధ్యాయః

౧౧౹ ఉదయాద్రి మొదలుకొని యస్తాద్రిపర్యంతముగల భూమండలమంతయు మాంధాతమహారాజు క్షేత్రమేయనికూడఁ జెప్పుదురు.

౧౨౹ అట్టి మాంధాత మహారాజునకు బిందుమతియనెడి భార్య కలదు. ఆమె త్రిలోకసుందరియని చెప్పనొప్పును. ఆమెయందు మాంధాతకు ముగ్గురు పుత్రులు కలిగిరి. వారలు క్రమముగఁ బురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడను నామములతో నొప్పుచుండిరి.

౧౩ మాంధాతకుఁబైముగ్గురు పుత్త్రులేకాక యేబది పుత్రికలు కూడఁగలరు. వారలందఱును రూపలక్షణములుకలవారై పితృ గృహమునందుఁ బెరుగుచుండిరి.

*౧౪౹ ఒకానొకప్పుడు సౌభరియను మహర్షి మాంధాత సమీపమునకువచ్చి యిట్లు బల్కెను.

---

* సౌభరియను మహర్షి జలములోపలఁదపముఁజేయుచు 12 సంవత్సరములుండెను. ఆజలములోపల సంమదమను పేరుగల మత్స్యరాజముండెను. ఆమత్స్యరాజుజలములో సంచరించుచుండగ దానికి నిరుపార్శ్వములయందును వెనుకను ముందఱను దాని పుత్త్రులుపౌత్త్రులు మున్నగునవి సంచరించుచుండును. ఆమత్స్యరాజు సైన్యముతోఁగలసి సంచరించుటవలనఁగలిగిన యానందముతో బహువిధములుగఁ దన పుత్త్రపౌత్త్రాదులతోఁ గ్రీడించుచుండెను. జలములోఁదపము చేయుచున్న సౌభరిమహర్షి యామత్స్యరాజునుఁజూచియేకాగ్రతను వదలి ప్రతిదినమున మత్స్యరాజు చేష్టలను వాని గార్హస్థ్య సౌఖ్యమునుజూచి మనస్సునందివ్విధమునఁ జింతించెను. ఈమత్స్యరాజు కృతార్థుడు, కడుధన్యాత్ముడు, ఈ మత్స్యరాజుయొక్క గార్హస్థ్యచేష్టితములు రమణీయములై నాకును గృహస్థాశ్రమ ప్రవేశ సంకల్పమును గలుగఁజేయుచున్నవి. నేనును నవ్విధముగ గృహస్థాశ్రమ సౌఖ్యములనుఁ బొందెదనని నిశ్చయించి జలమునుండి వెడలి సంతాన కాముడై కన్యకకొఱకు మాంధాతయొద్దకు వెళ్ళెనని తెలియనగును.

నిర్వేష్టు కామోఽస్మి నరేంద్ర! కన్యాం ప్రయచ్ఛ మే।
మూ ప్రణయం విభాంక్షీః । నహ్యర్థినః కార్యవశా దుపేతాః । కకుత్థ్సవంశే విముఖాః ప్రయాంతి॥ ౧౫

అన్యేఽపి సంత్యేవ నృపాః పృథివ్యాం । మాంధాత రేషాం తనయాః ప్రసూతాః । కింత్వర్థినా

మర్థితదానదీక్షాకృతవ్రతం శ్లాఘ్య మిదంకులం తే॥ ౧౬
శతార్ధసంఖ్యా స్తవ సంతి కన్యా స్తాసాంమమైకాం

1 నృపతే ప్రయచ్ఛ । యత్రార్థ నాభంగభయాద్బిభేమి తస్మా దహం రాజవరాఽతిదుఃఖాత్ ॥ ౧౭

ఇతి ఋషివచనం నిశమ్య రాజా శిథిలతనుం జరయాసమీక్ష్య మాసం । మునివరగురుశాపత స్స భీభ్య న్నమిత ముఖ స్సనృప శ్చిరం విదధ్యౌ॥ ౧౮

2 సౌభరిః॥శ్లో॥నరేంద్ర కస్మా త్సముపైషి చింతా మసహ్య ముక్తం న మయాత్ర కించిత్ । యాఽవశ్యదేయా తనయా తయైవ కృతార్థతా నో యదికిం న లబ్ధం॥ ౧౯

తదా ప్రాహ మునిం రాజా కన్యా త్వాం వృణుతేయది నదాతుం ప్రతిబంధో మే కులాచార స్స్వయంవరః

---

1 విష్ణుపురాణే చతుర్థాంశే 2 అధ్యాయే.

2 వి॥ పురాణే చతుర్థాంశే 2 అధ్యాయే మహారామాయణేచ.

౧౫౪ ఓమాంధాత మహారాజా? నేను వివాహము చేసికొనఁదలచి నీసమీప మునకు వచ్చితిని. నాకుకన్యక నిచ్చి వివాహము చేయుము నాకోరికను విఫలముగాఁజేయవలదు కకుత్స్థ వంశకులగు రాజులయొద్దకు యాచకులు కార్యార్థము వచ్చి విముఖులై యింతదనుక వెళ్ళియుండలేదు.

౧౬౪ ఓ మాంధాత మహారాజా! భూమియందనేక రాజులు కలరు. వారలయొద్దఁ గన్యకలును కలరు కాని యాచకుల యభీష్టములనెరవేర్చుటయందు దీక్షవహించిన వంశము నీది యొక్కటేయే, యని వచ్చితినని సౌభరి పల్కెను.

౧౭౪ ఓరాజా! నీయొద్దను, ఏబది పుత్రికలుండిరి. వారిలో నాకొక కొమరిత నిచ్చివివాహము చేయుము. అతి దుఃఖకరమగు యాచ్ఞా భంగమునకు నేను భయపడుచుంటిని.

౧౮౪ ఇవ్విధముగ సౌభరి చెప్పిన వాక్యములను విని మాంధాత మహారాజు ముదిమిచే శిధిలాంగుడగు నమ్మునినిఁ జూచి, కన్యక నివ్వనని చెప్పినచో ముని శపించునని భయముచే నేమి చేయుటకుఁ దోచక విచారించుచుండగా సౌభరి తిరిగి మాంధాతతోఁ గ్రింధివిధముగఁ బల్కెను.

౧౯౪ ఓ రాజా? నీవేల చింతించుచుంటివి? ఇవ్విషయమున నీవు చింతించుటకు, నేను, సహింపశక్యముకాని సంగతిని నీకుఁ జెప్పియుండలేదు. ప్రయత్నపూర్వముగా నీవు కన్యకను నెవరికైన నవశ్యముగా నీయవలసినదే కదా? (అట్టి విషయమున నీప్రయత్నమక్కఱలేకయే యా కార్యము సమకూరినపుడు సంతోషింపవలసినది కాని విచారింప నవసరములేదని తాత్పర్యము)

౨౦౪ అప్పుడు సౌభరి మహర్షితో మాంఁధాత యిటులఁ బలికెను. ఓ సౌభరి మహర్షీ! స్వయంవరము మా కులాచారము కావున నాపుత్రిక నిన్ను స్వయముగా వరించినచో నా ప్రతిబంధ మేమియులేదు.

ఇత్యుక్త్వా తం సమానీయ కన్యాంతః పుర మావిశత్
సౌభరి ర్యోగసిద్ధ్యాతు దివ్యరూపధరో ఽభవత్॥ ౨౧

శతమన్మథరూపం తం సౌభరిం తత్సుతాః పురః
జ్ఞాత్వా వృత్తం పితుస్సర్వాః పంచాశ ద్వవ్రిరే ఽసకృత్॥

పరిణీయ శుభాకారా స్సౌభరిర్నృప కన్యకాః
మాంధాత్రనుజ్ఞాం సంప్రాప్య నినాయ నిజమాశ్రమం॥ ౨౩

తత్రతాసాం స్వపత్నీనాం సౌభరిస్స్వతపోబలాత్
స్వర్ణసౌధాది సంయుక్తం పురమేకం వినిర్మమే ౨౪

సువర్ణ రత్నభూపాశ్చ స్వర్ణ మంచాసనానిచ
సువర్ణ డోలికా శ్చాపి నందనోపమవాటికాః॥ ౨౫

దాసదాసీజనాంశ్చాపి స్వపత్నీనాం పృథక్పృథక్
కల్పయిత్వా స్వయం తాసాం గృహేష్వాసపృథఙ్మునిః ౨౬

ఏవం ప్రత్యేకశస్తాభిస్సహక్రీడావినోదవాన్
గార్హస్థ్య సౌఖ్యమగ్నో ఽభూత్సర్వదా సౌభరిర్మహాన్॥

పుత్రాన్పౌత్రాంశ్చ దౌహిత్రాన్ పుత్రికాస్సౌభరిర్మునిః
పశ్యన్స బహూన్వత్సరాంస్తు నినాయ క్షణమాత్రతాం॥ ౨౮

౨౧| ఇవ్విధముగ చెప్పి మాంధాత సౌభరిని దీసికొని తన పుత్త్రిక లుండెడి యంతఃపురమును బ్రవేశించెను. అప్పుడు సౌభరి తన యోగ శక్తిచే దివ్యరూపమును ధరించెను.

౨౨| మాంధాత పుత్త్రికలందఱు సౌభరి వచ్చిన సంగతిం దమ తండ్రి వలనం దెలిసికొని తత్కాలముననే దివ్యరూపధరుడై శతమన్మథులను ధిక్కరించియున్న యా సౌభరిని భర్తనుగా నొక్క పర్యాయముగా వరించిరి.

౨౩| సౌభరి మహర్షి రాజకన్యకలను వివాహము చేసికొని మాంధాత మహారాజు ననుజ్ఞనొంది తన యాశ్రమమునకు వారిని దీసికొని వెళ్ళెను.

౨౪| సౌభరి మహర్షి తన తపోబలముచే రాజకన్యకలగు తన భార్యలకు సువర్ణ ప్రాకారములతోం గూడిన సౌధములచే నొప్పునట్టి యొక పురమును తపోవనమునందు నిర్మించెను.

౨౫, ౨౬| మఱియు నా సౌభరి మహర్షి తన భార్యలకు ప్రత్యేక సౌధములను తపోమహిమచే నిర్మించి ప్రత్యేకముగ స్వర్ణరత్నాభరణములను సువర్ణపంచములను, సువర్ణాసనములను ప్రత్యేకముగ వారి వారి సౌధప్రాకారములలోపల నందనవనముతో సమానమగు నుద్యానవనములను, దాసదాసీజనములను వేలు వేలుగ కల్పించి తాను అనేకరూపములను ధరించి వారి వారి గృహములలో నొక్కొక్కడుగ నుండెను.

౨౭| ఈ ప్రకారముగ సౌభరి మహర్షి తపోమహిమచే భార్యలందఱితో క్రీడావినోదములను సల్పుచు గృహస్థాశ్రమ సౌఖ్యములలో నెల్లప్పుడు మునిగియుండెను.

౨౮| సౌభరిమహర్షి పుత్త్రులను, పౌత్త్రులను పుత్త్రికలను, దౌహిత్రులను జూచుకొనుచు సంతోషము నొందుచు బహుకాలమును క్షణకాలముగాం గడపెను.

ఏవం బహుగతే కాలే సౌభరి స్తత్త్వ దృష్టిమాన్
విచారయామాస హృది బహుధా సంసృతిం ప్రతి॥ ౨౯
అహో మోహస్య విస్తార స్సంసృతౌ సంస్థితస్యమే॥ 30

మనోరథానాం న సమాప్తి రస్తి వర్షాయుతేనాప్యథ
వాపి లక్షైః పూర్ణేషు పూర్ణేషు పున ర్నవానాం
ముత్పత్తయ స్సంతి మనోరథానాం॥ 3౧

పద్భ్యాం గతా యావనిన శ్చ జాతా దారైశ్చ
సంయోగమితాః ప్రసూతాః దృష్టాస్సుతా
స్తత్తనయప్రసూతింద్రష్టుంపున ర్వాంఛతి మేఽంతరాత్మా3౨

అమృత్యుతో నైవ మనోరథానామంతోఽస్తి
విజ్ఞాత మిదం మయాఽద్య । మనోరథాసక్తి
పరస్య చిత్తం నజాయతే వై పరమార్థసంగి॥ 33

స మేసమాధి ర్జలవాసమిత్రమత్స్యస్యసంగా త్సహసైవనష్టః॥
పరిగ్రహస్సంగకృతోమయాఽయం
పరిగ్రహోత్థాచ మమాపి లిప్సా॥ 3౪

౨౯ ఇవ్విధముగ బహుకాలము గడచిన పిదప సౌభరి మహర్షి తత్త్వదృష్టిగలవాడై సంసారచక్రమునుగూర్చి యనేకవిధములుగ హృదయమున విచారింపఁ దొడగెను.

౩౦ సౌభరి మహర్షి యేమని విచారించె ననగా సంసారమునందుండి సర్వమును మఱచి యీ మోహములో పడుట యాశ్చర్యమని (విచారించెను.)

౩౧ మఱియు విచారించినదేమనగా, కోరికలకు సమాప్తి యనునది పదివేల సంవత్సరములకైనను, లక్షల సంవత్సరములకైన నుండ నేరదు. ఒక్కొక కోరిక తీరగా, మఱియొక కోరిక నూతనముగ బుట్టుచుండును.

౩౨ పిల్లలు పుట్టువఱకు సంసారములో నుండెదనని యనుకొంటిని. పిల్లలు పుట్టిన పిదప వారలు కొంచెము పెద్దవారలగునంతదనుక నుండ కోరిక యుదయించెను పిమ్మట వారలకు వివాహముసూడఁ జేసి సంసారమును వదలకొందునని యనుకొంటిని. వివాహములైన పిదప వారల సంతానమును జూడవలయునని కోరికయు, వారలకు సంతానము కలిగిన పిదప వారల సంతానము చూడవలయుననియు, నామనస్సు కోరికలతో నిండియున్నది. కాని శాంతిం పదయ్యెనని సౌభరి విచారించెను.

౩౩ శరీరపాతముగ నంతదనుక కోరికలకు సమాప్తియనునది లేదనెడి విషయమును నేనిప్పటికిఁ దెలిసికొంటిని. మనోరథములయం దాసక్తి కలవాని మనస్సు పరమార్థ సంబంధముకలది కానేరదు

౩౪ నేను కొలనులో జలవాసము చేయుచుఁ దపము చేయుచున్నతఱి కొలనులోని మత్స్యరాజ సంబంధముచేతను నా సమాధియంతయును నష్టమయ్యెను మత్స్యరాజ సహవాసమువలననే నాకీ సంసారమంతయు నేర్పడెను. సంసార సంబంధమువలననే కోరిక లుదయించుచుండుటయు వానికి సమాప్తి లేకుండుటయుం దటస్థించెను.

1 నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగాదశేషాః
ప్రభవంతి దోషాః ఆరూఢయోగోపి నిపాత్యతేఽధః
సంగేన యోగీ కిముతాల్పశక్తిః॥ ౩౫

ఇత్యేవం చింతయిత్వాఽసౌ త్యక్త్వా సర్వపరిచ్ఛదం
స్వభార్యాభిస్సౌభరిస్తు ప్రవివేశ తపోవనం॥ ౩౬

2 శతహీనం కృతం రాజ్యం మాంధాత్రాపి మహీతలే॥ ౩౭

శృణుయాద్యో నరో భక్త్యా సౌభరేస్తు కథామిమాం
అసన్మతి రధర్మశ్చ న విశ్యేత్తస్య హే ద్విజాః ౩౮

అనంతరం కథాం వక్ష్యే యూయం శృణుత భో ద్విజాః
న ద్వాపరః ప్రవర్తవ్యః భవద్భిర్గ్రంథవిస్తరాత్॥ ౩౯

ఇతి తృతీయస్సర్గః సమాప్తః.

---

1 వి॥ పురాణే

2 మాంధాతుః పాలనకాలః 29800 ఇతి భవిష్యే

౩౫ యతులకు సంగరాహిత్యము మోక్షహేతువని చెప్పఁబడినది. సంగమువలననే యనేక దోషములు పుట్టుచున్నవి. సంగమువలన ఆరూఢయోగియు నధఃపతితుఁ డగునని తెలియుచుండ, నల్పశక్తిగల యారురుక్షువగు యోగి సంగముచే భ్రష్టు డగునని వేఱ చెప్పనదేమి ?

౩౬ ఈ ప్రకారముగ సౌభరి మహర్షి మనస్సునందు విచారించి తన తపోమహిమచేఁ గల్పింపఁబడిన సమస్తపరికరములను తిరోహితములనుగాఁజేసి తన భార్యలతోఁగూడఁ దపోవనమున కేగెను.

౩౭ మాంధాత మహారాజు, ఇరువది తొమ్మిదివేల యెనిమిది వందల సంవత్సరములు రాజ్యమును పరిపాలించెను.

౩౮ ఓ మహర్షులారా ! భూమియందలి యే మనుజులు సౌభరి కథను భక్తిభావముతో వినెదరో వారలకు సద్బుద్ధియు, ధర్మాసక్తియు కలుగును. (అసద్బుద్ధియు, నసత్ప్రవృత్తియు నశించును.)

౩౯ ఓ మహర్షులారా! అనంతర కథను జెప్పెదను వినుడు. [ ]ధవిస్తర మయ్యెనని సంశయింపకుఁ డనియెను.

తృతీయ సర్గము ముగిసెను.

## చ తు ర్థ స్స ర్గః.

* పురుకుత్స శ్చక్రవర్తీ మాంధాతుశ్చాత్మజో మహాన్
భువం వై పాలయామాస శత్రుహీనం తదబ్దకం॥ ౧

షట్కోటి గంధర్వగణం నాగలోక గతశ్చయః
విష్ణ్వంశ సహితోయ స్తునీతో నర్మదయాఽజయత్ ॥ ౨

---

* పురుకుత్స విషయే విష్ణుపురాణే చతుర్థాంశే విస్తరతః ప్రతిపాదితం - రసాతలే మౌనేయానామ గంధర్వా బభూవు ష్షట్కోటిసంఖ్యా-స్తైర శేషాణి నాగకులాన్యపహృత ప్రధానరత్నాధిపత్యా న్యక్రియంత-తైశ్చగంధర్వవీర్యావధూతై రురగేశ్వరై స్స్తూయమానో నశేషదేవేశః స్తవ శ్రవణోన్మీలితోన్నిద్ర పుండరీక నయనో జలశయనో నిద్రావసానవిబుద్ధః ప్రణిపత్యాభిహితః భగవ న్నస్మాక మే తేభ్యోగంధర్వేభ్యోభయముత్పన్నం కథ ముపశమ మేష్యతీతి-ఆహ భగవా ననాదినిధనః పురుషోత్తమో యోఽసౌ మాంధాతుః పురుకుత్స నామా పుత్ర స్తమనుప్రవిశ్యతానశేషదుష్టగంధర్వా నుపశమం నయిష్యామీతి. తదాకర్ణ్య భగవతే జలశాయినే కృతప్రణామాః పునర్నాగలోక మాగతాః పన్నగాధిపతయో

---

పురుకుత్స పరిపాలన కాలః 29700

## నాల్గవ సర్గము.

౧ మాంధాత మహారాజ పుత్త్రుండగు పురుకుత్సుండు గొప్పచక్రవర్తియై తన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా భూమినిఁ బాలించెను. (అనగా 29700 సంవత్సరములు పాలించెను.)

* ౨ ఆ పురుకుత్సుండు తన పరిపాలనా కాలమున నర్మదయను నాగకన్యచే నాగలోకమునకుఁ దీసికొనిపోఁబడి విష్ణ్వంశముతోఁగూడినవాఁడై యాఱుకోట్ల గంధర్వులను సంహరించి నర్మదను వివాహమాడెను.

---

* పురుకుత్సుండు నాగలోకమునకేగి గంధర్వులను జయించిన విషయము గల కథాభాగము విష్ణుపురాణమున చతుర్థాంశమున విస్తారముగఁ జెప్పంబడినది. (ఏమన) పాతాళమునందు మౌనేయులను గంధర్వులారుకోట్లుకలరు. వారిచే నాగలోకవాసుల యాధిపత్యము లపహరింపబడగా నా నాగలోకవాసులు భగవంతుడగు క్షీరసముద్రశాయియైన విష్ణుమూర్తిని బహువిధముగ స్తోత్రముచేయగ, నా దేవాదిదేవుడు వారల స్తోత్రములను విని పద్మపత్రముల వంటి తన నేత్రములను దెఱచి మేల్కొనగా, నప్పుడు నాగలోకవాసు లివ్విధముగ శ్రీహరితోఁ దమ కష్టములను జెప్పుకొనిరి. (ఏమన) ఓ భగవానుడా! మాకు గంధర్వులవలన భయముగలిగినది. ఆ భయమును నివారింపుమన నాద్యంత రహితుడగు పురుషోత్తముడు వారలతో నిటులఁ బల్కెను. మాంధాత మహారాజ పుత్త్రుడగు పురుకుత్సునియందు నాశక్తినిఁ బ్రవేశపెట్టి సకల గంధర్వులను సంహరింపజేసెదననెను. ఆ వాక్యమును సర్పరాజులు విని భగవానునకు నమస్కారములనుజేసి తదనుజ్ఞను బడసి పురుకుత్సమహారాజును భూలోకమునుండి నాగలోకమునకుఁ దీసికొనివచ్చుటకు

1॥ పురుకుత్సస్యదాయాద స్త్రసదస్యుర్మహాయశాః
నర్మదాయాం సముత్పన్న స్త్రింశదశ్వ స్స ఏవహి॥ 3

2॥ శతహీనం కృతం రాజ్యం । త్రింశదశ్వేనధీమతా
రథే యస్య స్మృతా వాహాః। వాజిన స్త్రింశతోవరాః॥ ౪

అనరణ్య స్తతో జాతో । హ్యష్టావింశ సహస్రకం
రాజ్యం ద్వితీయచరణే కృతం సత్యయుగస్యవై॥ ౫

---

నర్మదాంచ పురుకుత్సానయనాయ చోదయామాసుః. సాచై
నం రసాతలం గతశ్చాఽసౌభగవత్తేజసా ప్యాయతవీర్య
స్సకలగంధర్వా న్నిజఘాన పునశ్చ స్వపురమాజగామ సకల
పన్నగపతయశ్చనర్మదాయై వరం దదుః యస్తే నుస్మరణం
కరిష్యతి, నతస్య సర్పవిషభయం భవిష్యతీతి అత్రచశ్లోకః॥
నర్మదాయైనమః ప్రాతః నర్మదాయై నమోనిశినమోస్తునర్మ
దేతుభ్యం త్రాహిమాం విషసర్పతః॥ ఇతి “(పూర్వోక్తమహా
నేయానామ కాశ్యపపత్న్యా మునేః పుత్రాశ్చిత్రసేనాద్యా
ఇతిజ్ఞేయః)”

---

1. బ్రహ్మాండే
2. భవిష్యే

1. త్రసదస్యు రాజ్యపాలనకాలః 29600
2. అనరణ్యపాలనకాలః 28000

3 పురుకుత్సునకు నర్మదయందు త్రసదస్యుడను కుమారుడు కలిగెను. అతడు గొప్పకీర్తిని సంపాదించెను త్రసదస్యునకే త్రింశదశ్వుడని సామాంతరమని చెప్పఁగనగును.

౪ త్రింశదశ్వుడను పేరు కలుగుటకు కారణ మేమనగా, ఆత్రసదస్యుని రథమునకు ముప్పది గుఱ్ఱములు పూన్పబడును కాన త్రింశదశ్వుడని ప్రసిద్ధి చెందినవాడై తన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా రాజ్యమును పాలించెను. (అనగా 29600 సంవత్సరములు పాలించెను.)

౫ ఆత్రసదస్యునకు అనరణ్యుడు పుట్టెను అతడు త్రేతాయుగమున ద్వితీయ పాదమునందు ఇరువదియొనిమిదివేల సంవత్సరములు రాజ్యమును పాలించెను.

---

నర్మదయను నాగకన్యను ప్రేరేపింపఁగా, నామె భూలోకమున కేగి పురుకుత్సుని నాగలోకమునకుఁ దీసికొనివచ్చెను. అప్పుడు విష్ణుతేజము పురుకుత్సునియందుఁ బ్రవేశింప నతడు సకల దుష్ట గంధర్వులను సంహరించి, తన పురమున కేగెను. నాగరాజులు నర్మదకు వర మొసంగిరి. (ఏమన) ప్రాతఃకాలమునందును, రాత్రి కాలమునందును విషసర్పములవలన నన్ను రక్షింపుమని యో నర్మదాదేవి ! నిన్నెవఱు ధ్యానించెదరో వారలకు సర్పవిషభయము లేకపోవుగాక యని. పైఁ జెప్పఁబడిన మౌనేయులను గంధర్వు లెవరనగా కాశ్యపుని భార్యయగు మునియను నామెకు పుత్రులైన చిత్రసేనాదులని చెప్పఁగనగును.)

* మరుత్తరాట్కృతౌయస్తు । రావణేన హతోఽభవత్
మద్వంశ్యాత్తే మృతిశ్చైతి । యేనశప్తోదశాననః॥ ౬

3 పృషదశ్వస్తతోజాతో ।. రాజ్యం షట్సహస్రికం
తదబ్దం భూతలే కృత్వా । స్వర్గలోకమవాప సః ౭

4 హార్యశ్వస్తుతతోజాతో । విష్ణుభక్తియుతేన్నృపః
సహస్రహీనం రాజ్యంచ కృతం తేన తదబ్దకం॥ ౮

5 తదాత్మజోవసుమనా । ధర్మేణ పృథివీ మిమాం
సహస్రహీనం శరదః । పాలయామాస రంజకః । ౯

---

* రావణేన మరుత్తయజ్ఞేఽనరణ్య స్యాహృతఇత్యత్ర విష్ణుధర్మోత్తరే ప్రపంచితం – (తథాహి) మరుత్తస్యాధ్వరేవిప్రాః । భక్షయామాస రావణః। ఇంద్రోమయూరరూపేణ తస్మాద్యజ్ఞాదపాక్రమత్ । మయూరస్యవరం ప్రాదాత్ । మేఘేవర్షతి సర్వదా । గమిష్యత్యతులాం ప్రీతిం । మమనేత్రగుణాకృతిం । ధారయిష్యసి లోకేస్మిన్కలాపం సుమనోహారం । కృకలాసస్య రూపేణ ధనాధ్యక్షో వ్యపాక్రమత్

---

3. భవిష్యే
4. భవిష్యే
5. భవిష్యే

3. పృషదశ్వపాలనకాలః 6000
4. హార్యశ్వపాలనకాలః 5000
5. వసుమనరాజ్యకాలః 4000

* ౬. పిమ్మట మరుత్తుఁడను రాజు యజ్ఞమును జేయుచు, అనరణ్యునిఁ బిల్వఁగా, అనరణ్యుఁడు మరుత్తుని యజ్ఞమునకు వెళ్ళెను ఆ యజ్ఞమునకు రావణాసురుఁడు వచ్చి హవిర్భాగములను దేవతల కివ్వకుండఁగ తమ రాక్షసుల కివ్వమనగా, నందునకు మరుత్తుఁడు సమ్మతింపక పోఁగా యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యె. దేవతలు భయపడి పాఱిపోయిరి. అనరణ్యుఁడు రావణాసురునితో యుద్ధముచేసి వానిచే హతుఁడై ప్రాణములను వదలుచు నిటుల రావణుని శపించెను. ఓ రావణుఁడా! నా వంశీకునివలన నీకు మరణము కలుగుఁగాక యని.

౭॥తా॥ అనరణ్యుని పుత్త్రుఁడగు పృషదశ్వుఁడు ఆఱువేలసంవత్సరములుభూమియందు రాజ్యమును బాలించి స్వర్గస్థుఁడయ్యెను,

౮॥తా॥పృషదశ్వుని పుత్త్రుఁడగు హర్యశ్వుఁడు విష్ణుభక్తికలవంశమునజన్మించి తండ్రికంటె వెయ్యిసంవత్సరములు తక్కువగా రాజ్యమును బాలించెను=(అనగా ౫౦౦౦ సంవత్సరములు పాలించెనని భావము)

౯॥ హర్యశ్వుని పుత్త్రుఁడగు వసుమనుఁడు ప్రజారంజకుఁడై తన తండ్రికంటె వెయ్యిసంవత్సరములు తక్కువగ (అనగా నాలుగువేల సంవత్సరములు) రాజ్యమును ధర్మముగఁ బాలించెను.

---

* రావణుఁడు మరుత్తుని యజ్ఞమునకు వెళ్ళినను విషయము విష్ణుధర్మోత్తర మహాపురాణమునఁ జెప్పఁబడినది. (ఏమనగా) మరుత్తుని యజ్ఞమునకు రావణుఁడు వెళ్ళి యచ్చటి బ్రాహ్మణులను హింసించుచుండఁగా, భయపడి యింద్రుఁడు నెమలిరూపముతోఁ బాఱిపోయి నెమలిజాతి మాత్రమున కంతకు నిటుల వరమిచ్చెను. నా వాహనమగు మేఘము గర్జించి వర్షించినపుడు నెమిళ్ళకు ప్రీతికలుగుఁగాక మఱియు మనోహరమగు పింఛమును ధరించుఁగాక యని, కోడిరూపముతో కుబేరుఁడు మరుత్తునియజ్ఞమునుండి పాఱిపోయి కోడిజాతి కంతకును వరమిటులనిచ్చెను.-కోడినెత్తిమీఁద సువర్ణచ్ఛాయయుండు నటులను ధనముకూడ పందెములయందు తచ్ఛిరమూనం దుండునట్లును వరమొసంగెను, జలదేవతయగు వరుణుఁడు హంసరూపముతో

1 సతుసూర్యంస మభ్యర్చ్య । రాజా వసుమనాశ్శుభం
లేభే త్వప్రతిమంపుత్రం । త్రిధన్వాన మరిందమం । ౧౧

ఆయజ చ్చాశ్వ మేధేన । శత్రూ న్ జిత్వాద్విజోత్తమాః
స్వాధ్యాయవా న్ధర్మ శీలః । తితీక్షుర్ధర్మ తత్పరః
ఋషయస్తు సమాజగ్ము ర్యజ్ఞవాటం మహాత్మనః॥ ౧౧౫

తాన్ప్రణమ్య మహారాజః । పప్రచ్ఛవినయాన్వితః
సమాప్య విధివద్యజ్ఞం వసిష్ఠాదీ న్ద్విజోత్తమాః॥ ౧౨౫

కింహి శ్రేయస్కరతరం । లోకేస్మి న్బ్రాహ్మణర్షభాః
యజ్ఞ స్తపోవా సన్న్యాసః । బ్రూతిమే సర్వవేదినః॥ ౧౩౫

వర్ణంతస్య సువర్ణాభం సద్రవ్యంచత తిధాశిరః । వరుణశ్చతో దాప్రాగాత్ । హంసరూపేణ నిర్గతః । హంసస్యచవరంప్రాదాత్తోయేరతి మవాప్స్యసి । యమోవాయస రూపేణ తస్మాద్యజ్ఞా దపాక్రమత్ । వాయసస్యవరం ప్రాదాత్ ॥ చిరజీవిత్వలక్షణం । యుష్మద్దత్తేన చాన్నేన పరాం తృప్తింప్రవ జాస్యథ । వక్ష్యధ్వం బలిదాతౄణాం దిగ్దేశగతచేష్టితైః । మరుత్తస్యాధ్వరే తాన్సం కృత్వైవం స దివౌకసాం హవిర్భాగాన్నాక్షసానాందేహీత్యాహ దశాననః ॥ తదానరణ్యాస్సం క్రుద్ధో రావణేనసమంతదా యుద్ధం కృత్వాతేన హతశ్శశాప చదశాననం॥ మద్వంశీయా న్మృతి స్తే స్యాత్ । సహభృత్యై హితాత్మజైః॥ ఇతి.

1 కూర్మే శివరామాయణేచ,

౧౦　తా॥ వసుమనుడనురాజు తనపరిపాలనకాలమున సూర్యభగవాను నారాధించితదనుగ్రహముచే నిరుపమానుడగు త్రిధన్వుడను పుత్త్రుని బొందెను.

౧౧　మఱియు ధర్మశీలుడును శాంతుడును వేదవేత్తయునగు నావసుమనుడు శత్రువులను జయించి యశ్వమేధయాగము నొకప్పుడుచేసెను. ఆమహాత్ముని యజ్ఞవాటమునకు మహర్షు లనేకులు వచ్చిరి.

౧౨　తా॥ వసుమనుడు యథావిధిగాయజ్ఞమునుజేసి యాయజ్ఞమునకు వచ్చిన మహర్షులకు నమస్కారముచేసి వినయపూర్వకముగ వారలను బ్రశ్నించెను.

౧౩　సర్వవేత్తలగునో మహర్షులారా! లోకమునందుఁ గొందఱుయజ్ఞములను జేయుదురు మఱికొందఱు తపముసుఁ జేయుదురు కొందఱు సన్న్యాసమును స్వీకరించెదరు. ఆయజ్ఞతపస్సన్న్యాసములలో నిపుడు నాకేది శ్రేయస్కరమో విచారించి చెప్పుడని యడిగెను.

---

వెడలి తనప్రాణరక్షణమును జేసినహేతువుచే హంసజాతికంతకును వరమునిచ్చెను, (ఏమనగ) నాజలమునందు హంసలకు బ్రీతియుండు గాకయని॥ యముడు కాకిరూపముతోఁ బాఱిపోయి కాకులకు వరమొసంగెను. (ఏమనగ) చిరకాలముబ్రతుకునట్లును కాకులకుఁ బితృకర్మలయందు బలిగావేయబడిన యన్నముచేఁదనకుఁ దృప్తికలుగునట్లును బలినిచ్చువారలకు దిగ్దేశచేష్టితములచేతను శకునములను జెప్పునట్లును, వరములనిచ్చెను, ఇవ్విధముగ రావణుడు దేవతలకుసయితము భీతిఁ గలుగఁజేసి హవిర్భాగములను రాక్షసులకు నీయుమని మరుత్తునిగూర్చిపలికెను, అనరణ్యుడుకోపగించి మరుత్తుని యజ్ఞమును నశింపఁజేయ సమకట్టిన రావణునితో యుద్ధముచేసివానిచే హతుడై రావణుని శపించెను (ఏమన) నావంశీకునివలన నీకు మరణము కలుగుగాకయని.

ఋషయః॥ శ్లో॥ అధీత్య విధివద్వేదాన్పుత్రాన్ సుత్పాద్యయత్నతః
ఇష్ట్వా యజ్ఞేశ్వరం యజ్ఞైః గచ్ఛేద్వనమథాత్మవిత్॥ ౧౪

తచ్ఛ్రుత్వా వై వసుమనాః । రాజ్యం పుత్రే సమర్ప్యచ
జగామారణ్య మనఘ స్తప స్తప్త్ర మనుత్తమం॥ ౧౫

సంవత్సర శతం తప్త్వా ప్రసాదా త్పరమేష్ఠినః
దివ్యం వై రాజకం స్థానం । జగామ తదనంతరం ౧౬

1॥ తస్యపుత్రోఽభవద్రాజా । త్రిధన్వా ధర్మ తత్పరః
సహస్రహీనం రాజ్యం త త్తేన రాజ్ఞాపి పాలితం॥ ౧౭

ప్రసాదా ద్బ్రహ్మణానోర్వ్యా । తండినః ప్రాప్య శిష్యతాం
అశ్వమేధ సహస్రస్య ఫలం । ప్రాప్యత దాజ్ఞయా
గత్యైశ్వర్య మనః ప్రాప్తః భవభక్తః ప్రతాపవాన్॥ ౧౮-౧౯

2॥ త్రైయ్యారుణ స్తస్యసుతః భూమిపాలోఽభవ త్తతః
సహస్రహీనం రాజ్యం త త్తేన రాజ్ఞాఽవనాకృతం॥ ౨౦

~~తస్య సత్యవ్రతోనామ~~ । కుమారోఽభూన్మహాబలః
తేన భార్యా విధర్భస్య । హృతా సత్యవ్రతేనతు
పిత్రాత్యక్తోవనం యాత స్తత్రైవస్యవసద్వనే॥ ౨౧

న చైనంవారయామాస వసిష్ఠో భగవానృషిః॥ ౨౨

---

1 బ్రహ్మాండపురాణే ఉ 63 అధ్యాయే. త్రిధన్వనః పాలన కాలః (3000 సం)
2 త్రైయ్యారుణ పాలన కాలః (2000 సం) ఇతిభవిష్యే.

౧౪. తా॥ మహర్షులివ్విధముగ వసుమనునితో జెప్పిరి ఓ వసుమనుడా! బ్రహ్మచర్యమున యథావిధిగ వేదాధ్యయనముం జేసి వంశాభివృద్ధికొఱకుం గృహస్థాశ్రమములోనికి వచ్చి పుత్త్రులను గని యాగములనుం జేసి యజ్ఞేశ్వరుం బ్రీతినొనరించితివి. వానప్రస్థాశ్రమమునకేగి తపమునుజేసికొనుట శ్రేయస్కరమైనది (అని చెప్పిరి)

౧౫. తా॥ వసుమనుడు బ్రహ్మర్షుల వాక్యమును విని రాజ్యమును పుత్త్రుడగు (త్రిధన్వునకిచ్చి గొప్పతపమునుం జేయుటకు వనమునకేగెను)

౧౬. నూఱు సంవత్సరములు తపస్సుచేసి బ్రహ్మదేవుని సంతుష్టునిగాంజేసి యా బ్రహ్మానుగ్రహముచేఁ బిమ్మట విరాట్పురుషుడు నివసించిన దేవలోకమునుం బొందెను.

౧౭. వసుమనుని యనంతరము తత్పుత్త్రుడగు త్రిధన్వుడను రాజు ధర్మముగా తన తండ్రికంటె 1000 సంవత్సరములు తక్కువగా (అనగా 3000) సంవత్సరములు రాజ్యమును పరిపాలించెను.

౧౮-౧౯ ఆ త్రిధన్వుడు, బ్రహ్మపుత్త్రుడగు తండిమహర్షికి శిష్యుడై యతని యనుగ్రహముచే సహస్రాశ్వమేధ ఫలమును బొంది శివభక్తుడై, ప్రమథగణాధిపత్యము నొందెను.

౨౦ అతని కుమారుడగు త్రయ్యారుణుడు రాజై తన తండ్రికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ భూమిని పరిపాలించెను. (2000 సం).

౨౧. అతని కుమారుడు సత్యవ్రతుడనువాడు మహాబలవంతుడుండెను. అతడు విదర్భుని భార్య నపహరించగా నా సత్యవ్రతుని తండ్రియగు త్రయ్యారుణుడు పరిత్యజింప నతడు వనమునకేగి యచ్చటనే నివసించెను.

౨౨ తండ్రి సత్యవ్రతుని రాజ్యమునుండి వెడలగొట్టు సమయమున, పూజ్యుడగు వసిష్ఠ మహర్షి సమీపమున నున్నను నతనిని వారింపడయ్యెను.

1|| దారాంస్తు విషయే తస్య । విశ్వామిత్రో మహాతపాః
సన్న్యస్య సాగరానూపే చచార విపులం తపః॥ ౨౩

తస్మింస్తు విషయేతస్య నావర్ష త్పాకశాసనః ౨౩½

తస్యపత్నీ గళేబద్ధ్వా । మధ్యమం పుత్ర్ర మౌరసం
శిష్టానాం భరణార్థాయ । వ్యక్రీతుం నిర్గతా తదా॥ ౨౪½

సత్యవ్రతో మహాబుద్ధి ర్భరణం తస్య చాఽకరోత్
విశ్వామిత్రస్య తుష్ట్యర్థ మనుకంపార్థమేవచ॥ ౨౫½

సోఽభవద్గాలవో నామ । గళే బద్ధో మహాతపాః
మృగమాంసేన తాన్సర్వాన్పోషయామాస వైనృపః ౨౬½

అవిద్యమానే మాంసేతు । వసిష్ఠస్య మహాత్మనః
సర్వకామదుఘాం ధేనుం । జఘాన బలినాంవరః॥ ౨౭½

ప్రోవాచ చైవ భగవా న్వసిష్ఠ స్తం నృపాత్మజం
పితుశ్చాపరితోషేణ । గురుదోగ్ధ్రీ వధేనచ॥ ౨౮½

అప్రోక్షితోపయోగాచ్చ । త్రివిధస్తే వ్యతిక్రమః
త్రిశంకురితి హోవాచ । త్రిశంకుస్తేన సస్మృతః ౨౯½

---

1 బ్రహ్మాండే ఉ 63 అధ్యాయే.

౨౩ అసత్యవ్రతు డరణ్యమున నుండి యాటవికులతో చెలిమిచేసి యచ్చటనే నివసించుచుండ నతడుండిన ప్రదేశముననే విశ్వామిత్రుడు తన భార్యాపుత్త్రులను విడిచి గొప్పతపమును జేసికొనుటకు మఱియొక ప్రదేశమున కేగెను.

౨౩౺ అసత్యవ్రతుడుండిన దేశమునందు వర్షములేక క్షామము సంభవించెను.

౨౪౺ ఆక్షామ కాలమున విశ్వామిత్రునిభార్య తనపుత్త్రులను బోషించుటకు తెలివుగానక తన మధ్యమ పుత్త్రుని విక్రయించి యాధనముచే శేషించిన పుత్త్రులను పోషింపదలచి, యామధ్యమపుత్త్రుని మెడకు త్రాడును గట్టి, చేతబుచ్చుకొని విక్రయింప బయలు వెడలెను.

౨౫౺ సత్యవ్రతుడు, విశ్వామిత్రుని యనుగ్రహమును సంపాదింపదలచి విక్రయించుటకు తీసికొని పోబడుచున్నతత్పుత్రుని నివారించి విశ్వామిత్రుని భార్యను శాంతపరచి విశ్వామిత్రుడు వచ్చువఱకు తాను వారినందఱను పోషించుటకు నొడంబడెను.

౨౬౺ గళమునందు (కంఠమునందు) త్రాడుకట్టబడినవాడుకనుకనే విశ్వామిత్రునిమధ్యమపుత్త్రునకు గాలవుడను నామ మేర్పడెను సత్యవ్రతుడు మృగమాంసముతో విశ్వామిత్రుని భార్యాపుత్త్రులనుక్షామ కాలమున పోషించుచుండెను.

౨౭౺ ఒకప్పుడు మృగమాంసము దొరకనందున వసిష్ఠుని కామధేనువును సత్యవ్రతుడు మాంసార్థమై సంహరించెను.

౨౮-౨౯౺ పూజ్యుడగు వసిష్ఠుడు తన కామధేనువును సత్యవ్రతుడు సంహరించిన వృత్తాంతముం దెలిసికొని యతడు త్రిశంకుడను నామముతో లోకమున వ్యవహరింపబడు గాక యని శపించెను. త్రిశంకుడనగా మూడు కళంకములు గలవాడని భావము; అవి అవిధ్యుక్తవు (1) తండ్రికి సంతోషకరముగ నుండకపోవుట (2) గురుధేనువును సంహరించుట (3) మంత్రములచే ప్రోక్షింప బడని మాంసమును వినియోగించుట)

విశ్వామిత్రస్సమాగత్య । శ్రుత్వా జాయాముఖాత్తతః
సత్యవ్రతస్యోపకృతిం । రాజ్యే తం చాభ్యషేచయత్
సహస్రవర్షకంరాజ్యం కృతంతేన మహీతలే॥ ౩౦-౩౧

సశరీరస్వర్గకామో । ప్రార్థయామాస స్వై గురుం
నిరాకృతో వసిష్ఠేన తత్పుత్రాన్ప్రాప భూపతిః॥ ౩౨

గురుధిక్కారకరణాత్త్వం చండాలో భవేతి తైః
వసిష్ఠపుత్రైశ్శప్తస్స న్కౌశికం శరణం గతః॥ ౩౩

1 మిషతాం సర్వదేవానాం । వసిష్ఠస్య చ కౌశికః
తేన యాగంకారయిత్వా । దత్వాచస్వతపః ఫలం
సశరీరం తదా తం స్వై దివమారోపయత్ప్రభుః॥ ౩౪

విశ్వామిత్ర ప్రసాదేన త్రిశంకుర్దివి రాజతే॥ ౩౪½
తత్పుత్రస్తు హరిశ్చంద్రః । త్రిషు లోకేషు విశ్రుతః ౩౫

2 సతురాజా హరిశ్చంద్రః । త్రైశంకవ ఇతిశ్రుతః ।
ఆహర్తారాజసూయస్య । స్సమ్రాడితి పరిశ్రుతః
రాజ్యం వింశతిసాహస్రవర్షాణాం రాజ్ఞా కృతం భువి॥ ౩౬½

---

2 త్రిశంకుపుత్రః హరిశ్చంద్ర ఇత్యత్ర వాల్మీకి రామాయణం ప్రమాణం.

1 బ్రహ్మాండ పురాణే లింగపురాణే చ 63 అధ్యాయే

30-3౧ పిమ్మట విశ్వామిత్రుడు తపమును చాలించి దారాపుత్రాదులయొద్దకువచ్చి భార్యవలన సత్యవ్రతుడు క్షామకాలమునఁజేసిన యుపకారమునువిని సంతసించి దానికి ప్రత్యుపకారముగ సత్యవ్రతునిఁగోసల రాజ్యాభిషిక్తునిగాఁజేసెను. అసత్యవ్రతుడు పిత్ర్యమయిన కోసల రాజ్యమును వెయ్యిసంవత్సరములు పరిపాలించెను.

3౨ తా॥ ఒకప్పుడు త్రిశంకుడు శరీరముతో స్వర్గమునుబొందఁదలచి గురువగు వసిష్ఠునిఁ గలిసికొని శరీరముతో స్వర్గమును బొందుటకుసాధనమును జెప్పుమని ప్రార్థింపగా, నతడునిరాకరించెను అనంతరముసత్యవ్రతుడు వసిష్ఠ పుత్త్రులయొద్దకు వచ్చి యవ్విధముననే ప్రార్థించెను.

33౫ వసిష్ఠ పుత్త్రులు కోపగించి, గురుధిక్కారమును జేసినవాడవుగాన నీవు చండాలుడవు కమ్మని త్రిశంకుని శపించిరి. ఇట్లువసిష్ఠపుత్త్రులచే శపింపఁబడి సత్యవ్రతుడు చండాలరూపుడై విశ్వామిత్రుని శరణము నొందెను.

3౮ సమర్థుడగు విశ్వామిత్రుడు త్రిశంకున కభయమిచ్చి దేవతలు వసిష్ఠుడు మొదలగువారు చూచుచుండగ . వానిచే నొకయాగమును జేయించి తనతపఃఫలమునిచ్చి త్రిశంకుని శరీరముతో స్వర్గమున కంపెను.

3౮౫ విశ్వామిత్రుని యనుగ్రహముచే త్రిశంకుడు స్వర్గమునఁబ్రకాశించుచుండెను.

3౭ ఆత్రిశంకునికుమారుడు హరిశ్చంద్రుడు ముల్లోకములయందుఁ బ్రసిద్ధి నొందెను.

3౬-౫ తా॥ త్రిశంకుపుత్త్రుడగు హరిశ్చంద్రుడు రాజసూయయాగమునుజేసి సార్వభౌముడని ప్రసిద్ధిఁజెంది యిరువదివేల సంవత్సరములు రాజ్యమును బాలించెను.

1 హరిశ్చంద్రస్య తు సుతో రోహితో నామవీర్యవాౝ
పితు స్తుల్యం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ 38-4

2 హరితో రోహితస్యాథ। స్వప్రజా స్స్వానురంజయౝ
పితు స్తుల్యంచ కృత్వా వ్రాజ్యం నిష్కంటకం పునః॥39-4

3 చుంచు భూప స్తత్సుతో ఽభూ ద్రాజా పరమధార్మికః
పితు స్తుల్యం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ 3౯-4

4 పితుస్తుల్యం కృతం రాజ్యం। విజయేనాపి భూతలే
జేతా సర్వస్యక్షత్రస్య। విజయ స్తేన సస్మృతః 40-4

---

1 సర్వేషా మేకాది షడంక సూచితానాం రాజ్యపాలనకాలః ౨0000 ఇతిభవిష్యే

1 హరిశ్చంద్రసుతః రోహిత ఇత్యత్ర వాల్మీకి రామాయణే బా॥70 సర్గే

2 రోహితసుతః హరితఇత్యత్రి వాయౌ లింగే భవిష్యే చ

3 హరితసుత శ్చుంచురిత్యత్రివా 88 అ. భవిష్యేచ.

4 చుంచుసుతః విజయ ఇత్యత్రి వాయౌ భవిష్యేచ.

౩౭౪ తా॥ హరిశ్చంద్రుని కుమారుడు లోహితుడు మహాబలవంతుడై భూమి
1 యందు దన తండ్రితో సమానముగ (అనగా 20000 సంవత్సరములు) రాజ్యమును బరిపాలించెను.

౩౮౪ తా॥ లోహితుని కుమారుడగు హారితుడు తన ప్రజలను సంతోష
2 పెట్టుచు రాజ్యమును శత్రురహితముగజేసి యిరువదివేల సంవత్సరములు భూమిని పాలించెను.

౩౯౪ తా॥ హారితునికుమారుడగు చుంచుభూపుడు పరమధార్మికుడై భూమి
3 యందు దన తండ్రి పరిపాలించినంతకాలము (అనగా ౨౦౦౦౦ సం॥) రాజ్యమును బరిపాలించెను.

౪౦౪ తా॥ చుంచుభూపుని కుమారుడు విజయుడను రాజు తన తండ్రి
4 పాలించినంతకాలము (అనగా ౨౦౦౦౦ సం॥) రాజ్యమును బరిపాలించెను. సమస్తరాజులను జయించినవాడు గాన విజయుడని చెప్పబడెను.

---

పైన సూచింపబడిన 1 మొదలు 6 అంకపర్యంతము గల రాజులందఱు ౨౦౦౦౦ సంవత్సరములు రాజ్యమును బాలించిరి యను విషయమున భవిష్యమహాపురాణము ప్రమాణము.

1 హరిశ్చంద్రుని కుమారుడు లోహితుడు అని చెప్పుటలో వాల్మీకి రామాయణ బాలకాండమున 70 సర్గము ప్రమాణము.

2 లోహితుని కుమారుడు హారితుడని వాయు లింగ భవిష్యమహాపురాణములు ప్రమాణము.

3 హారితుని కుమారుడు చుంచుభూపుడని వాయు 88 అధ్యాయమునను భవిష్యమహాపురాణమునను గలదు.

4 చుంచుభూపుని కుమారుడు విజయుడని వాయుపురాణమునను భవిష్యపురాణమునను గలదు.

5 పితు స్తుల్యం కృతం రాజ్యం రుచకేనాపి భూతలే
నిష్కంటకం ధర్మయుక్తం । మాసముద్రక్షితీతలం॥ ౪౧౫

6 తత్పుత్రేణ వృకేనాపి । స్వప్రజా స్త్వభిరక్షితా
పితు స్తుల్యం కృతం రాజ్యం ధర్మేణ పృథివీతలే॥ ౪౨౫

1 వృకపుత్రోఽపి బాహుకోపి పితృతుల్యసమా భువం
పాలయామాస పశ్చాద్వై రాజ్యభ్రష్టోఽభవద్ద్విజాః ౪౩౫

2 నిరస్తో హైహయై ర్బాహుః । హృతరాజ్యో వనం తతః
ప్రవివేశ సపత్నీకః । చచార చ తపో మహత్॥ ౪౪౫

వృద్ధత్వా ద్దుఃఖిత్వాచ్చ । హ్యంతరా స మమారహ॥౪౫

భూపాశ్చ బాహునీనాంతాః వైష్ణవాః పరికీర్తితాః
మణిస్వర్ణ సమృద్ధిశ్చ బహ్వాన్నం బహుమార్గకం॥ ౪౬

---

5 విజయసుతః రుచక ఇత్యత్ర లింగే 6? అ॥ భవిష్యే ప్రతిసర్గే చ॥ రుచకస్య వాయౌ రురుక ఇతి వర్తతే తథాపి రుచకస్యైవ రురుక ఇతి నామాంతర మిత్యూహ్యం

6 రుచకపుత్రః వృక ఇత్యత్ర లింగే 65 అ॥ మత్స్యే 11 అధ్యాయేచ

1 బాహుకరాజ్య పాలనకాలః (౨౦౦౦౦ సం॥) ఇతి భవిష్యే.

2 బ్రహ్మాండే.

౬౧౹ తా॥ విజయుని కుమారుడగు రుచకుడు చతుస్సముద్ర పర్యంతమైన
5 భూమిని శత్రుశూన్యముగాను, ధర్మయుక్తముగాను ఇరువదివేల సంవత్సరములు పరిపాలించెను.

౬౨౹ తా॥ రుచకుని పుత్త్రుడగు వృకుడను రాజు తన ప్రజలను బాగుగ రక్షిం
6 చుచు తండ్రితో సమానముగా (అనగా ౨0000 సం) భూమి యందు రాజ్యమునుఁ బాలించెను

౬౩౹ తా॥ ఓ మహాత్ములారా! వృకుని కుమారుడు బాహుకుడను రాజు తన తండ్రి పరిపాలించినంత కాలము (అనగా ౨0000 సం) రాజ్యమును బాలించి పిమ్మట రాజ్యభ్రష్టుడయ్యెను.

౬౪_౬౫ హైహయరాజులు బాహుకుని మీదికి యుద్ధమునకువచ్చి, వానితో యుద్ధముచేసి జయించి బాహుకునిరాజ్యము నాక్రమించుకొని యతనిని రాజ్యభ్రష్టునిఁ జేయగా నా బాహుకుడు భార్యలతోఁగూడఁ దపోవనమునకేగి గొప్ప తపమును జేయుచుండగా వృద్ధుడగుట వలనను, దుర్బలుడగుటవలనను, మధ్యకాలమున మృతిజెందెను. (బాహుకునకే బాహుసేనుడని నామాంతరమని యెఱుఁగనగును.)

౬౬ తా॥ బాహుసేనుడు పర్యంతముగల రాజులందఱు వైష్ణవులని (అనగా విష్ణుభక్తులనియే) యెఱుఁగనగును. బాహుసేనుని పర్యంతము భూమి యందుఁ బ్రజలకు సువర్ణమణి సమృద్ధియు, అన్న సమృద్ధియు, క్షీరసమృద్ధియు బాగుగనుండెను. ధర్మముకూడ పరిపూర్ణముగ నుండెను.)

---

5 విజయుని కుమారుడు రుచకుడని లింగపురాణమున 65 అధ్యాయమునఁ గలదు విజయుని కుమారుడు రురుకుడని వాయుపురాణమున నుండినను రురుకునకే రుచకుడని నామాంతరమని యెఱుఁగ నగును.

6 రుచకుని కుమారుడు వృకుడనుటలో లింగపురాణమున 65 అధ్యాయము మత్స్యపురాణము॥ అధ్యాయము ప్రమాణము.

పత్నీతు యాదవీతస్య । సగర్భా పృష్ఠతోఽన్వగాత్
సపత్న్యైచ గరస్తస్యై । దత్తో గర్భజిఘాంసయా॥ ౪౭

సాతు భర్తుశ్చితిం కృత్వా । వహ్నింతు సమరోహయత్
ఔర్వస్తాం భార్గవోదృష్ట్వా । కారుణ్యాద్ధి న్యవారయత్ ॥ ౪౮

సగరస్తు సుతో బాహోః । జజ్ఞే సహగరేణ వై
భృగో రాశ్రమ మాసాద్య । హవ్యార్వేణ పరిరక్షితః ౪౯

ఆగ్నేయ మస్త్రం లబ్ధ్వాతు । భార్గవాత్సగరో నృపః
జఘాన పృథివీంగత్వా । తాళజంఘా న్సహైహయాన్ ॥ ౫౦

అర్ధంశకానాం శిరసో ముండయిత్వా వ్యసర్జయత్
యవనానాం శిరస్సర్వం । కాంభోజానాం తథైవచ॥ ౫౧

ద్వేభార్యే సగరస్యాస్య భవతస్సగుణోత్తరే
తపసా మారాధితో వహ్నిర్దదౌ వరమనుత్తమం॥ ౫౨

తద్వరా త్ప్రథమా జయా । పుత్రం ప్రాసూత కేవలం
ద్వితీయా షష్టి సాహస్రం । పుత్రాణాం సమజీజనత్ ॥ ౫౩

౨౭-౨౮తా॥ బాహుకుడు మృతినొందు సమయమున నతని పెద్దభార్య గర్భవతి గానుండెను ఆమెయొక్క సవతి యసూయచే గర్భములోని శిశువు మృతినొందునట్లు బాహుకుని జ్యేష్ఠభార్యకు విషము పెట్టినను గర్భము చెడిపోక యుండియు స్వభర్తృ మరణమునకు విలపించి సహగమనముఁ జేయ నుద్యమించి చితినిఁ బ్రవేశింపబోగా దత్సమీప ప్రదేశమున తపమునుజేయుచున్న యౌర్వుడను మహర్షి దయారసము గలవాడై బాహుకుని జ్యేష్ఠభార్య సమీపమునకువచ్చి యోతల్లీ గర్భవతివిగాన సహగమనముకూడదని వారించి తనయాశ్రమమునకు నామెను దీసుకొనివెళ్లి కాపాడుచుండెను.

౨౯తా॥ ఔర్వాశ్రమమునందు బాహుకునిభార్య ప్రసవించెను - శిశువు సవతితల్లిచే పెట్టబడిన గరముతోగూడ (విషముతో) పుట్టినవాడు గాన సగరుడని నామముచేఁ బ్రసిద్ధుడై యౌర్వమహర్షి యాశ్రమమునందే యా మహర్షిచే రక్షింపబడుచుండెను.

౩౦తా॥ ఆగ్నేయాస్త్రమును సగరుడు భార్గవునివలన (ఔర్వునివలన) గ్రహించి తదస్త్రముచే తాళజంఘులను హైహయులను సంహరించి తన పిత్ర్యమైన రాజ్యమును తిరిగి సంపాదించెను.

౩౧తా॥ శకయవనకాంభోజరాజుల శిరస్సులకు ముండనముఁ జేయించి వారిని నిజదేశములనుండి సగరుడు వెడలఁగొట్టెను.

౩౨-౩౩తా॥ సగరునకు నిర్వురు గుణవతులగు భార్యలుండిరి. వారు సంతానముకొఱ కగ్నిదేవు నారాధింపగా, నాయగ్నిదేవుడు వారలకు సంతానము కలుగునట్లు వరమొసంగెను. ఆవర ప్రభావముచేత సగరుని జ్యేష్ఠభార్యకు నొకపుత్త్రు డుదయించెను. రెండవభార్యకు నరువది వేల పుత్త్రు లుదయించిరి.

ప్రజా సంక్షోభకరణా జ్జ్యేష్ఠం తత్యాజ వై పితా
అసమంజస నామానం పుత్త్రింతు సగరో నృపః ౫౪

సహస్రవిజయీ రాజా । వాజిమేధాయ దీక్షితః
అశ్వం వై చారయామాస । గురుణాఽభిప్రబోధితః॥ ౫౫

1 యజ్ఞీయాశ్వో హృతో ఽభూ ద్వై । వాసవేనతు మాయినా
తస్మి న్నపహృతే ఋత్విగ్యజమానంత ముక్తవాన్॥ ౫౬

* ఆనీయతాం తురంగాశ్వో । వినిహత్యాపహారకం ।
యజ్ఞచ్ఛిద్రం భవత్యేవ । సర్వేషా మశివాయ నః॥ ౫౭

నిహతస్యచ యజ్ఞస్య।సద్యఃకర్తా వినశ్యతి॥ ౫౭½

ఇత్యుక్తష్షష్టి సాహస్రపుత్రా । న్ప్రేషయ న్నృపః
విచిత్య సర్వతో భూమి మానేయోఽశ్వ ఇతీరయన్॥ ౫౮½

తేసర్వే హృష్టమనసో । రాజపుత్త్రా మహాబలాః
జగ్ము ర్మహీతలం సద్యః । పితుర్వచనయంత్రితాః॥ ౫౯½

---

1 వాల్మీకి రామాయణే బాలకాండే కథాసంగృహీతా.

* ఆనీయతామితి. అనేనయజ్ఞీయాశ్వహరణ మృత్విగ్యజమానాశుభకర మిత్యుక్తం భవతి, తథాచ త్తైత్తిరీయ శ్రుతిః "యోఽబలోఽశ్వమేధేనయజతే యదమిత్రా అశ్వంవిందేరన్ హన్యేతా స్యయజ్ఞ ఇతి."

౫౪ తా॥ సగరచక్రవర్తి, తన జ్యేష్ఠపుత్త్రుఁడగు నసమంజసుని, జనులను బాధించుచున్నందువలన దేశమునుండి వెడలఁగొట్టెను.

౫౫ తా॥ ఆ సగరచక్రవర్తి గురుఁడగు వసిష్ఠునిచేఁ బ్రేరేపింపఁబడి యశ్వమేధ యాగముఁ జేయుటకు దీక్షను వహించి యశ్వమును విడిచెను.

౫౬ తా॥ సగరచక్రవర్తి విడిచిపెట్టిన యజ్ఞీయాశ్వమును దేవేంద్రుఁ డపహరించెను. ఆ యశ్వ మెంతకాలమునకు రానందున యాగమును జేయించుచున్న ఋత్విక్కు యజమానియగు సగరచక్రవర్తినిగూర్చి యిట్లు జెప్పెను.

౫౭* తా॥ ఓ సగరచక్రవర్తీ! నీ యజ్ఞాశ్వము నపహరించినవానిని సంహరించి శీఘ్రముగ నీవశ్వమును తీసికొని రావలయును. ఆవిధముగఁ దీసికొనిరాకపోయినచో యజ్ఞచ్ఛిద్రమగు. దానివలన మనకందఱకు నమంగళము కాఁగలదనెను.

౫౭½ తా॥ యజ్ఞము నష్టమయినచో యాగకర్తయును వెంటనే నశించుననెను

౫౮½ తా॥ ఇవ్విధముగ ఋత్విజుఁడు చెప్పగనే సగరుఁడు తన యఱువదివేల పుత్త్రులతో భూమినంతను వెదకి యాగాశ్వమును వెదకి తీసికొని రండని చెప్పి వారినిఁ బంపెను.

౫౯½ తా॥ సగరచక్రవర్తిపుత్త్రులందఱు సంతసించి పితృవాక్యబద్ధులై వెంటనే భూమియందు వెదకుటకు వెళ్ళిరి.

---

* వ్యా॥ యాగాశ్వము నపహరించుటవలన ఋత్విగ్యజమానుల కమంగళ మను విషయమున తైత్తిరీయశ్రుతియు ప్రమాణమని యెఱుఁగనగును. ఎవఁడు వాజమేధమును జేయునో వాని యాగాశ్వమును విరోధు లపహరించినచో యజ్ఞము వినష్టమై యమంగళము నొనగూర్చునని చెప్పఁబడినది.

యోజనాయామ విస్తారమేకైకో ధరణీతలం
బిభిదుః పురుషవ్యాఘ్రాః వజ్రస్పర్శసమైర్నఖైః॥ ౬౦

1 సాగరా భూమిఖననం కృత్వా । కపిలసన్నిధౌ
అశ్వం దృష్ట్వాశ్వయం హర్తేత్యేవం తేఽత్యద్రవన్మునిం॥ ౬౧

తతస్తే సాగరాస్సర్వే । దగ్ధాస్తత్రోప వహ్నినా
సగరేణాంశుమన్మూలాద్యజ్ఞం పూర్ణం కృతం పునః॥ ౬౨

తృతీయ చరణే మధ్యే సగరో నామ భూపతిః
త్రింశత్సహస్రవర్షం వై కృత్వా రాజ్యముత్తమం॥ ౬౩

2 నష్టేషు సాగరేష్వేవ మసమంజస ఆత్మజః
శతహీనం కృతం రాజ్యమంశుమాం స్తత్సుతోఽభవత్॥ ౬౪

1 శతహీనం కృతం రాజ్య మసమంజసుతేన చ
స్వపుత్రే రాజ్యభారం తు సమర్ప్య విధినాఽంశుమాన్॥ ౬౫

---

1 వాల్మీకి రామాయణే బాలకాండే

2 భవిష్యపురాణే ప్రతిసర్గే పర్వణి అసమంజస రాజ్యపాలనకాలః సం॥ ౨౯౯౦౦ ఇతి ప్రతిపాదితం.

1 అంశుమతః రాజ్యకాలః సం॥ ౨౯౭౦౦ ఇతి భవిష్యే.

౨౦౪ తా॥ సగరపుత్త్రులలో నొక్కొకరుడు యోజనము వెడల్పు పొడవు గల భూభాగమును వజ్రముతో సమానమగు గోళ్ళచేఁద్రవ్విరి.

౨౧౪ తా॥ సగరపుత్త్రు లివ్విధముగ భూమినిఁద్రవ్వి పాతాళమునకేగి కపిలమహర్షి సాన్నిధ్యమునఁ దమయాగాశ్వమును జూచి యీ కపిలుఁడే తమ యశ్వమును హరించినవాడని యామునిని సంహరించుటకుఁ బరుగిడిరి.

౨౨॥ తా॥ పిదపఁ గపిలమహాముని యాకోలాహలము విని సమాధిని విరమించి వారిని చూడగ నాముని కోపాగ్నిచే నా సగర పుత్రులు దగ్ధమైరి. పిదప సగరుడు తనపుత్త్రులు రాని కారణమున వారిని వెదకుటకుఁ దన మనుమడైన యంశుమంతునిఁ బంపగా నతడు తిరిగి తిరిగి కపిలమహర్షి యాశ్రమమునఁ దన పితృవ్యులు నశించిన విధమును దెలిసికొని యాముని శాంతింపఁజేసి యశ్వమును దీసికొని వచ్చి సగరుని యజ్ఞమును బూర్తిఁజేయించెను.

౨౩౪ తా॥ కృతయుగమునఁ ద్వితీయపాదమధ్యమున సగరచక్రవర్తి ముప్పది వేల సంవత్సరములు రాజ్యమును బాగుగఁ బాలించెను.

౨౪౪ తా॥ సగరపుత్త్రులందఱు నష్టమైందగా సగరుని యనంతరము తత్పుత్త్రుడగు నసమంజసుడు పిత్ర్యమయిన రాజ్యమును తనతండ్రి కంటె నూఱు సంవత్సరములు తక్కువగా (౨౯౯౦౦ సం॥) పాలించెను. అతని కంశుమంతుడను పుత్త్రుడుండెను.

౨౫-౨౬ తా॥ అసమంజసుని కుమారుడగు నంశుమంతుడును తన తండ్రి కంటె నూఱు సంవత్సరములు తక్కువగా (అనగా ౨౯౮౦౦ సం) రాజ్యమును పాలించి రాజ్యభారమును దనపుత్త్రుని యందుంచి భస్మీభూతులగు సగరపుత్రులను తరింపఁజేయు నుద్దేశముతో గంగను భూమి మీదికిఁ దీసికొని రాదలచి చిరకాలము తపముచేసి విఫలుఁడయ్యెను.

2 గంగామానేతుకామ స స్తప్త్వా చ విఫలోఽభవత్॥ ౬౬
పితర్యుపరతే పశ్చా ద్దిలీపోఽ పాలయ న్మహీం
శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ ౬౭

రాజ్యం భగీరథే స్థాప్య । గంగానయన యత్నవాన్
విఫలో భూ త్తతః పశ్చా న్నృపాలోఽ భూ ద్భగీరథః॥ ౬౮

3 శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే
మంత్రిష్వాధాయ తద్రాజ్యం । తప స్తేపే సుదారుణం॥ ౬౯

తతస్సురగణై స్సార్థం తప్యమాన మథాబ్రవీత్
భగీరథ మహాభాగ । ప్రీత స్తేఽహం వరం వృణు॥ ౭౦

భగీరథః॥ యది మే భగవన్ప్రీతః । యద్యస్తి తపసః ఫలం
సగర స్యాత్మజా స్సర్వే మత్త స్సలిల మాప్నుయుః॥ ౭౧

తథేతి గంగాం వ్యసృజత్ । ప్రవాహేణ గతాం నదీం
దామోదర స్స్వపాదేతు। గంగాం ప్రావేశయ త్తదా ॥౭౨

---

2 వాల్మీకి రామాయణే దిలీపపాలనకాలః ౨౯౭౦౦ ఇతి భవిష్యే

3 భగీరథ పాలనకాలః సం ౨౯౬౦౦ ఇతి భవిష్యే

౧౭　అంశుమంతుని కొమరుడగు దిలీపుడు తండ్రి యనంతరము భూమి పాలుడై తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా (౨౯౨౦౦ రాజ్యమును జేసెను.

౧౮　దిలీపుడును పైవిధమునఁ గొంతకాలము రాజ్యముచేసి తనపుత్త్రు డైన భగీరథునియందు రాజ్యమునర్పించి గంగను దీసికొని వచ్చు టకుఁ బ్రయత్నించెను - కాని యతడును విఫలుడయ్యెను - పిదప భగీరథుడు భూమిపాలుడయ్యె.

౧౯　అనంతరము భగీరథమహారాజును భూమికిఁదనతండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా (౨౯౨౦౦సం) పాలించి రాజ్యమును మంత్రుల కప్పగించి గంగను భూలోకమునకుఁదెచ్చుటకు దారుణ గు తపమును జేసెను.

౨౦　అనంతరము తీవ్రతపమును జేయుచున్న భగీరథుని సమీపమునకు దేవగణముతోఁగూడ బ్రహ్మదేవుడు వచ్చి యిటులఁ బల్కెను. భగీరథుడా! నీతపమునకు నేనుసంతసించితి, వరమును గోరుమనెను.

౨౧ తా॥ భగీరథుడు బ్రహ్మదేవునితో నిటులఁ బల్కెను. ఓభగవానుడా! నాతపమునకు ఫలముండినచో, మఱియు నాయందు నీకుఁబ్రీతియుం డిన యెడల, నా ముత్తాతలగు సగరపుత్రుల భస్మరాసులు పావన గంగచే నభిషేకింపఁబడుగాక. (అనగా గంగను భూలోకమునకు విడువుమని భావము)

౨౨ తా॥ బ్రహ్మదేవుడు సమ్మతించి గంగను వదలిపెట్టెను ప్రవాహరూప ముగా వచ్చుచుండెడి యాగంగను విష్ణుమూర్తి తనపాదమునఁ బ్రవేశపెట్టెను (ఏలయన) పతితపావనియగు గంగ భూలోకమునకుఁ బోగూడదని)

దశ వర్ష సహస్రాణి తపస్తేపే హరిం నృపః
అనుగృహ్య హరిః కించి ద్వ్యసృజ ద్భాగీరథాం నదీం॥ ౨౩

[1] ఆయాంతీం తాం శివో గంగాం జటాజూటేద ధారహ॥ ౨౩౪

భగీరథోపి ఖిన్నస్స ద్దశ సాహస్రవత్సరాన్।
శివం ప్రతి తప స్తేపే। శివ స్తాం కృపయా౽త్యజత్॥ ౨౪౪

భగీరథరథా త్పశ్చా దాయాంతీం జహ్నునామకః।
యజ్ఞదేశో౽న్మాలినీం తాం పపౌ భాగీరథీం మునిః॥ ౨౫౪

భగీరథప్రార్థితస్స శ్రోత్రాభ్యా మత్యజచ్చ తాం।
తస్మాద్భాగీరథీ గంగా ప్రోచ్యతే జాహ్నవీతి చ॥ ౨౬౪

భగీరథోపి రాజర్షి ర్గంగా మాదాయ యత్నతః।
సాగరాణాం భస్మరాశిం ప్లావయామాస వై తతః॥ ౨౭౪

ప్రపితామహవర్గం చ స్వర్గినాయ భగీరథః॥
సోపి కృత్వా చిరం స్వర్గం గతవాం స్తదనంతరం॥ ౨౮౪

[2] శ్రుతసేన స్తతో రాజా శతహీనం తదబ్దకం।
రాజ్యం చకార ధర్మేణ స్వప్రజా స్త్వనురంజకః॥ ౨౯౪

---

1 వాల్మీకిరామాయణే . బాలకాండే కథాభాగః. 2. శ్రుతసేన పాలనకాలః 29500 సం॥ ఇతిక్షవిష్వే

౨౨తా|| అనంతరము భగీరథుడు పదివేలసంవత్సరములు శ్రీహరినిఁగూర్చి తపముచేయగాఁబురుషోత్తము డనుగ్రహించి కొంచెముగా గంగను భూమియందువిడిచెను.

౨౩౹ మహాప్రవాహరూపముగా వచ్చుచున్న యాగంగను శంకరుడు తన జటాజూటమునందు ధరించెను.

౨౪౹ భగీరథుడు ఖేదమునొంది పదివేల సంవత్సరములు శంకరునిగూర్చి తపము చేయగా నమ్మహాదేవుడు సంతసించి కృపతో గంగను భూమియందు విడిచెను.

౨౫౹ భగీరథునిరథము వెనుక వచ్చుచున్నట్టిదియు తనయాగభూమినిఁబాడు చేయుచున్నట్టిదియునగు గంగను జహ్నుమహర్షి పానముచేసెను.

౨౬౹ పిదప జహ్నుమహర్షిని భగీరథుడనేకవిధములఁబ్రార్థింప నమ్మహర్షి శ్రోత్రముల ద్వారా గంగను విడిచెను, ఆకారణముననే భాగీరథియైనగంగ, జాహ్నవియని చెప్పబడుచున్నది.

౨౭౹ భగీరథుడు గంగనుదీసికొని పోయి సగరపుత్రులభస్మరాశినిఁదడిపెను.

౨౮౹ ప్రపితామహులగు సగరపుత్త్రులను భగీరథుడు స్వర్గస్థులనుజేసి తానును జిరకాలము తపముఁజేసి యనంతరము స్వర్గస్థుడయ్యెను.

౨౯౹ అనంతరము భగీరథపుత్త్రుడగు శ్రుతసేనుడు రాజై తండ్రికంటె నూఱుసంవత్సరములు తక్కువగా, ధర్మముగా, రాజ్యమునుబాలించెను. (శ్రుతసేనుని పాలన కాలము ౯౯౫౦౦ సం|| అనియెఱుగవలయును.)

1 సైనా షట్ఛ్రతసేనాంతాః । నాభాగో నైష్ఠురో నృపః।
శతహీనం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥ ౨౦౪

2 తస్య పత్నీ శుభాచారా । హరిపూజారతా సదా
ప్రసుష్వాప కదాచిద్వై । స్వప్నే సాక్షాత్కృతో హరిః॥౨౧

కిమిచ్ఛసి వరం భద్రే పుత్రి స్వద్భక్తితుష్టవాన్ భవేత్॥౨౨

తథేత్యుక్త్వా ఫలం తస్యై దదావేకం జనార్దనః ।
భక్షయామాస సుదతీ । ఫలం సంహృష్టమానసా॥ ౨౩

తతః కాలేన సా దేవీ । పుత్రం కులవివర్ధనం
అసూయత శుభాచారం వాసుదేవపరాయణం॥ ౨౪

అంబరీష ఇతి ఖ్యాతో । నాభాగస్యాత్మజః పురః
పితర్యుపరతే శ్రీమాన్ । అభిషిక్తో మహాత్మభిః।
మంత్రిష్వాధాయ తై రాజ్యం। తప ఉగ్రం చకార సః॥౨౪౪

ఆజగామ స విశ్వాత్మా । సర్వలోకనమస్కృతః।
ఐరావతము పాశ్రిత్యం । కృత్వా వై గరుడం హరిః।
స్వయం శక్ర ఇవాసీనః । తమాహ నృపసత్తమం॥ ౨౫ ౨౬

ఇంద్రోఽహమస్మి భద్రం తే । కిం దదామి త వాద్యవై॥౨౬౪

1 భవిష్యే ప్రతిసర్గే 2 (నాభాగపాలనకాలః సం॥ (౨౫౮౦౦.)

౨౦౪ సగరుడు మొదలు శ్రుతసేనుని పర్యంతముగల యాలుగురు రాజులు శివభక్తులై యుండిరి. శ్రుతసేను పుత్త్రుడగు నాభాగుడు విష్ణుభక్తుడై యుండెను. నాభాగుడు తండ్రి యగు శ్రుతసేనుని యనంతరము ౭౫౮౦౦ సంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

౨౧,౨౨ నాభాగునిభార్య సదాచారము కలదియు శ్రీహరిని యెల్లప్పుడు పూజించునదియై యుండెను. ఒకప్పుడామె నిద్రించుచుండగా శ్రీహరి స్వప్నములో దర్శనమిచ్చి యో శుభాంగి! నీవు దేనిఁగోరి నన్ను నిరంతరము సేవించుచుంటివో చెప్పుమనగా, నాభాగునిభార్య భగవంతుని నిటులఁ బ్రార్థించెను. ఓభగవానుడా! నీ యందు భక్తిగల పుత్త్రుడు నాకుఁగలుగునట్లు చేయుమని కోరెను

౨౩ భగవంతుడాలాగేయని చెప్పి యామెకొకఫలము నిచ్చి యంతర్ధానమొందగాఁ బిదప శ్రీహరియిచ్చిన ఫలమును నామె సంతసముతో భక్షించెను.

౨౪ అనంతరము నాభాగుని భార్య గర్భవతియై కొలది కాలములో వంశాభివృద్ధికరుడు హరిభక్తుడు సదాచారుడు నగు పుత్త్రునిఁ గనెను. వాని కంబరీషుడని నామ మిడిరి.

౨౫ నాభాగపుత్త్రుడైన యంబరీషుడు తండ్రియనంతరము పెద్దలచేఁ బట్టాభిషిక్తుడై రాజ్యమునుఁ బాలించుచు నొకప్పుడు మంత్రులకు రాజ్యము నప్పగించి యుగ్రమైన తపమును జేసెను.

౨౬,౨౭ ప్రపంచస్వరూపుడును, సర్వలోకవందితుడును నగు శ్రీహరి, తన వాహనమగు గరుత్మంతుని నైరావతముగాఁజేసి తాను దేవేంద్రవేషమును ధరించి ఐరావతమునెక్కి యంబరీషు నొద్దకు వచ్చి వానితో నిటుల బలికెను.

౨౮ ఓ యంబరీషుడా! నేను దేవేంద్రుడను నీకు శుభములగుగాక, నీ యభీష్టమెద్దియో చెప్పుము; ఇచ్చెదననియె.

అంబరీషః॥ శ్లో॥ నాహం త్వా మభిసంధాయ ।
తప ఆస్థితవానహం। త్వయాదత్తంచ నేచ్ఛామి గచ్ఛ శక్ర
యథాసుఖం॥ ౮౮౫

తతః ప్రహస్య భగవా న్స్వరూప మకరోద్ధరిః ।
త మాహ భగవా న్విష్ణుః । కింతే హ్యభిచికీర్షితం॥ ౮౯౫

1 అంబరీషః శ్లో॥ త్వయి విష్ణో పరానందే। నిత్యం మేవ ర్తతాం మతిః
తథేత్యుక్త్వా నగోవిందః । చక్రం దత్త్వా రిపుక్షయే॥ ౯౦౫
అంతర్ధానంగతో విష్ణుః । వాజపేయాం శ్చకార సః॥ ౯౧
గృహే గృహే హరి స్తస్థౌ । వేదఘోషో గృహే గృహే ।
నామఘోషో హరే శ్చైవ । యజ్ఞఘోష స్తథైవచ॥ ౯౨
అభవన్నృపశార్దూలే । తస్మిన్రాజ్యం ప్రశాసతి॥ ౯౨౫

2 అంబరీషేణ భూపేన శతహీనం కృతం పదం
ఏకోనత్రింశ త్సాహస్రవర్షాణి త్రిశతానిచ॥ ౯౩౫
నాభాగే రంబరీషస్య భుజాభ్యాం పరిపాలితా ।
బభూవ వసుధాత్యర్థం । తాపత్రయ వివర్జితా॥
అంబరీషకథాం యస్తుశృణుయాత్సహరింవ్రజేత్ ॥౯౪-౯౫

ఇత్యాశ్చర్యరామాయణే చతుర్థస్సర్గ స్సమాప్తః.

---

1. బ్రహ్మాండే 2. భవిష్యే ప్రతిసర్గే 1 అ. అంబరీషపాలన కాలః 29300 సం॥

౭౮ అంబరీషుడిటులబలికెను. ఓ దేవేంద్రా ! నిన్ను నుద్దేశించి నేను తపమును జేయుచున్న వాఁడను కాను. నీవిచ్చినదానిని నేనుస్వీకరింపను. నేను శ్రీహరినుద్దేశించి తపము చేయుచుంటిని నీవు యథేష్టము గాఁబోవచ్చుననియె.

౭౯ అనంతరము దేవేంద్రవేషముతోఁ బరీక్షార్థమై వచ్చిన శ్రీహరి, నిజరూపమును జూపి, ఓయంబరీషుఁడా ! నీమనస్సులోని యభీష్టమును జెప్పుమనెను.

౮౦ అంబరీషుడు శ్రీహరితోనిట్లనెను. సచ్చిదానందరూపుడు సర్వవ్యాపకుడునగు నీయందు నామనస్సునిత్యము లగ్నమై యుండుగాక యని కోరెను.

౮౧ అంబరీషుడు ఈవిధముగఁగోరగ శ్రీహరియు నవ్విధముననే యగుగాకయని చెప్పి శత్రుసంహారముకొఱకుఁ దనచక్రాయుధము నంబరీషునకిచ్చి యంతర్ధానము నొందెను. అనంతరమంబరీషుడు వాజపేయ యాగములనేకముగాఁజేసెను.

౮౨ అయంబరీషుడు రాజ్యమును బాలించుచుండగాఁ బ్రతిగృహము నందును వేదఘోషము శ్రీహరిపూజయును హరినామ స్మరణమును యజ్ఞ ఘోషమును జరుగుచుండెను.

౮౩ అంబరీషమహారాజు తనతండ్రికంటె నూఱుసంవత్సరములు తక్కువగ. (అనగా ౨౯300 సంవత్సరములు రాజ్యమును బాలించెను.)

౮౪-౮౫ నాభాగపుత్రుడైన యంబరీషుని భుజములచేభూమి మిక్కిలి తాపత్రయరహితముగఁబరిపాలింపఁబడినది.

ఆశ్చర్యరామాయణమున చతుర్థసర్గము ముగిసెను.

## పంచమసర్గ ప్రారంభః

సింధుద్వీపస్సుత స్తస్య । నిత్యం ధర్మపరాయణః।
1 శతహీనం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥ ౧

అయుతాయు స్సుత స్తస్య । పాలయామాస మేదినీం।
2 శతహీనం కృతం రాజ్యం । తేనాపి పృథివీతలే॥ ౨

ఋతుపర్ణస్సుత స్తస్య । పుణ్యానామా మహాయశాః।
దివ్యాక్ష హృదయజ్ఞోఽసౌ । రాజా నలసఖో బలీ॥

3 శతహీనం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥ ౩౻

తదాత్మజ స్సర్వకామః । భువం పాలితవాం స్తతః
4 శతహీనం కృతం రాజ్యం । తేన రాజ్ఞా మహీంతలే॥ ౪౻

సుదాస స్తస్యతనయో । రాజాత్వింద్రసమోఽభవత్ ।
5 శతహీనం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥ ౫౻

---

1. సింధుద్వీప పాలనకాలః 29200 సం॥

2. అయుతాయుపాలన కాలః 29100 ॥

3. ఋతుపర్ణపాలన కాలః 29000

4. సర్వకామపాలనకాలః 28900 సం॥ 5 సుదాసపాలనకాలః 2880

పంచమసర్గ ప్రారంభము.

౧ అంబరీషుని పుత్త్రుఁడగు సింధుద్వీపుడు నిత్యము ధర్మతత్పరుఁడై యుండెను. ఆసింధుద్వీపుడును తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా (అనగా ౨౯౨౦౦ సంవత్సరములు) భూమియందు రాజ్యపాలనము జేసెను.

౨ సింధుద్వీపుని పుత్త్రుఁడగు నయుతాయువు భూమిని దండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా (౨౯౧౦౦ సం) పరిపాలించెను.

౩౪ అయుతాయువు కుమారుఁడగు ఋతుపర్ణుఁడు పవిత్రమైన నామము గలవాఁడును మహాకీర్తి సంపన్నుఁడును పాచకలాడుటయందు నిపుణుఁడును నలమహారాజునకు స్నేహితుఁడైయుండి భూమియందు (౨౯౦౦౦ సం.) రాజ్యపాలనమును జేసెను.

౪౫ పిదప ఋతుపర్ణుని పుత్త్రుఁడగు సర్వకాముఁడు భూమిపాలుఁడయ్యెను. ఆసర్వకాముఁడును భూమియందు (౨౮౯౦౦ సం॥) రాజ్యపాలనము చేసెను.

౫౬ సర్వకామునిపుత్త్రుఁడగు సుదాసుఁడనురాజు దేవేంద్రునితో సమానుఁడై యుండెను. ఆతఁడును భూమియందు దన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా (౨౮౮౦౦ సం॥) రాజ్యమును బాలించెను.

* సుదాసస్య సుతః ప్రోక్తః । సౌదాసోనామ పార్థివః ।
6 ఖ్యాతః కల్మాషపాదో వై । నామ్నా మిత్రసహశ్చ సః ।
శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞా పి భూతలే॥ ౬-౭

*వ్యా॥ సుదాసపుత్త్రస్య మిత్రసహ ఇతి కల్మాషపాద ఇతి నామాంతరాగమనకారణం విష్ణుపురాణే చతుర్థాంశే విస్తారేణ ప్రతిపాదితం॥ తథాహి, సౌదాసోమిత్రసహో నామాటవ్యామటన్ వ్యాఘ్రద్వయమపశ్యత్, తాభ్యాంచ తద్వనమపగతమృగంకృతం మత్వాతయోరేకం బాణేన జఘాన మ్రియమాణశ్చాసౌ సా పతిభీషణాకృతి రతికరాళవదనో రాక్షసోభూత్ ద్వితీయోపి ప్రతిక్రియాం తే కరిష్యామీ త్యుక్త్వాంతర్ధానం జగామ, కాలేన గచ్ఛతా స సౌదాసో యజ్ఞం చకార పరినిష్ఠితయజ్ఞేచాచార్యే వసిష్ఠే నిష్క్రాంతే తద్రక్షో వసిష్ఠరూపమాస్థాయ యజ్ఞావసానే మమ మనుష్యమాంస

6 సౌదాసపాలనకాలః (౨౭౦౦ సం.)

*జ–౨ సుదాసునికుమారుడగు సౌదాసుడు తండ్రియనంతరము (౨౭౨౦౦) సం॥ రాజ్యపాలనము చేసెను ఆసౌదాసునకు మిత్రసహుడనియు కల్మాషపాదుడనియు నామాంతరములు కారణాంతరముచేఁగలిగినవి.

---

* సౌదాసునకు మిత్రసహుడనియుఁ గల్మాషపాదుడనియు నామాంతరములు కలుగుటకుఁ గారణము విష్ణుపురాణమునఁ జతుర్థాంశమున విస్తారముగఁ జెప్పఁబడినది (ఏమన) సౌదాసుఁడొకానొకప్పుడు వనమునందు సంచరించుచుండఁగ రెండు పెద్దపులులు కన్పడెను. ఆరెండు పులులచే వనమంతయు నల్లకల్లోలము చేయబడుచుండఁగ సౌదాసుడు చూచి యాపులులలో నొక పులిని బాణముచేఁగొట్టెను – ఆపులి యిట్లు కొట్టబడి భయంకరాకారముగల రాక్షసుడయ్యెను రెండవ పులియును, ఓరాజా! నీకుఁదగిన ప్రతిక్రియను నేను సేసెదనని చెప్పి యంతర్ధానమొందెను. సౌదాసుడు గృహమునకు వచ్చి కొంత కాలము గడచిన పిదప నొకయాగమునుజేసెను. యజ్ఞపూర్తియయిన పిమ్మట కులగురువగువసిష్ఠుడు, స్వగృహమునకు వెళ్ళగా నాయవకాశమునుజూచి వనమునందు వ్యాఘ్రరూపముగానుండిప్రతిక్రియఁ జేయుదునని చెప్పిన రాక్షసుడు వసిష్ఠవేషముతో వచ్చి సౌదాసునితో నిట్లుఁజెప్పెను, ఓరాజా! యాగాంతమున నరమాంసభోజనము పురోహితునకుఁబెట్టవలయును కావున శీఘ్రముగ నరమాంసమును బచనముచేయింపుము. క్షణకాలములో వచ్చెదనని యావసిష్ఠవేషముతో వచ్చిన రాక్షసుడు చెప్పివెళ్ళిపోయెను. తిరిగి యారక్కసుడు వంటవాని వేషమును ధరించి, రాజానతిచే నరమాంసమును బచనముచేసి రాజునకు విన్నవింపగా, నాసౌదాసుడు పక్వమైన నరమాంసమును హిరణ్యపాత్రమునందుంచి వసిష్ఠుని రాకకెదురు చూచుచుండగా నిజమైన వసిష్ఠుడు వచ్చెను సౌదాసుడు నరమాంసమును బంగరు పళ్ళెమునందుంచి భుజింపుమని వసిష్ఠుని ముందుంచగా, నవ్వసిష్ఠుడు, సౌదాసుని దుశ్శీలమునకు విచారించి క్రోధముచేగలుషమైన మనస్సుగలవాడై సౌదాసునకు శాపమిచ్చెను (ఏమన) సౌదాసుడా! నరమాంసము మావంటి మహర్షులకు భుజింపఁదగనిదియని యెఱిగియుండి

* వసిష్ఠస్తు మహాతేజా । క్షేత్రేకల్మాషపాదకే ।
అశ్మకం జనయామాస ఇక్ష్వాకుకులవృద్ధయే॥ ౮
పితుస్తుల్యం కృతంరాజ్యం తేన రాజ్ఞాపిభూతలే॥ ౮౪

---

* భోజనం దేయమితి, తత్సంస్కర్తృయుతాం కృణా దాగ మిష్యావిత్యుక్త్వా నిష్క్రాంతః, భూయస్సూద వేషంకృత్వా రాజాజ్ఞయా మానుషమాంసం సంస్కృత్య రాజ్ఞేంన్యవేదయత్, అసావపి హిరణ్యపాత్ర స్థితమాదాయ వసిష్ఠాగమన ప్రతీక్షో భవత్ ఆగతాయ వసిష్ఠాయ నివేదితవాన్, సచాప్య చింతయత్ - అహోఽస్యరాజ్ఞో దౌశ్శీల్యం యేనైతన్మాం సమస్మాకం ప్రయచ్ఛతీతి క్రోధకలుషీకృతచేతా రాజనిశాప ముత్ససర్జ॥ యస్మాదభోజ్యమేతద్ అస్మద్విధానాం తపస్వినా మువగచ్ఛన్నపి భవాన్మహ్యందదాతి, తస్మాత్త్వమేవ పాత్రతోలుతా భవిష్యతీతి, అనంతరంచ తేనాపి భగవత్తైవాభిహితోఽస్మీత్యుక్తే । కింకింమయైవాభిహితమితిపునరపి సమాధౌ తస్థౌ - సమాధౌ విజ్ఞాతార్థశ్చానుగ్రహం తస్మైచకార - నాత్యంతికమేతద్ద్వాదశాబ్దం తవభోజనం భవిష్యతీతి, అసావపి ప్రకృత్యోదకాంజలిం మునిశాప ప్రదానాయోద్యతో, భగవన్నయమస్మద్గురుర్మాహాత్మ్యేనం కులదేవతాభూత మాచార్యం శప్తుమితి, మదయంత్యా స్వపత్న్యా ప్రసాదితః సస్యాంబుద రక్షణార్థం తచ్ఛాపాంబు నోర్వ్యాం నచాకాశే చిక్షేప - కింతు తేనైవ స్వపాదౌ నిషేచ తేనచ క్రోధాగ్న్యా

*రా|| తా|| వసిష్ఠమహర్షి యిక్ష్వాకు వంశాభివృద్ధికై కల్మాషపాదుని భార్యయందొక పుత్త్రునిఁ బుట్టించెను. వానికే యశ్మకుడని నామమై యున్నది. ఆయశ్మకుడు (౨౦౦౦ సం||) భూమిని పాలించెను.

---

యు, నాకు నీవు నరమాంసమును బెట్టితివి కాన, మనుష్యమాంసమును భుజించెడి రాక్షసరూపము నీకు గలుగుగాక యని, (శపించెను) అనంతరము సౌదాసుడు వసిష్ఠునితో నిట్లనియె - గురువర్యా! నీవు నరమాంసమునుఁ బచనము చేయింపుమని చెప్పి యిట్లు శపించితివేమి యన వశిష్ఠుడు తెల్లఁబోయి నేనే చెప్పితినా! యేమియాశ్చర్యమని ధ్యాననిష్ఠుడై చూడగా సర్వము సమాధియందు గోచరమయ్యె. అప్పుడు సౌదాసునకిచ్చిన శాపము పండ్రెండుసంవత్సరముల కాలము మాత్ర ముండుగాక యని చెప్పెను.

అప్పుడు సౌదాసుడున్న, దోసిలియందు జలము నుంచుకొని వసిష్ఠమహర్షిని శపించుటకు నుద్యమింపగా నాథా! కులగురువగు వసిష్ఠుని శపించుట తగదని. సౌదాసుని భార్యయగు మదయంతీదేవి సామవచనములతోఁ దనభర్తను శాంతింపఁజేయు, నా సౌదాసుడు దోసిలియందలి శాపోదకమును బైభాగమున విడిచిన మేఘములకు నాశము కలిగి వర్షము లేక క్షామము కలుగుననియు, భూమియందు విడిచిన సస్యముల

అశ్మక స్యౌరసో యస్తు మూలక స్తత్సుతో౽భవత్
సహి రామభయా ద్రాజా స్త్రీభిఃపరివృ తో౽వసత్ ॥౮

వివ స్త్రి స్త్రాణ మన్విచ్ఛ న్నారీకవచ ఈశ్వరః
1 పితుస్తుల్యం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥ ౯

తత్కాలే రావణో రాజ్యం లంకాయాం పాల యన్నభూత్
సనత్కుమారో భగవా నాగతో రావణాంతికం॥ ౧౦

---

(శి తేన శాపంబునాదగ్ధచ్ఛాయా తత్పాదా కల్మాషతాము పగతౌ, తతస్సకల్మాషపాదసంజ్ఞా మవాప - సౌదాసపుత్రస్య వసిష్ఠజస్యత్వే అశ్మకనామాగమనేచ హేతు స్తత్రైవోక్తః తథాహి సౌదాసః వసిష్ఠశాపాచ్చ రాక్షస స్వభావ ముపేత్యాటవ్యాం పర్యటన్ అనేకశో మానుషా నభక్షయత్ - ఏకదాతు కంచిన్మునిమ్మృతుకాలే భార్యా సంగతం దదర్శ, తయోశ్చ తమతిభీషణం రాక్షసరూప మవేక్ష్యత్రాసా ద్దంపత్యోః ప్రధావితయో ర్బ్రాహ్మణంస జగ్రాహ- తతస్సా బ్రాహ్మణీ బహుశ స్తమభియాచితవతీ, ప్రసీదేక్ష్వాకు కులతిలకభూత స్త్వం మహారాజో మిత్రసహో నామ రాక్షసః నాహ౽సి స్త్రీధర్మసుఖాభిజ్ఞో మ య్యకృతార్థా యా మిమం మద్భర్తారం హంతు మిత్యేవం బహుప్రకారం

---

1 మూలక రాజ్య కాలః 28700. ఇతిభవిష్యే అశ్మకజః హరివర్మేతి భవిష్యే వర్తతే మూలకస్యైవ నామాంతరం తదపీత్యనుసంధేయం.

శా॥పూ॥ అశ్మకుని యనంతరము తత్పుత్త్రుడగు మూలకుడను వాడు రాజ్యమును పాలించుచుండగాఁ బరశురాముడు క్షత్రియులను వధించుచు మూలకునిఁగూడ వధించుటకు రాగాఁబరశురాముని భయముచే వస్త్రవిహీనుడై స్త్రీలు ధరించు రవికను చీరను ధరించి స్త్రీలచేఁజుట్టుకొనబడి ప్రాణరక్షణము చేసికొనిన కారణముచే మూలకునకు నారీకవచుడని నామాంతరము కలిగెను. అతనికి రీ కాలన కాలము. (౨౦౦౦౦ సం॥)

౧౦ ఆసమయమున రావణుడు లంక రాజ్యము చేయుచుండెను. సనత్కుమారుడొకప్పుడు రావణునియొద్దకు వచ్చెను.

---

కు (పైగలకు) నష్టము కలుగునని యెంచి దలచి యామంత్రించిన శాపోదకమును దనపాదములయందే విడిచికొనెను. కోపాగ్నిచేదగ్ధమైన యాజలము పాదములయందు పడుటచేఁబాదములు కల్మషమయ్యెను (కమలిపోయెను) ఆకారణముచే సౌదాసునకుఁగల్మాషపాదుడని నామము కలిగెను (అనగా కమలినపాదములుకలవాడని భావము) మిత్రభావముతో వసిష్ఠుని శపింపదని భార్యబోధించగా తన భార్యవాక్యమునువిని సహించి యూఅకన్నవాడుగాన మిత్రసహుండనియుఁ బ్రసిద్ధిఁజెందెను.

వసిష్ఠమహర్షి వలన అశ్మకుడు పుట్టుటకుఁగారణము విష్ణుపురాణమునఁజతుర్థాంశమునఁజెప్పబడినది. వసిష్ఠశాపము వలన సౌదాసుడు రాక్షసుడై యరణ్యమున సంచరించుచు మనుష్యులనేకముగా భక్షించుచుండెను. ఒకప్పుడు భార్యతోఁగలసి యున్న యొకమునినిఁ జూచెను. ఆమునిదంపతులు రాక్షసునిఁజూచి భయపడిపాఱిపోవుచుండగా నామునిని బట్టుకొనెను. అనంతరము మునిభార్య యనేకవిధములుగ రాక్షసుని బ్రార్థించెను ఓ రాక్షసుడా ! నీవుపూర్వము సౌదాసుడను మహారాజువు రాక్షసుడవు కావు వసిష్ఠశాపముచేసి టుల

పూజయిత్వాఽర్ఘ్యపాద్యాద్యై స్తంమునిం రాక్షసేశ్వరః
పప్రచ్ఛ ముక్తికామ స్సన్నేకాంతే తాపసేశ్వరం॥ ౧౧

మహర్షే మమ కస్మాద్వై మృతి స్స్యా ద్వద మేఽనఘ॥౧౨

ఇక్ష్వాకువంశే భవితా రాజా దశరథాహ్వయః।
తత్పుత్రాన్మృతి రాదిష్టేత్యుక్త్వాఽగా త్తాపసేశ్వరః॥ ౧౩

---

తస్యాం విలపంత్యాం వ్యాఘ్రః పశుమివారణ్యేభిమతం తం బ్రాహ్మణ మభక్షయత్ తతశ్చాతికోపసమన్వితా బ్రాహ్మణీ రాజానం శశాప యస్మాదేవం మయ్యతృప్తాయాంత్వయాఽయం మత్పతిర్భక్షితః, తస్మాత్త్వమపి కామోపభోగప్రవృత్తో మృతింప్రాప్స్యసీతి, శప్త్వాచైవం సాఽగ్నింవివేశ తత స్తస్యాద్వాదశాబ్దానంతరం విముక్తశాపస్య స్త్రీవిషయాభిలాషిణో మదయంతీ తం స్మారయామాస తతః పర మసౌ స్త్రీభోగం తత్యాజ వసిష్ఠ శ్చాపుత్రేణ రాజ్ఞా పుత్రార్థ మభ్యర్థితః మద

౩౧ అప్పుడు రావణుడర్ఘ్య పాద్యాదులచే సనత్కుమారునిఁ బూజించి తనకు మరణమెవరి వలననో తెలిసికొనఁగోరి మహర్షిని క్రిందవిధముగ నడిగెను.

౧౧౪ ఓసనత్కుమార మహామునీ! నాకు నెవనివలన మరణముకలుగనో ఓపాపరహితుడా? విచారించి చెప్పుమని రావణుండడిగెను.

౩-౩౪ సనత్కుమార మహాముని యిట్లుఁజెప్పెను (ఏమన) ఓరావణుడా- ఇక్ష్వాకు వంశమున దశరథుడను పేరుగలరాజుపుట్టును ఆతనికుమారునివలన నీకుమరణము నిశ్చితమై యున్నదని చెప్పి సనత్కుమారుడు వెళ్ళెను.

---

రాక్షస రూపమును ధరించినవాడవు నేను కృతార్థురాలను కాకుండగ నీవునాభర్తను జంపుట న్యాయము కాదని బహువిధములుగ నామునిపత్ని విలపించుచున్నను పెద్దపులి పశువులను భక్షించిన విధముగ మునిని భక్షించెను. అనంతరము మునిపత్ని మిక్కిలి కోపముకలదియై రాక్షసరూపముతోనున్న సౌదాసుని శపించెను (ఏమన) నేను సంసారతృప్తి నొందనిదాననైయుండ, నాభర్తను నీవుభక్షించిన కారణమున నీవును నీకామాంతమునఁగామోపభోగముకొఱకు భార్యను గలసినచో మృతినొందఁగలవని శపించి యామునిపత్ని యగ్నిలోఁ బ్రవేశించెను. అనంతరము వసిష్ఠుని వాక్యము చొప్పునఁ బన్రెండు సంవత్సరములు సౌదాసుడు రాక్షస రూపములో నుండి పిదప శాపవిముక్తుడై రాజై తిరిగి తనపట్టణమునఁ బ్రవేశించెను. కాని మునిపత్ని శాపమునఁ దనభార్యయైన మదయంతినిఁ గలసికొనుటకు వలను

ఇక్ష్వాకువంశే తన్నామా జాతో వేతి విచారయన్
భియా యుతో రాక్షసేశ స్థితవాం స్తదనంతరం॥ ౧౩౫

1 మూలకస్యాత్మజో జాతః। నామ్నా దశరథ స్తతః
పితు స్తుల్యం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ ౧౪౫

తస్మా ద్దశరథా జ్జజ్ఞే నామ్నా త్విలబిల స్త్వితి॥ ౧౫

నామ్నా త్విలబిలం పుత్రంజాతం దశరథస్యతు
జ్ఞాత్వాగస్త్య పరీక్ష్యా థ రావణోపితభీ రభూత్॥ ౧౬

2 పితు స్తుల్యం కృతం రాజ్యం తేన రాజ్ఞామహీతలే॥ ౧౬౫

3 పితు స్తుల్యం కృతం రాజ్యం రాజ్ఞా విశ్వసహేన చ॥ ౧౭

---

యంత్యా సంగతః. యదాచస త్తవర్ష్యక పర్యంతం నానూత శిశుం తత స్తం గర్భమశ్మనా సాదేవీ జఘాన - పుత్రశ్చా జాయత తస్య చాశ్మక ఇత్యేవనామాభవత్॥

(అశ్మక పాలన కాలః ౨౮౭౦౦॥) ఇతిభవిష్యే.

---

1 మూలక పుత్త్రస్య శతిరథ ఇతి నామ వాయ్వాదిపురాణేషు దృశ్యతే తథాపి నామాంతర మిత్యూహ్యం॥
దశరథ పాలన కాలః (28700 సం॥) ఇతి భవిష్యే
2 ఇలబిలస్యాపి పాలన కాలః (28700) ఇతిభవిష్యే.
3 విశ్వసహ పాలన కాలః (28700 సం॥)

౧౩౫-౧౮౫ అనంతరము రావణుడు, ఇక్ష్వాకువంశమున దశరథుడను పేరుకల రాజు పుట్టెనా, యని విచారించుచు భయముతోనే యుండెను. ఇట్లుండగా నా యిక్ష్వాకువంశీయుడగు మూలకుడను రాజునకు కుమారుడు పుట్టెను. వానికి దశరథుడని పేరు పెట్టిరి. ఆ దశరథుడు తండ్రి యనంతరము తండ్రియగు మూలకుడు పరిపాలించినంతకాలము (అనగా ౧౦౨౦౦ సం॥) రాజ్యమును బరిపాలించెను.

౧౮౬ ఆ దశరథునకు, ఇలబిలుడను నొక కొమరుడు గలిగెను.

౧౮౭ దశరథునకు, ఇలబిలుడను పుత్త్రుడొకడు పుట్టినట్లు రావణుడు వినినతుంబురుమారుడు చెప్పిన దశరథుడితడేయనియు, నతనిపుత్రుడే తనకు మారకుడనియు భ్రమపడి, భీతిచే దశరథపుత్త్రునిం బరీక్షించుటకు వచ్చి యాబాలుడు సామాన్యుడుగా నున్నందునం దన్నుంజంప సమర్థుడు కాడని తలచి, నిర్భయముగా లంకకేగెను.

౧౮౮ ఆయిలబిలుడును తనతండ్రి పరిపాలించినంతకాలము (౧౦౨౦౦సం॥) రాజ్యమును బాలించెను.

౧౮౯ ఆయిలబిలుని కుమారుడు విశ్వసహుడును తండ్రి పాలించినంతకాలమే (౧౦౨౦౦సం॥) రాజ్యమును బరిపాలించెను.

---

పడక స్త్రీభోగమును విడిచెను. తనకు వంశాంకురమగునటుల దన భార్య యందు సంతానము కలిగించవలసినదిగా వసిష్ఠుని ప్రార్థింపగ వసిష్ఠుడు మదయంతినిం గలసెను. మదయంతి గర్భవతియైయుండి యేడు సంవత్సరములు పర్యంతము శిశువు బయటం బడనందున మదయంతి రాతితో దనగర్భమును గొట్టుకొనగా బుత్రుడు పుట్టెను. (అనగా బయటపడెను) అశ్మముచే (రాతిచే) గొట్టబడగా బుట్టినవాడుగాన అశ్మకుడని వానికి నామమయ్యె. అతడును తండ్రి పాలించినంతకాలము పాలించెను. (౧౦౨౦౦ సం॥)

రాజ్యం దశసహస్రం తన్నియజ్ఞో-పాలయన్నృపః॥ ౧౭॥

తదధర్మప్రతాపేన హ్యనావృష్టి స్తదా భవత్
శతవర్ష మనావృష్టి స్స్వరాజ్యమనాశయత్॥ ౧౮॥

4 యజ్ఞం వై కారయామాస రాజ్ఞా సంచోదితో గురుః
యజ్ఞా త్ఖట్వాంగ ఉత్పన్నః ఖట్వాంగశ్శత్రుమర్దనః॥ ౧౯॥

ఇంద్రసాహాయ్య మగమత్ రాజ్యం త్రింశత్సహస్రకం
కృత్వా తత్ర వరం లబ్ధ్వా దేవేభ్యో ముక్తతాంగతః ౨౦॥

ఖట్వాంగా ద్దీర్ఘబాహుశ్చ రాజ్యా వింశత్సహస్రకం
కృత్వా మహీతలే పశ్చా త్స్వర్గలోక మవాప సః ౨౧॥

ఖట్వాంగో దీర్ఘ బాహుశ్చ వైష్ణవౌ పరికీర్తితౌ॥ ౨౨

తస్మా త్సునన్దనో జాతః దేవీపూజనతత్పరః
మహోదారో మహాప్రాజ్ఞః కాశీరాజసుతాం నృపః ౨౩

పరిణీయ నృపా న్జిత్వా దేవీసేవాప్రసాదతః
రాజ్యం భరతఖండాంత మదధ ద్ధర్మతో నృపః॥ ౨౪

వర్షపంచసహస్రాణి రాజ్యం ... కే స భూపతిః
స్వప్నమధ్యేవచః ప్రోక్త ... కాళ్యా నృపాయవై॥ ౨౫

---

4 భవిష్యే

౧౭। విశ్వసహుని కుమారుడగు నియజ్ఞుండు పదివేల సంవత్సరములు రాజ్యమును పాలించెను. అనియజ్ఞుడు ప్రకృతి బద్ధుడై జ్ఞానహీనుడై యుండెను.

౧౮। అనియజ్ఞునియధర్మ ప్రభావముచే నాదేశమునందు దశావృష్టిదోషము సంభవించెను నూఱుసంవత్సరముల పర్యంతము వర్షము సరిగా కురియక పోవుటవలన రాజ్యమంతయు నష్టప్రాయమయ్యెను.

౧౯।-౨౦। నియజ్ఞుని భార్యవశిష్ఠునిఁబ్రార్థింపగ వశిష్ఠుడు రాణిప్రార్థన ననుసరించి నియజ్ఞునిచే యాగముఁ జేయించెను. ఆ యజ్ఞము వలన ఖట్వాంగుడు పుట్టెను ఆ ఖట్వాంగుడు నియజ్ఞుని యనంతరము పట్టాభిషిక్తుడై ముప్పదివేల సంవత్సరములు రాజ్యమును పాలించెను ఇంద్రునకు సహాయుడుగా నొకప్పుడు ఖట్వాంగుడు శస్త్రధారియై స్వర్గమునకేగి దేవతలవలన వరములనొంది తనకు మరణమెప్పుడు కలుగునని యింద్రుని నడుగగా ముహూర్తమాత్రమే యాయువని మహేంద్రుడు చెప్పగా భూలోకమునకువచ్చి సన్యసించి బ్రహ్మ సత్యము జగత్తు మిథ్యయని గ్రహించి ముక్తుడయ్యెను.

౨౧। ఖట్వాంగుని వలన దీర్ఘబాహుడు జన్మించి యతడు తండ్రియనంతరము, ఇరువదివేలసంవత్సరములు భూమియందు రాజ్యమునుఁజేసి పిదప స్వర్గస్థుడయ్యెను!

౨౨ ఖట్వాంగుడును దీర్ఘబాహుడును విష్ణుభక్తిగలవారని చెప్పఁబడుదురు.

౨౩-౨౪ దీర్ఘబాహుని పుత్రుడు సుదర్శనుడు దేవీపూజాపరుడును గొప్ప యౌదార్యవంతుడును మహాప్రాజ్ఞుడై యుండెను. అతడు కాశీరాజ పుత్రికను వివాహమాడి యిష్టదేవతానుగ్రహముచే రాజుల జయించి భరతఖండాంతమగు భూమి నంతను ధర్మముగాఁబాలించెను.

౨౫ అతడు (౫౦౦౦ సం) రాజ్యమును పాలించిన పిదప నొకదినమున రాత్రిభాగమున నిద్రించుచుండ కాళికాదేవి యిట్లు చెప్పెను.

వత్స త్వం ప్రియయా సార్ధం వసిష్ఠాదిభి రన్వితః
హిమాలయగిరిం ప్రాప్య వాసం కురు మహామతే। ౨౬

మహావాయుప్రభావేణ క్షయో భరతఖండకే
భవేద్భవా న్గత స్తత్ర జీవితో భవతా న్నృప॥ ౨౭

తథేతి మత్వా సన్నృపః। పర్వతం వై హిమాలయం।
ప్రాప్తవా న్ముఖ్యభూపైస్తుముఖ్యవైశ్యైర్ద్విజై స్సహ॥ ౨౮

తతః క్రమా జ్జలం జాతా వర్షాధిక్యా ద్వసుంధరా।
బహుజీవా వినష్టా శ్చ దశవర్షాంతరే పురః॥ ౨౯

తతః పశ్చాత్ స్థలీభూతా మహీ సర్వత్ర దృశ్యతే॥ ౨౯½

1 వైశాఖశుక్లపక్షే తు। తృతీయాగురువాసరే।
సుదర్శనో జనై స్సార్ధ మయోధ్యా మగమత్సునః॥ 30½

మాయాదేవీప్రభావేణ పురం సర్వం మనోహరం।
మహావృద్ధియుతం ప్రాప్తంబహ్వాన్నం సర్వగత్నకం॥ 30½

దశవర్షసహస్రాణి రాజ్యం కృత్వా సుదర్శనః।
ప్రాప్తవా న్శాశ్వతం లోకందిలీప స్తత్సుతో భవత్॥ 3౨½

2 దిలీపే సతిభూపాలే రావణప్రేషితాసురాః
సమాగత్య చ యుద్ధ్వా చ తేన రాజ్ఞా పరాజితాః।
ప్రాప్యలంకాందశాస్యాయసర్వంతేప్రాబ్రువం స్తతః॥ 33-3౪

---

1 భవిష్యే ప్రతిసర్గపర్వణి। అధ్యాయః.

2 భరద్వాజ రామాయణే.

౨౬ ఓ వత్సా ! నీవు నీ భార్యాపుత్రాదులతోడను వసిష్ఠాదులతోడను పురమునుండి వెడలి హిమవత్పర్వతమునం గొంతకాలము నివసింపు మని చెప్పెను,

౨౭-౨౮ మహావాయువువీచి భరతఖండమున జనము నశించును. కాన నీవు వెళ్ళి హిమవత్పర్వతమునందుండి జీవింపుమని కాళికాదేవి చెప్పిన ప్రకారము సుదర్శనుడు తన ముఖ్యులగు దారాపుత్రాది పరివారము తోడను, ముఖ్యులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులతోడను హిమవత్పర్వతమున కేగెను.

౨౯ పిమ్మట క్రమముగా వాయువుతో కూడినవర్ష మధికముగా కురియుటచే భూమియంతయు జలప్రాయమయ్యె. జీవకోటికి విశేషముగ నష్టము వాటిల్లెను. ఇట్లు పదిసంవత్సరములవర కుండెను.

౨౯౧ పిమ్మట జలప్రాయమైన భూమియంతయు మెట్టప్రదేశముగా నయ్యెను.

౩౦౧ వైశాఖశుద్ధ తదియాగురువారమున సుదర్శనుడు తన పరివారముతో బయలువెడలి యయోధ్యకేగెను.

౩౧౧ కాళికాదేవి ప్రభావముచే, తన రాజధానియగు నయోధ్యాపట్టణము ప్రలయమునకూడ నశింపక మనోహరమై యుండెను. మఱియు ధనకనక వస్తువాహన సమృద్ధితో నుండెను.

౩౨౧ ఇట్టి పట్టణమున సుదర్శనుడు తిరిగి పదివేలసంవత్సరములు రాజ్యము పాలించి సద్గతినొందెను. అతని కుమారుడు దిలీపుడై యుండెను.

౩౩-౩౪ దిలీపుడు తండ్రి యనంతరము రాజ్యమును పరిపాలించుచుండగ రావణుడు తన రాక్షసులను దిలీపునిమీదికి యుద్ధముం జేసిరండని పంపగా వారు వచ్చి దిలీపునితో యుద్ధముచేసి పరాజితులై లంకాపురికేగి, జరిగిన వృత్తాంతమును రావణున కెఱిగించిరి.

10

1 రావణ స్తద్బలం జ్ఞాతుం । ద్విజవేషధర స్తతః
దిలీపాంతఃపురం సర్వై ర్ద్విజై స్సాకం సమావిశత్॥ 3౫

సమభ్యర్చ్య తదా విప్రా న్దిలీపే సరయూం గతే
సుదక్షిణాఽఖ్య హస్తాఽగా ద్ద్విజరూపం దశాననం॥ 3౬

తస్యై సందర్శయామాస రావణస్తు నిజంవపుః
అంతః పలాయితా సాఽభూ ద్దృష్ట్వా తంభీతమానసా॥3౭

పున ర్బ్రాహ్మణరూప స్స నాప్రవణ స్సరయూం గతః
ద్విజపూజాకరం తత్ర । దిలీపం తు దదర్శ సః॥ 3౮

దిలీపస్తు తదా తత్ర మధ్యేత్యక్త్వా ద్విజార్చనం
ఊర్ధ్వ ముత్క్షేపయామాస తండులా నభిమంత్ర్య సః॥ 3౯

ఏవం కృతం త్వయా భూప కిమర్థమితి బాడబైః
పరిపృష్టో దిలీపస్తు కథయామాస తా న్ప్రతి॥ ౪౦

వనేఽద్య గోహంతుకామం సింహం తం హంతు కాముకః
తండులానభిమంత్ర్యాఽహమూర్ధ్వముత్క్షిప్తవా న్ద్విజాః॥౪౧

సింహో మృతోఽద్య పశ్యంతుభవంత స్త్విత్యువాచ సః
ద్విజ వేషదశాస్యస్తు నృపశక్తిం పరీక్షితుం
వనం గత్వా తత్రమృతం । మృగేంద్రంసందదర్శసః॥ ౪౨

1 భరద్వాజ రామాయణే తులసీదాసరామాయణేచ కథాభాగః.

౩౫ పిమ్మట రావణాసురుడు దిలీపుని బలమును పరీక్షించుటకు బ్రాహ్మణ వేషమును ధరించి యయోధ్యకేగెంచి బ్రాహ్మణులతోఁ గూడ దిలీపుని యంతఃపురమునుఁ బ్రవేశించెను.

౩౬ దిలీపమహారాజు సరయూనదికి స్నానార్థమై వెళ్ళియున్నందున సుదక్షిణాదేవి వచ్చిన బ్రాహ్మణులనుఁ బూజించి పూజాద్రవ్యములను హస్తమునఁ దుంచుకొని, బ్రాహ్మణవేషమును ధరించియున్న రావణునిఁ బూజించుటకు వానిసమీపమునకు వచ్చెను.

౩౭ రావణుఁడప్పుడామెకు నిజరూపమునుఁ జూపింపగ నాసుదక్షిణాదేవి యారాక్షసునిఁ జూచి భయపడి యంతఃపురమునకుఁ జొచ్చెను.

౩౮ ఆరావణుడు తిరిగి బ్రాహ్మణరూపమును ధరించి సరయూనదికివచ్చి యచ్చట బ్రాహ్మణపూజఁజేయుచున్న దిలీపునిఁ జూచెను.

౩౯ అప్పుడతడు మధ్యాహ్నబ్రాహ్మణపూజను జాలించియతడు తండులము లను (బియ్యమును) మంత్రించి పైభాగమునఁ జల్లెను.

౪౦ అక్కడనున్న బ్రాహ్మణులు, తండులములను దిలీపుడు పైకిజల్లుటకుఁ గారణము నడుగగా, నాదిలీపుడు వారలతోఁ గ్రిందివిధముగఁ జెప్పెను.

౪౧ ఓబ్రాహ్మణులారా! ఇప్పుడు సమీపప్రాంతములో నొకసింహము గోవునుఁ జంపుటకుయత్నించుచున్నది. గోహంతకమగు నా సింహమునుఁ జంపదలచి నేను తండులములనభిమంత్రించి పైకిచల్లితిని.

౪౨ బ్రాహ్మణులారా! సింహము చచ్చినదేమో ననుచు మీరిప్పుడు వెళ్ళి పరీక్షింపుడని దిలీపుడు పలుకగానచ్చట బ్రాహ్మణవేషముతో నున్న రావణుడు దిలీపునిశక్తినిఁ బరీక్షించుటకు వనమునకేగి యచ్చట చచ్చిపడియున్న సింహమునుఁ జూచెను.

దిలీపమంత్రశక్తేస్తద్భుజశక్తేశ్చ భీతిమాన్
తురం జగామ స్వపురీం। రావణో లోకరావణః॥ ౪౩

దిలీపోపి గృహం గత్వా। శ్రుత్వా జాయాముఖాత్పునః
రావణస్యతు దౌరాత్మ్యం కుపితోఽభూల్లయాగ్నివత్ ॥౪౪

స్వాంజలా వుదకం న్యస్య । జపిత్వాఽఽహారం మనుం ।
ఉదబిందూ స్పృత్యవాచ దిలీప స్స్వాంజలిస్థితాన్॥ ౪౫

యాయం శరా స్స్వయంభూత్వా లంకామేత్య చ తత్పురీం
రావణేన సమం వార్ధౌ నిమగ్నాం కురుత ద్రుతం॥ ౪౬

ఇత్యుక్త్వా స్వాంజలిగతం జలం దక్షిణతోఽత్యజత్॥ ౪౭

తదుత్క్షిప్తా శ్శరా భూత్వా క్షణేనో దకబిందవః
గత్వా లంకాపురీం సర్వాం కంపయామాసురద్భుతం॥ ౪౮

అకస్మికం భూమికంపం దృష్ట్వా సర్వేఽసురా స్తదా ।
నిరాశా జీవితే స్వస్మిన్ స్థితా స్తేఽజ్ఞాతహేతుకాః॥ ౪౯

తదా మండోదరీ జ్ఞాత్వా పాతివ్రత్యప్రభావతః।
ఉత్పాతహేతుం స్వపతే ర్దోషం ప్రాంజలి రబ్రవీత్॥ ౫౦

దిలీపభూపతే! భృత్యా స్తవ సర్వే వయం ప్రభో ।
అజ్ఞానాద్యత్కృతం భర్త్రా మమ సర్వం క్షమస్వతత్॥ ౫౧

౪౩౫ దిలీపుని మంత్రశక్తికిని తద్భుజశక్తికిని రావణుడు భీతిజెందిశీఘ్రముగ దనపురమునుఁగూర్చి వెళ్ళెను.

౪౪౫ దిలీపుడును సరయూనదినుండి తనగృహమునకువచ్చి భార్యవలన రావణుని దుర్మార్గమును విని ప్రలయాగ్నివలె కోపాతిశయముగల వాడయ్యెను.

౪౫౫ దిలీపుడు జలమునుమంత్రించి శత్రుమారకమగు మంత్రమును జపించుచుఁదనచేతిలోని జలబిందువులతో నివ్విధముగఁజెప్పెను.

౪౬-౪౭ ఓయుదకబిందువులారా! మీరుబాణరూపముకలవారై లంకకేగి రావణసహితముగ లంకాపురిని సముద్రములో ముంచిరండనియభి మంత్రించినజలమును దక్షిణముగా విడిచిపెట్టెను.

౪౮ దిలీపునిచే నివ్విధముగ వదలిపెట్టఁబడిన యుదకబిందువులు బాణ రూపకములై (వాయువ్యాస్త్రరూపకములై) లంకాపట్టణమును గంపించివేసెను.

౪౯ ఆకస్మికముగాఁ గలిగిన భూకంపముఁజూచి రాక్షసులందరును కారణము తెలియనివారై తమ జీవితములందు నిరాశఁ జెందిరి.

౫౦ అప్పుడు మండోదరి తనపాతివ్రత్యప్రభావముచే తనభర్తృదోషము చేఁనిట్టిమహోత్పాతము సంభవించినదియని తెలిసికొని చేతులుజో డించి దిలీపుని(ప్రార్థించెను)

౫౧ దిలీప మహారాజా! మేమందరము నీభృత్యులము "తెలియకనాభర్త చేసినయపరాధమును క్షమించుము"

త్వదన్యో రక్షకో నాస్తి రక్ష మాం శరణార్థినీం
యథా పురీయం నశ్యేన్న తథా కురు దయాం విభో॥ ౫౨

ఇతి మందోదరీదేవ్యా దీనయా ప్రార్థితో విభుః
దిలీపోపి కృపావిష్ట శ్చోపసంహృతవాన్ శరాన్॥ ౫౩

దిలీపాద్యసురాధీశో రామావధి విరోధకృత్ ।
క్రమాత్పూర్వైః పరాభూతో బభూవ ధరణీతలే॥ ౫౪

మగధాధిపతేః పుత్ర్యా లోకోత్తరసురూపయా ।
సుదక్షిణాఖ్యయా రాజ్ఞ్యా సహ సౌఖ్యాన్వితోఽభవత్॥ ౫౫

తథాప్యసంతతీ రాజా సభార్యస్త్వేకదా గురోః
సమీపం ప్రాప్య తం నత్వా వసిష్ఠమిదమబ్రవీత్॥ ౫౬

మృత్యుంగతే మయి బ్రహ్మన్ రాజ్యం కిం స్యాద్భవేద్వద ।
కేన దోషేణ మే పుత్రో న జాయతే తపోనిధే॥ ౫౭

వసిష్ఠః॥ త్వం పురా రాజశార్దూల సంసేవ్య సురనాయకం।
స్నాతా మిమాం వధూం స్మృత్వా చలితో నిజమందిరం॥ ౫౮

ఆసీత్సురతరోర్మూలే, కామధేనుః స్థితా పథి
ప్రదక్షిణనమస్కారమకుర్వాంస్త్వం సమాగతః॥ ౫౯

సా శపత్త్వామతిక్రోధాన్పుత్రో నోత్పత్స్యతే తవ॥
మమ సంతానశుశ్రూషాం యావత్త్వం న కరిష్యసి॥ ౬౦

౫౨ నీకంటె వేఱరక్షకుడు మాకు లేడు. శరణని ప్రార్థించుచున్న నన్ను రక్షింపుము. ఈపట్టణము నశింపకుండులాగున దయారసమునుంచుము.

౫౩ ఇవ్విధముగాఁ బ్రార్థించుచున్న మండోదరి దీనవాక్యములచే దిలీపుఁడు కృపగలిగినవాడై బాణముల నుపసంహరించెను.

౫౪ దిలీపుని మొదలుకొని రాముని పర్యంతము పూర్వరాజులతో నివ్విధముగ రావణుడు కలహించి పరాభూతుఁడగుననిఁ పరమేశ్వరుడు పార్వతితోఁ జెప్పెను.

౫౫ దిలీపమహారాజు, లోకోత్తరసౌందర్యవతియును, మగధరాజపుత్రికయగు సుదక్షిణాదేవితో సకలసౌఖ్యములం కలవాడైయుండెను.

౫౬ కాని సంతానములేని హేతువుచే నొకప్పుడు సుదక్షిణాదేవితోఁ గూడ, దిలీపుడు గురువగు, వసిష్ఠునొద్దకు వచ్చి యిన్విధముగఁ బలికెను.

౫౭ ఓగురువర్యా! నేనుమృతినొందిన పిమ్మట నా రాజ్యమెవరికి సంక్రమించునో, నేనేదోషము చేయుటచే సంతానము నాకుకలుగకపోయెనో యనుగ్రహించి చెప్పుడని ప్రార్థించెను.

౫౮ వసిష్ఠుడిట్లుచెప్పఁదొడగెను, ఓదిలీపమహారాజా! నీవు స్వర్గమునకు వెళ్ళిదేవేంద్రుని సేవించి స్వగృహమున నీభార్య ఋతుస్నాతయైన సంగతిని స్మరించి నిజపురమునకు బయలు వెడలితివి

౫౯ స్వర్గమునుండి బయలుదేరి వచ్చుచుండ తత్సమీపమున మార్గములో కల్పవృక్షముయొక్క మొదటియందు, కామధేనువు కన్పడినను దానికి నమస్కారమునుఁ జేయకుండగవచ్చితివి.

౬౦ కామధేనువు, నీవుతనను నమస్కరింపకుండగ వచ్చుటకుఁగోపమొందినాసంతతిలో చేరిన ధేనువునకుఁదిరిగి శుశ్రూషచేయుపర్యంతము నీకు సంతానము కలుగకుండు గాక యని శపించెను.

తస్యాస్సుతాసుతాం ధేనుం నందినీం నమతాన్నను।
ఆరాధయానయా పత్న్యా సాచ తేదాస్య తేసుతం॥ ౬౧

ఏవ ముక్తో నృప స్తేన పత్న్యా సహా వినిర్గతః
సపత్న్యాం నందినీం భక్త్యా పూజయంస్తాముదాశ్రితః॥ ౬౨

సా త్వరణ్యం గతా సోఽపి సభార్యో ఽనుజగామ చ।
ఏకాధికా వ్యతీయాయ దినానాం చైత్రవింశతిః॥ ౬౩

అలక్షితాగమ స్సింహో బలాజ్జగ్రాహ నందినీం।
బాణము ధృత్యతూణీరాత్సింహం హంతుం నృపో ఽవసత్॥ ౬౪

స్తంభీకృతభుజో రాజా త్వభూత్సింహ ప్రభావతః॥ ౬౪½

సింహః॥ శ్లో॥ దిలీపం త్వాం మహారాజం జానామి రవివంశజం
దైవేన కల్పితా మేఽద్య జఘ్ధర్థం నందినీత్వియం॥ ౬౫

రాజా॥ శ్లో॥ వసిష్ఠో బ్రహ్మణః పుత్రో గురుర్మే నందినీత్వియం
తేనదత్తాఽఽరాధయితుం తస్మాద్ధేనుం విముంచ హా॥ ౬౬

మయా కురు నిజాహారం గవార్థే సుగతిర్మను
ప్రాణాంస్తు త్యజతో మే స్యాదిత్యుక్త్వా సపపాత కా॥ ౬౭

పుత్రోత్తిష్ఠేతివచనం శ్రుత్వా రాజా సముత్థితః
జననీమివ తాం ధేనుం దదర్శ న మృగాధిపం॥ ౬౮

౬౧ ఆ కామధేనువు కూతురికూతురైన యీ నందినీధేనువును నీవు భార్యా సమేతముగా సేవింపుము. నందినీధేనువువలన నీవు సంతానముం బొందగలవు. (అని వసిష్ఠుడు చెప్పెను.)

౬౨ ఈవిధముగ వసిష్ఠుడు చెప్పగ దిలీపుడు భార్యతోఁగూడ వత్స సహితముగు నందినీధేనువును భక్తితోఁబూజించుచు దాని ననుస రించుచు వెళ్ళెను.

౬౩ ఆ నందినీధేనువు వత్ససహితముగ నరణ్యమున కేఁగగా నా దిలీపుడును భార్యతోఁగూడ దానినే యనుసరించి సేవచేయుచు వెళ్ళుచుండెను. ఇట్లు వెళ్ళుచుండగ నిరువదియొక్క దినములు గడచెను.

౬౪ ఆ సమయమున నొక సింహ మాకస్మికముగావచ్చి బలాత్కార ముగ నందినీధేనువునుఁ బట్టుకొనెను. దిలీపమహారాజు పొదిలోనుండి బాణముఁదీసి సింహమునుఁ జంపుటకుఁ బ్రయత్నించెను.

౬౪ ఆ దిలీపుడు సింహప్రభావముచే స్తంభింపబడిన భుజములుకలవాడై యుండెను.

౬౫ అప్పుడు సింహము దిలీపునితో నిటులఁబల్కెను. నీవు సూర్యవంశ కడవగు దిలీపమహారాజువనియెఱుగుదును. దైవము నాకీనందినీధేనువును ఆహారమునుగా గల్పించెను. (అని సింహము దిలీపునితోఁ బల్కెను.)

౬౬ దిలీపుడు సింహముతోఁ గ్రిందివిధముగఁ జెప్పెను. ఓ సింహమా! బ్రహ్మపుత్రుడగు వసిష్ఠుడు నాకు గురువైయుండెను. నేను నందినీ ధేనువునుఁ బరిచర్యచేయుటకు వశిష్ఠు డడుగగా, నతడు పరిచ ర్యార్థమై నాకిచ్చెను. కావున నందినీ ధేనువునువదలిపెట్టుము.

౬౭ వంటియు నో మృగరాజమా! ఆహారము కావలయుననినచో నన్ను భక్షింపుము. గోవునిమిత్తము ప్రాణములను విడచిన నాకు నుత్తమ గతి కలుగునని చెప్పి దుఃఖముతో భూమియందుఁబడెను

౬౮ అప్పుడు పుత్రుడా! లెమ్మను మాట విన్పడగా రాజు లేచిచూచెను. తల్లివలె నందినీధేనువుమాత్రము కన్పడెను. సింహమచ్చటఁ గన్ప డక పోయెను.

1నందినీ శ్లో॥మాయయాసింహరూపిణ్యాత్వం మయాసిపరీక్షితః
మనసాపి కుతోఽన్యేషాం గ్రహణే శక్తిరంగినాం॥ ౬౯

భవితా వంశకర్తా తే సుత శ్శస్త్రాస్త్రతత్త్వవిత్ ।
ఇత్యుక్త స్తు తయా రాజా ధేన్వా సహ గురుంగతః॥ ౭౦

సకలం వృత్తముక్త్వా చ గురవే సహ భార్యయా
తదనుజ్ఞా మవాప్తస్స న్జగామ స్వపురీం నృపః॥ ౭౧

నందిన్యా స్తు ప్రసాదేన దిలీపమహిషీ పునః
సుదక్షిణా గర్భవతీ ప్రాసూత సుత ముత్తమం॥ ౭౨

*1 దశవర్షసహస్రాణి దిలీపోఽపాలయ ద్భువం

*2 రఘునామా నృప స్సోఽయం పితర్యుపరతే సతి॥
రాజ్యేఽభిషిక్తః పృథివీం పాలయామాసవై చిరం॥ ౭౩½

ఏకదా విశ్వజిద్యాగం కృత్వా రఘురయం మహాన్
కోశజాతం దదౌ తస్మిన్బ్రాహ్మణేభ్యోఽధ్వరేఽఖిలం॥ ౭౪½

---

1 పాద్మే
*దశవర్ష సహస్రాణి దిలీపో రాజ్యమకృతేతి భవిష్యపురాణ
వచనేన దిలీప పాలన కాలః (10,000 సం॥.)
*2 రాజ్యం కృతం చ రఘుణా దిలీపాంతే పితుస్సమ మితి భవిష్య
వచనేన రఘుపాలన కాలోఽపి (10,000 సం॥.)

౧౯ అప్పుడు నందిని ధేనువు దిలీపునితోఁ నిట్లనియెను, ఓ దిలీపుడా! నేనే మాయచే సింహమునుఁ గల్పించి నిన్ను బరీక్షించితిని. ఇతరు లకు మనస్సుచేఁగూడ నన్నుఁబట్టుటకు శక్తిచాలదని యెఱుంగుము.

౨౦ నీకు వంశాభివృద్ధికరుడును శస్త్రాస్త్రవేత్తయునగు పుత్రుడు కలుగ గలడు అని నందిని ధేనువు చెప్పగా దిలీపుడు నందినీ ధేనువుతోడను తన భార్యతోడను వసిష్ఠుని సమీపమునకు వచ్చెను.

౨౧ జరిగిన వృత్తాంతమునంతను గురువగు వసిష్ఠునకుఁ జెప్పి తదనుజ్ఞను బడసి భార్యతోఁగూడ తనపురమును గూర్చి వెళ్ళెను.

౨౨ నందినీ ధేనువుయొక్క యనుగ్రహముచేత దిలీపుని భార్యయగు సుదక్షిణాదేవి, గర్భవతియై యుత్తముడగు పుత్రునిఁగనెను. ఆత నికి రఘువని పేరిడిరి.

1* దిలీపుడు పదివేల సంవత్సరములు రాజ్యమునుఁబాలించెను.

*2౨౩౪ తండ్రియనంతరము దిలీపపుత్రుడగు రఘువు భూమినిఁజిరకాలము పరిపాలించెను (అనగా ౧౦౦౦౦ సం||) పరిపాలించెను, (రఘు వనగా సర్వవిద్యాపారంగతుడని యర్థము.)

౨౪ రఘువు తనరాజ్యపాలన కాలమున నొకప్పుడు విశ్వజిద్యాగమునుఁ జేసి ధనమునంతను యజ్ఞములో బ్రాహ్మణులకిచ్చెను.

---

*1 పదివేల సంవత్సరములు దిలీపుడు రాజ్యమునుఁ బాలించెనని భవిష్య పురాణమునఁ బ్రతిసర్గపర్వములో నుండెను.

*2 తండ్రితో సమముగా రఘువు రాజ్యమును బాలించెనని భవిష్యపురా ణముననే యున్నది.

మృత్వాత్ర శేషంనృపతిం రఘుం కౌత్సను తోఽగమత్
వరతంతు గురోరర్థే దక్షిణా కాముక స్తదా ౨౫

కౌత్సాగమన వృత్తాంతం విదిత్వా రఘురప్యథ।
కుబేరేణ సమం యోద్ధుం సన్నద్ధోఽభూద్బలైర్నృపః॥ ౨౬

రఘోర్ధైర్యం బలం జ్ఞాత్వా కుబేరోపి భయాన్వితః
కోశాగారే రఘో స్తస్య స్వర్ణవృష్టిం వవర్ష సః॥ ౨౭

మహత్సువర్ణ రాశిం తం కౌత్సాయ ప్రదదౌ రఘుః
నాంగీచకార సర్వం తం గురో ర్దేయాత్సచాధికం॥ ౨౮

రఘుః॥శ్లో॥కౌత్స మిత్తాగతం హ్యేతన్మయాగృహ్యేతనో మునే ౨౯

మునిః॥శ్లో॥కోటీశ్చతస్రోదశచాహ రేతి గురుణా రఘో
కథితోఽహం తదేవాహం స్వీకరోమి నచాధికం॥ ౩౦

ఏవం తయోర్వివాదే తు ప్రశశంసు ర్జనాస్తుతౌ
అర్థితాధికదం భూపం ప్రదత్తా గ్రహణం మునిం ౩౧

సదస్యానాం ప్రార్థనయా స్వర్ణరాశిం ప్రగృహ్య సః
గురోర్నికట మాగత్య దదౌ సర్వం చ దక్షిణాం॥ ౩౨

౨౫ మట్టిపాత్రలు మిగులుగా గలిగియున్న రఘుమహారాజునుఁగూర్చి వరతంతు మహర్షి శిష్యుడగు కౌత్సమహర్షి గురుదక్షిణకొఱకు వచ్చెను,

౨౬ కౌత్సమహర్షి వచ్చిన వృత్తాంతమును రఘువు తెలిసికొని తనయొద్ద ద్రవ్యము లేని హేతువుచేఁగుబేరుని మీఁదికి యుద్ధమునకు వెళ్ళుటకు సైన్యములతో సన్నద్ధుఁడైయుండెను.

౨౭ రఘుమహారాజుయొక్క ప్రయత్నమును వాని ధైర్యమును బలమును గుబేరుడు, తెలిసికొని భయపడి, రఘుమహారాజుయొక్క ధనపుకొట్లయందు సువర్ణవర్షము కురిపించెను.

౨౮ రఘుమహారాజు గొప్ప సువర్ణరాశినంతయు కౌత్సమహర్షికిచ్చెను ఆ కౌత్సమహర్షియును తన గురువుకీయఁదగిన గురుదక్షిణకంటె నధిక ధనము గ్రహించుటకంగీకరింపక పోయెను.

౨౯ రఘుమహారాజు కౌత్సునితోఁ నిట్లు బలికెను ఓ కౌత్సమహర్షీ ! ఈ ధనమంతయు నీనిమిత్తముగా వచ్చినది కాన దీనినంతయుఁ నీవు గ్రహింపవలసినదేగాని నేను గ్రహింపను (అని రఘువు చెప్పెను.)

౩౦ కౌత్సమహర్షి రఘువుతోఁ దిరిగి యివ్విధముగఁ జెప్పెను—ఓ రఘుమహారాజా! పదునాలుగు కోట్ల సువర్ణనాణెములను గురుదక్షిణగా నా గురువగు వరతంతుమహర్షి చెప్పెను. కావున నేనంతమాత్రమునే గ్రహించెదనుగాని యధిక ధనమును గ్రహింపననియె.

౩౧ ఇవ్విధముగా కౌత్సునిచే యాచింపబడిన ధనముకంటె నధికముగా నిచ్చెదనని రఘుమహారాజును, గురుదక్షిణకంటె నధికముగా నీయబడిన ధనమును గ్రహింపనని కౌత్సమహర్షియును, వారలు వివాదపడుచుండగా నచ్చటిజనులు వారలనిద్దఱను కొనియాడిరి.

౩౨ సభ్యులందఱి ప్రార్థనచే కౌత్సమహర్షి యా సువర్ణరాశినంతయుఁ దీసికొని గురువునొద్దకేగి యా ధనమునంతయుం గురుదక్షిణగానిచ్చెను.

1 ఏకదా రావణో యోద్ధుం ప్రేషయామాస రాక్షసాన్
రఘు స్తాన్నిశితై ర్బాణై స్తాడయామాస రాక్షసాన్॥ ౧౩

రఘుణా తాడితా స్సర్వే రాక్షసా స్స్వపురీం గతాః
రావణాయాఽవద న్సర్వ స్త్వజేయో రఘు రిత్యథ॥ ౧౪

రఘుణా రావణే కోపాల్లంకాద్వారో శరాళిభిః
నిర్బంధితోఽయోధ్యాస్థేన తజ్జాయా ప్రార్థనావశాత్
ఉపసంహృతవా న్బాణ శ్శరాళిం రఘుభూపతిః॥ ౧౫

కదాచి ద్రావణోఽభ్యేత్య రఘుణా సంగరం తతః
కృత్వాచ వాయవ్యాస్త్రేణ లంకాయాం పాతితోఽభవత్॥ ౧౬

తత్పుత్రోఽభూ దజోనామ యస్మా దజముహూర్తజః
పితుస్స్వపరతేఽజోపి పట్టబద్ధోఽభవ త్తతః॥ ౧౭

దశవర్ష సహస్రాణి రాజ్యం కృత్వా రఘో స్సుతః
ఇష్ట్వాచ దేవతాః పశ్చాత్ స్వర్గలోక మవాప సః॥ ౧౮

ఆశ్చర్యరామాయణే పంచమసర్గ స్సమాప్తః.

---

1 భరద్వాజరామాయణే.

౨౩ ఒకప్పుడు రావణుఁడు రఘుమహారాజుతో యుద్ధముఁజేసి జయించి రంపని యోధులను బంపగా రఘుమహారాజు వారి నందఱను, తీక్ష్ణమైన బాణములచే హతముఁజేసెను.

౨౪ రఘుమహారాజుచే రాక్షసులందఱు పరాజితులై తమ లంకాపురి కేగి రావణునితో రఘుమహారాజు దుర్జయుడని చెప్పిరి.

౨౫ రఘుమహారాజు రావణునియం దాగ్రహము గలవాడై, యయోధ్య నుండియే లంకాపురద్వారములను తనబాణపరంపరలచే బంధింపగా మండోదరి బాణముల నుపసంహరింపుమని లంకాపురినుండి ప్రార్థింపగా, రఘుమహారాజుపసంహరించెను.

౨౬ అనంతరము రఘుమహారాజ పుత్త్రుడగు, అజమహారాజు తండ్రియనంతరము పట్టాభిషిక్తుడై రాజ్యముఁబాలించెను (అజుడను నామమెట్లు కలిగెననగా బ్రహ్మదేవతాకమగు అజముహూర్తమునందుఁ బుట్టినవాడు గనుక అజుడని పిల్వఁబడుచుండెను.)

౨౭ ఒకానొకప్పుడు రావణుడు స్వయముగా నయోధ్యాపురికి వచ్చి యజమహారాజుతో యుద్ధముచేసెను. అజమహారాజు వాయవ్యాస్త్రముచే రావణుని సాకేతపురమునుండి లంకాపట్టణములోఁ బడవేసెను.

౨౮ అజమహారాజు పదివేలసంవత్సరములు రాజ్యమునఁబాలించి [illegible] యజ్ఞములనుఁజేసి పిమ్మట స్వర్గస్థుడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున పంచమసర్గము ముగిసెను.

## షష్ఠ సర్గ ప్రారంభః

అథాజపుత్రోఽయోధ్యాయా మభూద్దశరథో నృపః
ఇక్ష్వాకూణా మతిరథో నిత్యం ధర్మరతో మహాన్॥ ౧

* తత్పాల్యమానే సాకేతే నకశ్చి దజహాచ్ఛ్రియః
నానాయకో నచావిద్వా న్సర్వే ధర్మరతా జనాః॥ ౨

1 అష్టౌ బభూవు ర్వీరస్య మహామాత్యా యశస్వినః
ఋత్విజౌ ద్వా వభిమతౌ వసిష్ఠో వామదేవకః। ౩

* ఈదృశై స్తైరమాత్యైస్తు రాజా దశరథోఽనఘః
ఉపపన్నో గుణోపేతై రన్వశాస ద్వసుంధరాం॥ ౪

2 అయోధ్యాయాస్తు సాన్నిధ్యే దేశే కోసలనామని
కోసలాయాం మహాపుణ్యః కోసలాఖ్యో నృపోఽభవత్॥ ౫

---

* అనేన రాజ్ఞో ధర్మతః పరిపాలనేన జనానాం ధర్మనిరతత్వం భవతీతి సూచితం॥ తథాచ ప్రాచీనాః॥ రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః యథా రాజా తథా ప్రజాః॥ ఇతి॥

* వ్యా॥ అనేన రాజ్ఞా సద్గుణవిశిష్టా మంత్రిణః సంగృహ్య ఇతి సూచితం తథాచ మనుః॥ సచివా న్సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్॥ ఇతి॥

1. వాల్మీకి రామాయణే బాలకాండే.

౧ అజమహారాజు ననంతరము తత్పుత్రుఁడగు దశరథమహారాజు అయోధ్య యందు పట్టాభిషిక్తుఁడయ్యెను. ఆ దశరథుఁడు ఇక్ష్వాకువంశీయు లగు రాజులలో నతిరథుఁడును ధర్మాసక్తుఁడును మహాత్ముఁడునై యుండెను.

*1 ౨ ఆ దశరథునిచేఁ బరిపాలింపఁబడుచున్న యయోధ్యాపట్టణమున శాస్త్రజ్ఞుఁడు కానివాఁడును, అసహనము గలవాఁడును, విద్వాంసుఁడు కానివాఁడును నొకఁడైనఁ గాన్పింపఁడు. జనులందరు ధర్మనిరతులైయుండిరి.

3 ఆ దశరథునకు కీర్తిసంపన్నులగు నెనమండ్రుగురు మంత్రులుండిరి.

* 2 వశిష్ఠుఁడు వామదేవుఁడును నిద్దఱు ఋత్విజులుండిరి.

౪ ఇట్టి సద్గుణసంపన్నులగు మంత్రులతోఁ గూడి దశరథమహారాజు భూమిని పరిపాలించుచుండెను.

౫ అయోధ్యాపట్టణ సమీపమున దక్షిణకోసలదేశమున కోసలయను రాజధానియందు పుణ్యాత్ముఁడగు కోసలుఁడను రాజుండెను.

---

*1 రాజు ధర్మముగా పరిపాలించుటచేత జనులందరు ధర్మనిరతులై యుండిరను విషయము దీనివలన సూచింపఁబడినది. ప్రాచీనులు నట్లే చెప్పిరి. (శ్లో॥) రాజు ధర్మవంతుఁడై యుండిన ప్రజలు ధర్మిష్ఠులై యుందురు. [illegible] ప్రజలట్లే యుందురని యు చెప్పఁబడినది.

*2 రాజు సద్గుణసంపన్నులగు నెనమండ్రు మంత్రులను సంగ్రహింపవలెనని దీనిచే సూచింపఁబడినది. [illegible] చెప్పెను. (శ్లో॥) [illegible] గురుమంత్రులనుగాని యోగ్యులగు మంత్రులనుగాని రాజు పరీక్షించి తనసన్నిధియందుంచుకొనవలెను.

తస్యాఽసీ ద్దుహితా రమ్యా కౌసల్యా పతికాముకా
తస్యా దశరథే నైవ వివాహో నిశ్చితో ముదా॥ ౬

లగ్నార్థం తం సమానేతుం దూతా దశరథంన్నృపం.
యయు ర్వినిశ్చయం కృత్వా । వివాహదివసస్యచ॥ ౭

తదా దశరథశ్చాపి । సాకేతే సరయూజలే
విహారం నావి రాజా వై । కురుతే మంత్రిబంధుభిః॥ ౮

తస్మిన్ కాలేతు లంకాయాం । విధిం పప్రచ్ఛ రావణః
కస్మా న్మే మరణం బ్రహ్మన్ తత్త్వంమేవక్తు మర్హసి
తద్రావణవచ శ్శ్రుత్వా కథయామాస తం విధిః॥ ౯

కౌసల్యాయాం దశరథా ద్రామ స్సాక్షా జ్జనార్దనః
చతుర్థా పుత్రరూపేణ భూత్వాత్వాం సహనిష్యతి॥ ౧౦

పంచమేఽహని లగ్నస్య రాజ్ఞో దశరథస్య హి
దివసో నిశ్చితో విప్రైః కోసలాఖ్యేన రావణ॥ ౧౧

1 తద్విధే ర్వచనం శ్రుత్వా పుష్పకస్థో దశాననః
అయోధ్యాం సత్వరం గత్వా రాక్షసైః పరివేష్టితః॥ ౧౨

నౌకావిహారిణంభూపం జ్ఞాత్వా తత్రగత స్తదా ౧౩
బభంజ నిజపాదేన తాం నౌకాం సరయూజలే
తదా సర్వే మృతా స్తత్ర । సరయ్వా నిర్మలే జలే॥ ౧౪

సుమంత్రాజనుతౌ ద్వౌతు నౌకాఖండోపరిస్థితౌ
శనై శ్శనైః ప్రవాహేణ గత్వా భాగీరథీం నదీం॥
తత స్సముద్ర మధ్యేత్య జీవితౌ ద్వీప మీయతౌ॥ ౧౫

---

1. ఆనందరామాయణే.

౬ అక్కోసలునకు కౌసల్యయను నొకకొమార్తె యుండెను. ఆమె వివాహయోగ్యురాలైయుండగా, దశరథునకిచ్చి వివాహము చేయుటకుఁ గోసలుడు నిశ్చయించెను.

౭-౮ వివాహదినమునకు దశరథుని దీసుకొనివచ్చుటకు, కోసలరాజదూతలు అయోధ్యాపట్టణమునకేగిరి. ఆ సమయమున దశరథుడు సాకేతపుర సమీపమునందలి సరయూనదిలో మంత్రిబంధుసమేతముగ నావికావిహారము సలుపుచుండెను.

౯ ఆ సమయమున లంకాపట్టణమున రావణుడు బ్రహ్మను ప్రశ్నించెను. ఓ బ్రహ్మదేవుడా! నాకెవనివలన మరణము గలుగునో విచారించి చెప్పుము. అని యడిగిన రావణుని వాక్యము విని బ్రహ్మదేవుడిట్లు సమాధానమిచ్చెను.

౧౦ దశరథునకు విష్ణ్వంశముతో నల్వురు పుత్రులుద్భవించెదరు. వారిలో కౌసల్యాపుత్రుడగు రాముడు నిన్ను సంహరింప గలడు.

౧౧ ఓ రావణుడా నేటికి నైదవదినమున కౌసల్యాదశరథులకు వివాహలగ్ననిశ్చయము బ్రాహ్మణులు చేసిరని బ్రహ్మ రావణునితోఁ జెప్పెను.

౧౨-౧౩ రావణుడు బ్రహ్మవాక్యమును విని దశరథుని సంహరింపదలచి రాక్షసులతోఁ గూడి విమానారూఢుడై యయోధ్యకేగి దశరథుని గూర్చి విచారింపగా దశరథుడు సరయూనదిలో విలాసార్థమై నావావిహారమునుఁ జేయుచుండెనని తెలిసి తానును దశరథుని వెదకికొనుచు సరయూనదీతీరమున వెళ్ళుచుండెను.

౧౪ రావణుడు సరయూనది వెంట వెళ్ళుచుండగా, దశరథసుమంత్రాదులతోఁ గూడిన నావ (పడవ) కనబడెను. రావణుడా నావను కాలితోఁ దన్నగా నా పడవ మునిగిపోయి యందలి జనులందఱు మృతినొందిరి.

౧౫ కాని దైవవశమున సుమంత్రుడును దశరథుడును పడవ చెక్కలనుఁ బట్టుకొని మెల్లమెల్లగా సరయూనదీ ప్రవాహమునుండి కొట్టుకొని వచ్చి గంగలోఁబడి యాగంగనుండి సముద్రము లోనికి వారిద్దరు కొట్టుకొనివచ్చి యొక ద్వీపమును జేరిరి

1 రావణః కోసలాం గత్వా కృత్వాపరమసంగరం
కోసలాఖ్యం నృపం జిత్వా కౌసల్యాం తు జహార సః॥ ౧౬½

కౌసల్యాం మత్స్యరాజాయ న్యాసభూతాం కరోమ్యహం
ఇతి నిశ్చిత్య మనసి పేటికాయాం నిధాయ తాం । తస్మై
సమర్ప్య హృష్టాత్మా యయౌ లంకాం దశాననః॥ ౧౭-౧౮

తిమింగిలోఽపి తాం మత్స్యే ధృత్వాబ్ధౌ విచర న్సుఖం
ఆహుతోఽన్యేన రిపుణా మత్స్యరాజేన నైతదా॥ ౧౯

ద్వీపే తాం పేటికాం స్థాప్య యోద్ధుం చ రిపుణా గతః॥ ౧౯½

తత్రైతౌ మంత్రినృపతీ ద్వీపం తం చాగతౌ తదా॥ ౨౦

నృపస్తాం పేటికాం దృష్ట్వా సముద్ఘాట్యాఽతి విస్మితః
తస్యాం దృష్ట్వాఽథ కౌసల్యాం జ్ఞాత్వా వృత్తం పరస్పరం
తావన్యోన్యం వివాహం తు నిర్వర్తయితు కాముకౌ॥ ౨౧½

స్రువేణ మనసా ధ్యాతో గురు ర్యోగబలాన్వితః
సపరస్తు సమాగత్య మంగళం నిరవర్తయత్॥ ౨౨½

లంకాయా రావణ శ్చాపి సమాహూయ విధిం పునః
ఉవాచ ప్రహసన్వాక్యం సభాయాం సంస్థితస్సుఖం॥ ౨౩½

---

1 ఆనందరామాయణే

౧౬। రావణుఁడు పిమ్మట కోసలపురికేఁగి కోసలరాజుతో గొప్పయుద్ధమును జేసి యారాజును జయించి కౌసల్య నపహరించెను.

౧౭-౧౮ ఈ కౌసల్యను చంపకుండఁగ సముద్రములోని తిమింగలమునొద్ద దాచెదనని రావణుఁడు నిశ్చయించి యా కౌసల్యను నొక పెట్టెయందుంచి సముద్రమునందలి తిమింగలమునకు దాప నిచ్చి తాను లంకాపురికేగెను.

౧౯। తిమింగలమును రావణుఁడిచ్చిన పెట్టెను నోటఁగరచుకొని సముద్రమున సంచరించుచుండఁగా శత్రువగు మరియొక మత్స్యరాజు తనను యుద్ధమునకుఁ బిలిచెను. అప్పుడా తిమింగిలము తన నోటియందలి పెట్టెను ద్వీపమునందుంచి శత్రువుతో యుద్ధము చేయఁబోయెను.

౨౦ అప్పుడు దశరథసుమంత్రులు పెట్టియున్న ద్వీపమునకే చేరిరి.

౨౧। దశరథుఁడు కౌసల్యయున్న పెట్టెఁ జూచి యా పేటికను దెరచి చూడగా కౌసల్య పెట్టెయందుండెను. ఆమెను జూచి యాశ్చర్యపడెను. పరస్పరము తమతమ వృత్తాంతములను దెలిసికొని వారిద్దఱు వివాహమును జేసికొనఁగోరిరి.

౨౨। అప్పుడు దశరథుఁడు తనగురువగు వసిష్ఠుని ధ్యానింపగా నవ్వసిష్ఠుఁడు యోగదృష్టిచేఁ దెలిసికొని భార్యతోఁగూడ దశరథుఁడుండిన ద్వీపమునకు యోగసిద్ధిచే క్షణములో వచ్చి వివాహమునుఁ జేయించుచుండెను.

౨౩। రావణుఁడు లంకాపురికేగి సభాస్థలమునఁగూర్చుండి బ్రహ్మదేవుని బిలిపించి యిటులఁబల్కెను.

ఇథే తవ మృషా వాక్యం రావణేన మయా కృతం
పతో దశరథ స్త్రోయే కౌసల్యా గోపితా మయా॥ ౨౪½

తద్రావణవచశ్శ్రుత్వా సభాయాం పద్మసంభవః
దీర్ఘస్వరేణ ప్రోవాచ ఓంపుణ్యాహమితిస్ఫుటం॥ ౨౫½

1 రావణస్య ప్రభమాత్ప్రాహకిమిదం వ్యాహృతంత్వయా ౨౬

విధిః ప్రోవాచ లగ్నంహి జాతం దశరథస్య తు॥ ౨౬½

తస్మిన్కాలే నారదోఽపి సభామేత్య తు రక్షసా
పరిపృష్టోఽబ్రవీత్తస్మై వివాహవిషయం తయోః॥ ౨౭

తదైవ రావణో మానిస్వయంభూసహిత స్త్వరం
విమానేనాగతో ద్వీపం కౌసల్యాజనుతాన్వితం॥ ౨౮

వధూవరౌ వసిష్ఠం చ । సుమంత్రం చ దశాననః
దృష్ట్వా దశాననః క్రుద్ధః హంతుం దశరథం యతః॥ ౨౯

దశాననో దశరథః । పరస్పరజయేషిణౌ।
యుద్ధం చ చక్రతుర్ఘోరౌ తదా బ్రహ్మన్యవారయత్॥ 30

1. ఆనందరామాయణే.

౨౪½ ఓ బ్రహ్మదేవుడా? నీవాక్యమును నే నబద్ధమునుగా జేసితిని. నేను దశరథునిఁ జంపితిని కౌసల్యను దాచితిని (నీవు కౌసల్యాదశరథులకు బుట్టినవానివలన నాకు మరణము కలుగునని చెప్పితివి అది యబద్ధ మయ్యెనని భావము.)

౨౫½ రావణుని వాక్యమును బ్రహ్మదేవుడు విని సభాస్థలమునందు దీర్ఘ స్వరముతో (ఓం పుణ్యాహమని) యాశీర్వచనమును స్పష్టముగాఁ బలికెను. (వసిష్ఠుడు కౌసల్యాదశరథులకు వివాహమునుఁ జేయించుచు బ్రహ్మను ధ్యానింపగా బ్రహ్మదేవుడు ఓం పుణ్యాహమని యాశీస్సును బలికెనని భావము).

౨౬ ఓ బ్రహ్మదేవుడా? నీవు సభలో నాశీర్వాదమునుఁ జేయుచుంటివి ఇప్పు డేమి శుభము జరుగుచున్నదని రావణుడు బ్రహ్మదేవునిఁ బ్రశ్నించెను.

౨౬½ కౌసల్యాదశరథులకు సముద్రద్వీపములో వివాహమిప్పుడు జరుగుచున్నది యని బ్రహ్మ రావణునితోఁ జెప్పెను.

౨౭ తా॥ ఆ సమయమున నారదుడు లంకాపట్టణమున రావణసభకు రాగా, రావణుడు, కౌసల్యాదశరథుల వివాహము జరుగుట నిజమా యబద్ధమా యని నారదునినడుగగా, నా దేవర్షి వారల వివాహము జరుగుట నిజమే యని చెప్పెను.

౨౮ అప్పుడే రావణుడు బ్రహ్మనారదులను వెంట నిడుకొని విమానారూఢుడై కౌసల్యాదశరథులుండిన ద్వీపమునకు వచ్చెను.

౨౯ ఆ ద్వీపమునందు నూతన వధూవరులగు కౌసల్యాదశరథులను వసిష్ఠ సుమంత్రాదులనుఁ జూచి యాశ్చర్యపడి రావణుడు కోపముతో దశరథుని సంహరింప నుద్యమించెను.

౩౦ దశరథుడు వెనుదీయక రావణునితో యుద్ధముఁ జేయ సమకట్టెను. అప్పుడు బ్రహ్మదేవుడు వారల నిద్దఱను నివారించెను.

నారదోపి దశాస్యం తం న్యవారయ దనేకధా
యద్భూరి తద్భగత్యైవ మృతే రక్ష్య శ్చ రుత్తమం॥ ౩౧
నారసింహాదినా ద్వైర భగవా న్ప్రియయాపహృత్
కిమర్థం త్వాం న హింస్యాద్యై విచారయ మదీరితం
సాహసం కురు మాఽద్యైవ సత్య ముషి దశానన॥ ౩౨
1 విధిః॥ నభవిష్యతి మద్వాణీ మృషా జానీహి నిశ్చయం
యద్భావ్యం తద్భవత్యేవ గహనా కర్మణో గతిః॥ ౩౩
ఇతి తాభ్యాం వారిత స్సరావణ స్స్వపురీం గతః॥ ౩౪
గచ్ఛంతం గగనే బ్రహ్మా జటాయుం విహగోత్తమం
సమాహూయా పుత్రేణ కారయిత్వాచ సౌహృదం
జగామ సత్యలోకం తు నారదేన సమన్వితః॥ ౩౫
పక్షిరాజాధిరూఢ స్సం స్తదా దశరథో నృపః
సదార స్ససుమంత్రశ్చ సాకేతం ప్రవివేశ సః॥ ౩౬
ఏవం మృత్యుముఖాన్నిర్గ నగరీం తు ప్రవిశ్య సః
బాంధుమిత్రాదికా న్సర్వా న్సమాహూయ యథావిధి
వైవాహికోత్సవం కృత్వా పూజయామాస చాఖిలాన్
కోసలోపిస్వజామాత్రే స్వరాజ్యంచ దదౌ తదా॥ ౩౭౩౮
తయా కౌసల్యయా సాకం రాజ్యభోగాన్బుభోజ సః॥ ౩౯

---

1, ఆనంద రామాయణే,

౩౧ ఓ రావణుఁడా! ఏది జరుగనున్నదో యది జరుగక మానదు. ఇప్పుడు చచ్చుటకంటె రేపటిదినమునఁ జచ్చుట యుత్తమ మను లోకోక్తి యున్నది కాన నీవు నిష్కారణముగఁ గలహించి యిప్పుడే ముప్పు తెచ్చి కొనుట మంచిది కాదని నారదుఁడు రావణునితోఁ జెప్పి నివారించెను.

౩౨౪ తా॥ మఱియు నారదుడు రావణునితో నిట్లుఁ జెప్పెను. ఓ రావణుడా నీవు దశరథునితో నిష్కారణముగఁ గలహించినచోఁ బూర్వము నృసింహస్వామి స్తంభమునుండి పుట్టివచ్చిన విధముగ భగవంతుడు రామరూపమున నెవ్విధముననో యిప్పుడే యావిర్భవించి నిన్ను సంహరింపఁగూడదో నా మాటను బాగుగ నాలోచింపుము. ఆయువుండగ నిప్పుడే సాహసమును జేయకుమనెను.

౩౩౪ అప్పుడు బ్రహ్మయు నిట్లు పలికెను. ఓ రావణుడా! నా వాక్యము మిథ్య కానేరదు. నిశ్చయముగ నమ్ము. ఏది జరుగనున్నదో యది జరుగక మానదు, కర్మగతి, శ్రేయమని చెప్పెను.

౩౪ ఈ ప్రకారముగా బ్రహ్మనారదులచే రావణుఁడు నివారింపఁబడి తన పురమునకేగెను.

౩౫౪ అనంతరమాకాశమార్గమున బోవుచున్న జటాయువును బ్రహ్మ పిలిచి దశరథునితో స్నేహము జేయించి తాను నారదునితోఁగూడ సత్యలోకమునకేగెను.

౩౬ అప్పుడు దశరథుఁడు కౌసల్యా సుమంత్రులతోఁగూడ జటాయువు నధిష్ఠించి సాకేతపురమునకేగెను.

౩౭౪-౩౮౪ ఇవ్విధముగా దశరథుడు మృత్యుముఖము నుండి బయటపడి తన పట్టణమును జేరి బంధుమిత్రాదులనందఱ నాహ్వానించి యథావిధిగా వివాహమహోత్సవమును జేసి యందఱను తగునట్లు పూజించెను. కోసలరాజును దశరథునకుఁ దన రాజ్యము నిచ్చెను.

౩౯ ఆ కౌసల్యతోఁగూడ దశరథుఁడు రాజ్యభోగములననుభవించుచుండెను

ఏకదా౽జనుక స్స్వర్గం దేవేంద్రం ద్రష్టు మిచ్ఛయా
గత్వా పున స్త్వాగమనే కామధేనుం దదర్శ సః॥ ౪౦

అకుర్వం స్తన్నమస్కారం గత్వా చ కతిచి త్పదః
విచార్య చ పునః పశ్చాద్గత్వా తాం ప్రణనామ సః॥ ౪౧

క్రుద్ధా సా౽శపదిత్యేవ మనపత్యో భవాన్భవేత్
ఇతి శప్తేన రాజ్ఞా సా ప్రార్థితా పున రబ్రవీత్॥ ౪౨

మత్ప్రసాదా త్తవ సుతా త్వేకా శీఘ్రం జనిష్యతి
విలంబేన సుతా శ్చాపి భవేయు ర్గచ్ఛతా ద్భవాన్॥ ౪౩

ఇత్యుక్తో నృపతి ర్గేహం గత్వా స్నాతాం ప్రియాం పునః
మిళితో౽భూ త్తత స్సాపి సత్వరం గర్భవ త్యభూత్॥ ౪౪

దశమే మాసి వై తస్యాః కన్యారత్న మజాయత
శాంతేతి నామ భగవా న్వసిష్ఠ స్తు చకార స॥ ౪౫

క్రమా ద్వృద్ధి మవాప్తాయా శ్శాంతాయా స్తు స్వయంవరః
ఘోషితో౽భూ న్నృపతినా చాయయు ర్నృపసూనవః॥ ౪౬

రామః పరశుధారీ స న్నాయయా తత్స్వయంవరే
సర్వే పలాయితా స్సద్యః తదా నృప మువాచ సః॥ ౪౭

౪౦ ఒకప్పుడు దశరథుఁడు దేవేంద్రునిఁ జూచుటకు స్వర్గమునకేగి తిరిగి వచ్చుటలో స్వర్గసమీపమాననే, కామధేనువును జూచెను.

౪౧ కాని, దశరథుడు కామధేనువునకు నమస్కరింపకుండఁగఁ గొంత దూరమేగి, శపించుననుభయములో వెనుకకుఁ దిరిగివచ్చి కామధేనువును నమస్కరించెను.

౪౨ నీవు, సంతానహీనుఁడవు కాఁగలవని కామధేనువు కోపముతో దశరథుని శపించెను. ఇట్లు దశరథుడు శపింపఁబడి కామధేనువును బహువిధముల ప్రార్థించెను.

౪౩ అప్పుడు కామధేనువనుగ్రహించి రాజుతో నిటులఁ జెప్పెను. నా యనుగ్రహముచే నీకొక స్త్రీసంతానము శీఘ్రములోఁ గలుగఁగలదు. విలంబముచేఁ బుత్త్రులు కలుగుదురు నీవు వెళ్ళుము ) అని చెప్పెను.

౪౪ ఇటులఁ గామధేనువు చెప్పినపిమ్మట దశరథుడు తన గృహమునకేగెను. ఋతుస్నాతయైన కౌసల్యను దశరథుడు కలియఁగా వెంటనే యా కౌసల్య గర్భవతి యయ్యెను.

౪౫ ఆకౌసల్యకు పదియవమాసమున నొకకన్యారత్నము కలిగెను. పూజ్యుఁడగు వసిష్ఠుఁడు కౌసల్యాపుత్త్రికకు శాంతయను నామకరణముఁ జేసెను.

౪౬ క్రమముగా శాంతయను కన్యక వృద్ధినొందెను. ఆ కన్యకకు వివాహసమయము వచ్చినందున దశరథుఁడు స్వయంవరమును చాటింపగా రాజపుత్త్రులందఱు స్వయంవరమునకు వచ్చిరి.

౪౭ పరశురాముఁడు గండ్రగొడ్డలిని ధరించి యా స్వయంవరమునకు రాఁగా నా జమదగ్నిపుత్త్రునిఁ జూచి రాజులందఱు భయముచేఁ బారిపోయిరి. అప్పుడు పరశురాముఁడు దశరథునిఁ జూచి యివ్విధమునఁ బలికెను.

మహర్షయే ప్రదాతవ్యా కన్యేయం వరవర్ణినీ । నోచే
త్త్వాం నాశయిష్యామీత్యుక్త్వా రామాయయా పునః॥ ౪౮
అనపత్యోఽంగరాజోపి సఖా దశరథస్య తు
తదా నృపం ప్రార్థితవాన్కాంతాంకృత్రిమపుత్రికాం॥ ౪౯
కన్యాం దశరథో రాజ్ఞా రోమపాదేన యాచితః
అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ తాందదౌ॥ ౫౦
తదాది తస్యా మేకోపి నాభవత్పుత్రికశ్చిరం॥ ౫౦½
ఏతస్మిన్నంతరే రాజ్ఞా మాగధేన తు పత్రికా
సంప్రేషితాఽజపుత్రాయ స్వకన్యాశుభసూదికా॥ ౫౧½
కౌసల్యాం తాం నిశామ్యాఽశు తదా దశరథం పతిం
ప్రోత్సాహయిత్వా సుభగా ప్రేషయామాస తత్పురం॥
తత్ర గత్వా దశరథ స్స్వయంవరసభాం గతః ౫౨-౫౩
స్వయంవరసభాం సర్వే రాజపుత్రా స్సమాగతాః॥
మాగధేశసుతా సాపి సుమిత్రా స్వసఖీయుతా
సభాస్థలం గతా పాణౌ పుష్పమాలాం ధరంత్యథ॥ ౫౪½
వృద్ధదాసీ రాజవంశపరిజ్ఞానవతీ తదా ।
ఏకైకనృపసాన్నిధ్యం నీత్వా కన్యా మబోధయత్॥ ౫౫½
కన్యే మహానయం రాజా కాళింగో బహుకోశవాన్.
నైకజాయాసమప్రీతిః యదీచ్ఛసి నృపం వృణు॥ ౫౬½

౪౮ ఓ దశరథుఁడా ! యీ కన్యను మహర్షికీయుము. అటులనీయనిచో నన్ను వశింపఁజేసిదనని పరశురాముఁడు చెప్పి తిరిగి వెళ్ళిపోయెను.

౪౯ దశరథునకు మిత్రుఁడైన యంగదేశరాజగు రోమపాదుడు సంతానహీనుఁడైనందున శాంతను దనకు దత్తగా నీయుమని దశరథమహారాజును బ్రార్థించెను.

౫౦ రోమపాదుఁ డివ్విధముగ దన్నుఁ బ్రార్థింపగా దశరథుఁడు తన కుమరితను రోమపాదునకు దత్తుగా నిచ్చెను.

౫౧ ఆ మొదలు కౌసల్యయందు సంతానము చిరకాలపర్యంతము లేక కలుగకపోయెను

౫౧ ఈ సమయమున మగధరాజు దన పుత్త్రికకు స్వయంవర మహోత్సవమును జేయఁదలచి రాజులందరకు నాహ్వానపత్త్రికలను బంపుచు దశరథునకుఁగూడ నాహ్వానపత్త్రికఁ బంపెను.

౫౨-౫౩ కౌసల్య మగధరాజు పంపిన శుభపత్త్రికను జూచి, యప్పుడు వెంటనే దశరథునిఁ బ్రోత్సహించి మగధరాజ పట్టణమునకుఁ గూర్చి పంపెను. అక్కడకు వెళ్ళి దశరథుఁడు స్వయంవరసభ కేగెను.

౫౪ రాజపుత్త్రులందరును స్వయంవరసభను గూర్చి వచ్చిరి. మగధరాజ పుత్త్రిక యగు సుమిత్రయు పుష్పమాలికను హస్తమునందుంచుకొని చెలికత్తెలతోఁగూడ సభాస్థలమునకు వచ్చెను.

౫౫ రాజవంశములను గుర్తెఱిఁగిన యొక వృద్ధదాసి, సుమిత్రాదేవిని బ్రత్యేకముగ రాజపుత్త్రుల సన్నిధానమునకుఁ దీసికొనివెళ్ళి యామెకు నిటులఁ జెప్పెను.

౫౬ ఓ రాజపుత్త్రి ! ఈ కళింగదేశపు మహారాజు బహు ధనవంతుఁడును భార్యలందఱియందును సమమైన ప్రేమభావము గలవాఁడునై యుండెను. నీ కిష్టమైన వరింపు మనెను.

ఇత్యుక్తా మాగధీ జ్ఞాత్రీ పురతః స్తామచోదయత్॥ ౫౭

వంగరాజాంతికం నీత్వా రాజపుత్రీం తు చేటికా
బోధయామాస తస్యాథ బహుపుత్ర ధనాఢ్యతాం॥ ౫౮

తదాశయజ్ఞా కన్యా సా పురతస్తా మచోదయత్॥ ౫౮-౻

ఇత్థమా చ్చేటీ దర్శయంతీ రాజపుత్ర్యై బహూన్నృపాన్
బోధయంతీ చ తద్వృత్తం నినా యాజసుతాంతికం॥ ౫౯-౻

చేటీ ప్రాహ సుమిత్రాం చ రాజాఽయం రఘుపౌత్రకః
అజపుత్రః స్సార్వభౌమ స్సప్తైలవనభూపతిః।
నామ్నా దశరథో లోకే ఖ్యాతకీర్తిర్గుణాధికః॥ ౬౦-౬౧

ఇతి సంబోధితా కన్యా। మాగధీ పుష్పమాలికాం
నిక్షిప్య కంఠే రాజ్ఞ స్తు వవ్రే దశరథం తదా॥ ౬౨

తయా సుమిత్రయా సాకం సమాగత్య ౘజం పురం
బుభోజ సర్వసౌఖ్యాని చిరం దశరథ స్తతః॥ ౬౩౻

౫౭ ఇవ్విధముగ వృద్ధదాసి చెప్పగ నామెభావమును గ్రహించి ముంద అకు నడువుమని ప్రోత్సహించెను. (అనగా కళింగరాజునకు బహు భార్యలుండినట్లు గ్రహించి ముందుకు నడువుమని ప్రోత్సహించెనని భావము.)

౫౮ పిమ్మట వృద్ధదాసి రాజపుత్త్రికను వంగరాజసమీపమునకుఁదీసికొని వెళ్ళి యతడు బహుధనాఢ్యుఁడును బహుపుత్త్రుఁడునై యుండెనని యామెకుబోధించెను.

౫౮౹ ఆ దాసియొక్క యభిప్రాయమును సుమిత్రగుర్తెఱిఁగి ముందుకు నడువుమని దాసినిఁ బ్రేరేపించెను.

౫౯౹ ఇట్లుక్రమముగ నారాజపుత్రికకు రాజులనందఱను జూపించుచు వారలవృత్తాంతములను దెల్పును దశరథుని సమీపమునకుఁదీసికొని వెళ్ళెను.

౬౦౹ ఆదాసి సుమిత్రనుఁజూచి యివ్విధముగఁ బలికెను. ఓ రాజపుత్రి ఈ దశరథుఁడు సార్వభౌముడును పర్వతారణ్య సహితమగు భూమికంతకు ప్రభువును లోకప్రసిద్ధమైన కీర్తిగలవాఁడును గుణాధికుఁడునై యుండెను. ఇతఁడు రఘుమహారాజపౌత్త్రుఁడు. అజమహారాజ పుత్త్రుఁడు నీ కిష్టమైన వరింపుమనెను.

౬౧ ఇవ్విధముగనాదాసి చెప్పఁగా సుమిత్రాదేవి చేతిలోనిపుష్పమాలికను దశరథ మహారాజుయొక్క కంఠమునందుంచి యతనిని వరించెను.

౬౩ పిమ్మట దశరథుఁడు సుమిత్రాదేవితోఁగూడ నిజపురమగు సాకేతపురికి వచ్చి యామెతోఁగూడి సకల సౌఖ్యముల ననుభవించెను.

* పరంతు సంతతిం తస్యాం న లేభేఽ జనుత శ్చిరం
తా_ర్తియాశర్ణ ము_క్త్యర్థ మథ చింతాం గతో నృపః॥౬౪

తత్కాలే బ్రహ్మపు_త్రస్తు నారదో మునిస_త్తమః
వాదయన్మహతీం వీణా మయోధ్యాం ప్రవివేశ సః॥౬౫॥

రాజా దశరథ_స్తం హి పూజయామాస భ_క్తితః
సింహాసనే మహాదివ్యే సన్నివేశ్య యథావిధి॥ ౬౬॥

రాజాశ్లో॥పాతాళే బ్రహ్మలోకే వా కించిత్రం వ_ర్తతేఽనఘ ౬౭॥

---

* పుత్రోత్ప_త్తేశ్చ ఋణ నివ_ర్తకత్వం నరకోద్ధారకత్వం ఉ_త్తమలోక ప్రాపకత్వం వంశాభి వృద్ధికరత్వం చ శ్రుతావు_క్తం। ఋణ నివ_ర్తకత్వే తావత్, జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిః ఋణవాన్ జాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏష వా అనృణో యః పుత్రీ ఇతి, నరకోద్ధారకత్వే చ పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్ర ఇతి, ఉ_త్తమలోక ప్రాపకత్వే చ నా పుత్రస్య లోకోఽ_స్తీతి। వంశాభివృద్ధి కరత్వే చ ప్రజాతం తం మాన్యవ_ర్తేస్తేః, ఇతి। ఏతాదృశః పుత్రో నాభూదితి దశరథః విచారయామాస॥

౬౪ కాని దశరథునకు సుమిత్రాదేవియందును సంతానము కలుగనందున మూఁడవ ఋణముయొక్క విముక్తిని గూర్చి (అనఁగా పితృఋణమును దీర్చునుపాయము లేక పోయెనని) యొకదినమున విచారింపఁ జొచ్చెను.

౬౫ అట్టిసమయమున బ్రహ్మపుత్త్రుఁడగు నారదమహర్షి మహతియను పేరుగల వీణను వాయించుకొనుచు నయోధ్యాపురికి వచ్చెను.

౬౬ దశరథమహారాజు నారదమహర్షిని సింహాసనమునందుఁ గూర్చుండఁ బెట్టి యథావిధిగ భక్తితోఁ బూజించి యీ క్రిందివిధముగఁ బ్రశ్నించెను.

౬౭ ఓ నారదా, భూలోకమునందుఁగాని పాతాళ లోకమునందుఁగాని బ్రహ్మలోకమునందుఁగాని క్షేత్రవిశేషములున్నచోఁ జెప్పుమనియొ

---

* పుత్త్రోత్పత్తివలన ఋణనివృత్తియు నరకోత్తీర్ణతయు నుత్తమలోక ప్రాప్తియు వంశాభివృద్ధియుఁ గలుగునని శ్రుతియందుఁ జెప్పబడెను. ఋణనివృత్తి విషయమై యిటులఁ జెప్పఁబడెను. (ఏమన) బ్రాహ్మణుఁడు మూఁడు ఋణములతోఁ బుట్టుననియు నా మూఁడు ఋణములలో ఋషిఋణము బ్రహ్మచర్యముచేతను దేవతాఋణము యజ్ఞములచేతను పితృఋణము పుత్త్రోత్పత్తిచేతను దీర్చబడుననియు, నెవఁడు పుత్త్రవంతుఁడో వాఁడే పితృఋణవిముక్తుఁడగుననియు (చెప్పబడినది) నరకోత్తీర్ణత విషయమున (పున్నామ నరకమునుండి రక్షించువాఁడు గాన పుత్త్రుఁడను శ్రుత్యర్థము ప్రమాణము. పుత్త్రునివలన నుత్తమలోకప్రాప్తి కలుగు ననువిషయమున (పుత్త్రులు లేని వానికి నుత్తమగతులు లేవు) అను శ్రుత్యర్థము ప్రమాణము వంశాభివృద్ధి పుత్త్రునివలనఁ గలుగు ననువిషయమున (సంతాన తంతువును తెంపకుము) అను నుపనిషద్వాక్యము ప్రమాణము. ఇట్టిశ్రేయస్కారణభూతుఁడగు పుత్త్రుఁడు కలుగకపోయెనని దశరథుఁడు విచారించుచుండెను.

1 నారదః॥ బ్రహ్మలోకాదహం ప్రాప్తః పృథివీం శృణు భూపతే।
సర్వే విలోకితా దేశాః నరనారీ ప్రపూజితాః ౬౭

యథా దృష్టా మయా రాజన్కన్యా కేకయభూపతే
నైవ దేవీ న గంధర్వీ యథా సా కిల వర్తతే॥ ౬౮

అహో మత్స్యపతే రాజ న్నత్రాహం గత్వా వ్యలోకయం
తస్యా హస్తో మయా దృష్టో రేఖా హస్తగతా స్తథా॥ ౬౯

తాం దృష్ట్వా శీఘ్ర ముత్థాయ ప్రాప్తోస్మి చ తవాంతికం
తస్యాః పాణించ గృహ్ణీష్వ యత్నేన ఖలు భూమిప॥ ౭౦

తస్యాం పుత్రో యశస్వీ చ మహాజ్ఞాని మహాతపాః।
భవిష్యతి మహారాజ తవ పుత్రో న సంశయః॥ ౭౧

శ్రావయిత్వా తు రాజానం దేవర్షిః పరమద్యుతిః
1బ్రహ్మలోకం యయౌ ధీమాన్ నృపమామంత్ర్య వై తదా॥ ౭౨

రాజా దశరథ స్తాం హి రూపేణా ప్రతిమాం భువి।
శ్రుత్వా శుశోచ లాభార్థం కథం ప్రాప్స్యామి తాం ప్రియాం॥ ౭౩

ఇత్యాశ్చర్య రామాయణే
షష్ఠస్సర్గస్సమాప్తః

---

1. మగ్రంథేషు రామాయణే

౨౭॥ నారదుఁడప్పుడివ్విధముగఁ బలికెను. ఓ దశరథా! నేను బ్రహ్మలోకమునుండి భూలోకమును బొంది స్త్రీ పురుషులచేఁ బూజితమైన యీ భూమండలములోని దేశములన్నియుఁ జూచితిని.

౨౮॥ ఓ రాజా! కేకయరాజపుత్త్రికయగు కైకేయివంటి సౌందర్యవతిని దేవతా స్త్రీలలోఁగాని గంధర్వ స్త్రీలలోఁగాని నేను జూచియుండలేదు.

౨౯॥ ఓరాజా! నేను అశ్వపతి మహారాజ గృహమునకు వెళ్ళినప్పుడు వానిపుత్త్రికయగు కైకేయియొక్క హస్తమును హస్తగత రేఖలను జూచితిని.

౩౦॥ ఆకైకేయినిఁజూచి నీసమీపమునకు శీఘ్రముగా వచ్చితిని. ఆమెను నీవు ప్రయత్నము చేసి వివాహమాడుము.

౩౧॥ ఆకైకేయియందు మహాజ్ఞానియును మహాయశస్సంపన్నుఁడౌనగు కుమారుఁడు నీకు కలుగఁగలఁడు సందియములేదు.

౩౨॥ గొప్పతేజస్సు జ్ఞానము గలిగిన నారదమహర్షి దశరథమహారాజునకుఁ బైవిధముగ కైకేయీ వృత్తాంతమును వినిపించి తదనుజ్ఞచే బ్రహ్మలోకమును గూర్చి వెళ్ళిపోయెను.

౩౩॥ దశరథుఁడు నారదమహర్షి వలనఁ గైకేయి, సౌందర్యమున నసమానురాలని విని యాకైకేయిని నేనెట్లు భార్యనుగాఁ బొందఁగలను నాకెట్లు లభ్యమగునని విచారింపఁదొడఁగెను.

ఆశ్చర్యరామాయణమున నాలవ సర్గము ముగిసెను.

## సప్తమసర్గప్రారంభః

అథతత్ర గతా రాజ్ఞ స్సమీపం దేవయోగినీ।
తయా పృష్టో మహారాజః కిం త్వం ధ్యాయసిభూమిప॥ ౧

రాజోవాచ।శ్లో॥ఇదానీం నారదో దేవి హ్యాగతో మమసన్నిధేః
తేన రూపం హి కైకేయ్యాః మమ సర్వం నివేదితం॥ ౨

కథం ప్రాప్స్యామ్యహం తావదితి శోచామి పంకితే।౨౫.

యోగినీ॥శ్లో॥మోహినీ నరనారీణాం రూపిణీ జనహారిణీ।
ప్రాపయామి మహాభాగ కైకేయీం తవ సన్నిధిః॥ ౩౫.

ధైర్యం కురుమహారాజ మాతిభావే మయుస్థితే।
పరంతు శ్రుణు కాకుత్స్థ సతాం ధర్మో నచేదృశః॥ ౪౫.

తస్మాత్తస్యా స్త్వయాసార్థంవివాహార్థం యతామ్యహం।
రాజ్ఞా సభాజితా సాపి యయా శీఘ్రం చ యోగినీ॥ ౫౫.

సాహి స్వల్పేన కాలేన ప్రాప్తా కేకయపత్తనం।
నాగరైః పూజ్యమానా సా నరస్త్రీరేఽవసత్తదా॥ ౬౫.

## సప్తమసర్గప్రారంభము

౧ అనంతరము యోగినియొక్కతె దశరథునిసమీపమునకు వచ్చినదై దేనినిగూర్చి నీవు విచారించుచుంటివో చెప్పుమని దశరథునిఁ బ్రశ్నించెను.

౨ దశరథుఁడిట్లుఁ జెప్పనారంభించెను. ఓ యోగినీ! ఇంతకుముందు నారదుఁడు నా యొద్దకువచ్చి కైకేయీ సౌందర్యమునుగూర్చి వర్ణించి చెప్పెను.

౨½ ఓ పండితురాలా! ఆ కైకేయి నాకెట్లు లభ్యమగునని విచారించు చుంటినని దశరథుఁడు యోగినితోఁ జెప్పెను.

౩½ యోగిని దశరథునితో నిట్లుఁ జెప్పనారంభించెను. ఓ దశరథుఁడా స్త్రీపురుషాదులను మోహింపజేయు సమర్థత నాకుఁగలదు. మఱియు నేను జనుల నాకర్షింపఁగల శక్తిగలదానను. కైకేయిని క్షణకాలములో నీ యొద్దకుఁ దీసికొని రాఁగలను.

౪½ ఓ దశరథ మహారాజా! నేను దూతికగానుండఁగా, నీకు విచారమేల? ధైర్యముగా నుండుము, కాని యీపని సత్పురుషులకు సమ్మతము కానేరదని తలచెదను నేను చెప్పునది వినుము.

౫½ రహస్యముగా నామెను దెచ్చి వివాహము చేసికొనుట సజ్జనవిరుద్ధము కాన నామెకును నీకును వివాహమగునటుల నేను యత్నించెదను. ఇవ్విధముగఁ జెప్పి దశరథునిచేఁ బూజింపఁబడి తదనుమతిచేఁ గేకయ పట్టణమునకుఁ బ్రయాణమయ్యెను.

౬½ ఆ యోగిని స్వల్పకాలములోనే కేకయపట్టణమునకు వెళ్ళి యొక సరోవరతీరమునఁ దపము చేయుచున్న దానివలె నటించుచు నగర వాసులచేఁ బూజింపఁబడుచుండెను.

కైకేయీ స్నాతు మాయాతా కదాచి చ్చేటికావృతా।
సుతా మశ్వపతే ర్దృష్ట్వా లేభే సా పరమాం ముదం॥ ౭

కన్యా సాఽశ్వపతేః పుత్రీ స్నాత్వా ప్రాప్తా చ యోగినీం।
నత్వా పురఃస్థితా భక్త్యా యోగినీ సాఽవదచ్చ తాం॥ ౮

రాజలక్షణసంయుక్తా రాజపత్నీ భవిష్యసి॥ ౯

తస్యా వాక్యం నిశమ్యాథ మందహాస స్తయా కృతః।
తయా సీతా మానితా చ భవనే తు నృపస్య చ॥ ౧౦

ప్రాసాదోపరి దత్తశ్చ వాస స్తస్యా శ్శుభావహః
కదాచి త్కైకేయీం ప్రాహ యోగినీలోకమోహినీ। ౧౧

పృథివ్యా స్సాగరాంతాయాః రాజా భర్తా భవేద్యది।
తర్హి రూపస్య సాఫల్య మన్యథా వ్యర్థమేవ హి॥ ౧౨

అయోధ్యానామ విఖ్యాతా విష్ణో రాద్యా పురీ శుభా।
తస్యాం పుర్యాంతుభూపాలో నామ్నా దశరథో మహాన్ ౩౧

ఈదృశో యది తే భర్తా సఫలం తవ జీవితం।
ఇత్థం నివేదితా కన్యా తస్మిం శ్చేతో దధార సా॥ ౧౪

ఉదాసీనా నిరాహారా స్థితా సా నిరలంక్రియా।
సుతా కేకయరాజస్య యోగిన్యా ఉపదేశతః॥ ౧౫

౮ కైకేయి యొక్క పర్వదినమున సఖురాండ్రతోఁగూడి సరస్సులో స్నానము చేయుటకు రాఁగా యోగిని యా కైకేయినిఁజూచి తన కార్యము సఫలమగునని సంతసించుచుండెను.

౯ కైకేయియును స్నానముఁజేసి పురజనులచే సేవింపఁబడుచున్న యోగినిని దర్శించుటకువచ్చి భక్తితో నమస్కరించి వినయతతో నిల్వఁబడియుండఁగా, యోగిని కైకేయినిట్లాశీర్వదించెను. ఓ రాజపుత్రి! నీవు రాజలక్షణములు కలదానవుగాఁ గన్పడుచున్నందునఁ దప్పక సార్వభౌమునకు భార్యవు కాఁగలవని (యోగిని కైకేయితోఁ జెప్పెను.)

౧౦ ఆ యోగినివాక్యమును కైకేయి విని మందహాసము చేయుచు యోగినిని రాజగృహమునకు తీసికొనివెళ్ళి గౌరవించెను.

౧౧ ఆ యోగినికి తన మేడపైభాగమున కైకేయి నివాసమును కల్పించెను. ఆ మెంకు నివాసమనుకూలముగా నుండెను. ఇట్లుండ నొకప్పుడు లోకమోహినియగు యోగిని కైకేయినిగూర్చి యిట్లు పల్కెను.

౧౨ ఓ రాజపుత్రి! చతుస్సముద్రపర్యంతమగు భూమండలమును పాలించు సార్వభౌముఁడు నీకు భర్తయైనచో నీ సౌందర్యము సఫలమగును. లేనిచో వ్యర్థమగునని యెను.

౧౩ ఓ రాజపుత్రి! అట్టి సార్వభౌము డెవడుండెనని నీకు సందియము నవసరము. అయోధ్య యను పట్టణము విఖ్యాతమై యుండెను. ఆ పట్టణమునందు దశరథుఁడను సార్వభౌముఁ డుండెను.

౧౪ ఇట్టి సార్వభౌముఁడైన దశరథుఁడు నీకు భర్తయైనచో నీ జీవితము సఫలమగునని యోగిని చెప్పఁగా, నా రాజపుత్రికయగు కైకేయి యొక్క మనస్సు దశరథునియందుఁ బ్రవేశించెను.

౧౫ యోగిని, కైకేయిమనమును గ్రహించి ఓ రాజపుత్రి! నీవు నిష్కారణముగ అన్నపానాదులను ముట్టకుండఁగ నుండుము. నీ కోరిక సఫలము కాఁగలదని యుపదేశింపఁగా నా యోగిన్యుపదేశముచేఁ గైకేయి మౌనముదాల్చి యాహారమును భుజింపక యలంకారములను ధరింపక యుండెను.

తస్యా ఆళ్య స్తు తాం దృష్ట్వా భయభీతా ఇవావసన్ ।
విలోక్య కైకయీం మాతా వచనం చేద మబ్రవీత్॥౧౯

కిం వికృతిం గతాసి త్వం పుత్రి మే వద సత్వరం ।
శరీరే తవ కా వ్యాధి స్తాం యత్నా న్నాశయా మ్యహం॥౧౭

యదా సా నోత్తరం ప్రాదా త్తదా సా యోగినీంగతా ।
సుతా మే త్వీదృశీం ప్రాప్తా దశాం వై కేన హేతునా॥౧౮

యోగినీ॥ అయోధ్యా వర్ణితా తస్యాః పతి ర్దశరథ స్తథా
వర్ణితో భూ న్మయా సర్వవర్ణనే రాజ్ఞిసత్తమే॥ ౧౯

తచ్ఛ్రుత్వా కైకయీమాతా గత్వా భర్తార మబ్రవీత్
రాజ్ఞా దశరథేనైవ కుమార్యాః పాణిసంగ్రహం॥
కర్తుం యతస్వ భో నాథ తచ్చిత్తాఽభూత్సుతాయతః॥౨౦

తచ్ఛ్రుత్వా కేకయో రాజా తథేత్యుక్త్వా సభాంగతః॥
మంత్రిభి స్సమువాచ ద్వైతద్వార్తాం వదసి త్వరం॥ ౨౧

మంత్రిణః॥ శ్లో॥ త స్సైకన్యా ప్రదాత వ్యాఽనంగరూపాయసత్వ
రం।ఇతి తేషాం ప్రబ్రువతాం మంత్రి ష్వేకోఽవద త్తదా॥౨౨

౧౬ కైకేయి యొక్క సఖురాండ్రు కైకేయిస్థితిని జూచి భయభీతులై యుండిరి. కేకయపత్నియు దనపుత్త్రికస్థితిం జూచి యివ్విధముగ బల్కెను.

౧౭ ఓ పుత్త్రి! నీశరీరములో వ్యాధి యేదియో చెప్పుము నీవుమౌనముతో నుండి యాహారాదులను విసర్జించుటకుఁ గారణము వ్యాధియా, లేక మతియొక్కటియా దాపక వెంటనే చెప్పుము నీకు నేను చికిత్స చేయించెదననియె,

౧౮ కైకేయి యెప్పుడు ప్రత్యుత్తరమును జెప్పకపోయెనో యప్పుడు కైకేయితల్లి యోగినియొద్దకు వెళ్ళి ఓ యోగిని! నా పుత్త్రికయగు కైకేయి యేకారణముచే నిట్టిదశను బొందెనో జెప్పుమని యడిగెను.

౧౯ యోగిని, కైకేయి తల్లితో నిటులఁ జెప్పెను ఓ రాజపత్ని! నీకొమరిత నన్నేయే దేశములను జూచితివని యడుగగా, నేఁజూచిన దేశముల నన్నిటిని వర్ణించుచు నయోధ్యా పట్టణమును దానిప్రభువగుదశరథుని వర్ణించితిని. అదిమొదలుకొని యెందుచేతనో నీకొమరిత వికారమును బొందియున్నది.

౨౦ కేకయపత్ని యావాక్యమును విని భర్తను సమీపించి యోనాథా! నీ కొమరితను దశరథునకిచ్చి వివాహముచేయుఁ బ్రయత్నింపుము. (ఏలయన) నా మెచిత్తము యోగినివలన దశరథుని గుణములనువిన్నది మొదలుకొని యతనియందే లగ్నమైయున్నది యని యూహించెదననియె.

౨౧ భార్యయొక్క వాక్యమును కేకయరాజు విని యవ్విధముగనే ప్రయత్నించెదనని చెప్పి సభాస్థలమునకేగి, సభలోని మంత్రులతోఁ దన కొమరితను దశరథునికిచ్చి వివాహముఁ జేసెదనను విషయమును జెప్పెను.

౨౨ అప్పుడు మంత్రులు కేకయరాజుతో నిట్లుచెప్పిరి. ఓ కేకయమహా రాజా! మన్మథునితో సమానుఁడగు దశరథసార్వభౌమునకు కైకేయి నిచ్చి వివాహముఁజేయుట మాకుసమ్మతమని మంత్రులుకొందఱు చెప్పుచుండఁగా నప్పుడొక మంత్రి, రాజుతో నిట్లనియె.

శ్రూయతే ఖలు వృద్ధో హి రాజా దశరథః కృతీ ।
పురంధ్ర్య స్సంతి బహ్వ్యశ్చ తస్య రాజ్ఞో మహీపతేః॥ ౨౩॥

కథం దేయా హ్యపుత్రాయ బహుపత్నీయుతాయచ ।
తదా ప్రోవాచ గర్గస్తు విప్రో రాజపురోహితః॥ ౨౪॥

సత్రం కృతం కుబేరేణ శ్రీహరేః ప్రీతికామ్యయా ।
తస్మిన్యజ్ఞే ఋషిగణా శ్శంకరం ప్రాబ్రువం స్తదా॥ ౨౫॥

గంగాధర నమ స్తుభ్యం సర్వం జానాసి తత్త్వతః ।
రావణో రాక్షసైస్సార్థం కదా నాశం వ్రజిష్యతి॥ ౨౬॥

శివః॥ శ్లో॥ అయోధ్యాయాంమహాపుర్యాం రాజాదశరథో వసేత్
తస్య పత్నీ సుమిత్రా చ కౌసల్యా భానుమంతజా॥
అపరా కైకయీనామ తాసు పుత్రా మహాబలాః
భవిష్యంతి హి చత్వారః తేషాం జ్యేష్ఠో హనిష్యతి॥ ౨౭-౨౮॥

ఇతి వృత్త మహం యజ్ఞే హ్యశ్రౌషం త్ర్యంబకాత్పురా
తస్మాద్వైక్ష్వాకవే దేయా కన్యేయం భో నరేశ్వర॥ ౨౯॥

రాజా॥ కత్వాయోధ్యా ప్రకర్తవ్యో వివాహస్త్వయాద్రుతం
కైకేయ్యా స్తస్య భూపస్య సమయేన త్వయానఘ॥ 30॥

కైకేయ్యాం మమపుత్ర్యాం యః రాజ్ఞః పుత్రో భవిష్యతి
రాజ్యంతస్మై ప్రదేహిత్వం సత్యేనానేనగృహ్యతాం॥ 30॥

౨౩॥ ఓ కేకయమహారాజా! దశరథమహారాజు, శతవృద్ధుడని వినుచుంటిమి ఆరాజునకు బహుభార్యలుండిరని కూడ వినుచుందుము.

౨౪॥ మఱియు సంతానములేకపోవుట, బహుభార్యలుండుట, యనుదోషద్వయముకల దశరథునకుఁ గైకేయినెటుల నిచ్చెదవు; అని యొక మంత్రి చెప్పఁగా, నప్పుడు కేకయరాజపురోహితుఁడగు గర్గమహర్షి రాజుతో నిట్లు పలికెను,

౨౫॥ ఓ రాజా! పూర్వమునందు కుబేరుఁడు శ్రీహరికి ప్రీతినిఁగొల్పుటకు సత్రయాగమును జేసెను. ఆయాగమునందు మహర్షులు శంకరుని గూర్చి యిటులఁ బల్కిరి,

౨౬॥ ఓ మహేశ్వరుడా! నీకు నమస్కారము నీవు సర్వమును తెలుసుదువు. రాక్షస సహితముగా రావణుఁడెప్పుడు నశింపఁగలఁడు (అని ఋషులు శంకరునడిగిరి)

౨౭-౨౮ పరమేశ్వరుఁడు మహర్షులతో నప్పుడిటులఁ జెప్పెను అయోధ్యాపట్టణమున ధశరధుఁడను మహారాజుఁడును. వానికిఁ గౌసల్య సుమిత్ర కైకేయి, యను మువ్వురు భార్యలుందురు. దశరథున కామువ్వురి యందును నలుగురు కొమరులు గలుగుదురు, వారిలో జ్యేష్ఠుఁడగు రాముఁడు రావణుని సంహరింపఁగలఁడు, (అని శంకరుఁడు చెప్పెను.)

౨౯॥ ఈ విధముగ నేను పూర్వమునందు శివునివలన వినియుంటిని ఆకారణమువలన, ఓ కేకయరాజా! నీ కొమరితను నిక్ష్వాకువంశీయుఁడగు దశరథునకిమ్ము, (అని గర్గమహర్షి, రాజుతోఁ జెప్పెను)

౩౦॥ కేకయరాజు, గర్గమహర్షితో నిటులఁ జెప్పెను ఓ గర్గమహర్షీ! నీవయోధ్యకేగి కైకేయీ దశరథులకుఁ బ్రతినపూర్వమగు పెండ్లి రాయబారమును జరుపుము.

౩౧॥ ఓ గర్గమహర్షి! ఆ దశరథుఁడు నాపుత్త్రికయగు కైకేయియందుఁ గలిగిన కొమరునకు రాజ్యమిచ్చునటుల వానిచే శపథముఁ జేయించి కైకేయిని వివాహము జేసుకొనునట్లు నేర్పరుపుము అని కేకయ రాజు పురోహితునితోఁ జెప్పెను.

1 గర్గః॥ గమిష్యామి మహారాజ నగరం ప్రతి భూపతే
వివాహం కారయిష్యామి పుత్రాణ్యస్తే సమయేన తు॥ 32

రాజాజ్ఞయా తు గర్గోపి సాకేతం నగరం గతః
దదర్శానుకం రాజా సంపూజ్య ముని మబ్రవీత్॥ 33

సాంప్రతం జన్మసాఫల్యం జాతం మే భవదాగమాత్
భు వ్యటంతి మహాత్మానో పునంతో నిఖిలం జగత్॥ 34

గర్గః॥ శ్లో॥ యశసా తవ హే రాజన్ కర్ణా పూర్ణా మమానఘ
నేత్రయో స్సఫలార్థాయ సన్నిధిం గతవానహం॥ 35

అతయా చాగతో రాజ న్నహం మారా త్తవాంతికం
పూర్ణాం కురు మమాశాంచ వదాన్యానాం శిరోమణే॥ 36

రాజా॥ శ్లో॥ తద్వైవాహం కరిష్యామి ప్రాణైరర్థైశ్చ
సాధయే॥ 37

గర్గః॥ శ్లో॥ ప్రేషితోహం నరేంద్రేణ కాశ్మీరస్యాధిపేన తు
తుభ్యం దాస్యతి కన్యాం స్వాం సమయేన నరాధిపః॥ 38

సమయం శృణు భో రాజన్ రాజ్ఞ స్తస్య మహాత్మనః
కైకేయ్యాం మమ కన్యాయాం యస్తు పుత్రో భవిష్యతి
తస్మై స్త్ర రాజ్యందదాత్యేవంగృణతుమమకన్యకాం॥ 39

అనేన సమయేనాపి వివాహం కురు భూమిప॥ 40

1. మార్కండేయ రామాయణే.

౩౨౪ గర్గమహర్షి రాజుతో నిట్లనెను. ఓ రాజా! నేనయోధ్యాపురికేగి, నీవు చెప్పినవిధముగ నే కైకేయీదశరథులకు వివాహము నేర్పరచెదను.

౩౩౪ ఈవిధముగ గర్గమహర్షి, రాజుతోఁజెప్పి రాజుననుజ్ఞను బడసి సాకేతపురికేగి దశరథుని సందర్శింపఁగా, దశరథుఁడు గర్గమహర్షిని బూజించి యిటులఁ బల్కెను.

౩౪౪ ఓ గర్గమహర్షి! నీరాకచే నాజన్మము సఫలమయ్యెను. మీవంటి మహాత్ములరు పనిలేకపోయినను లోకమును బవిత్రముఁ జేయుటకై భూమియందు సంచరించుచుందురు అని దశరథుడు పలికెను.

౩౫౪ అప్పుడు గర్గమహర్షి యిట్లనియెను. ఓ దశరథమహారాజా! నీకీర్తిచే నా శ్రోత్రములు పూరితములైయున్నవి. నేత్రములకుఁగూడ సాఫల్యము కలుగఁజేయుటకొఱకు నీసమీపమునకు వచ్చితిని.

౩౬౪ మఱియు, ఓ రాజా! నేనొక కోరికతో దూరదేశమునుండి నీదగ్గఱకు వచ్చితిని. దాతలలో శ్రేష్ఠుఁడవగు దశరథా! నాకోరికను సఫలము జేయుము (అని గర్గమహర్షి చెప్పెను.)

౩౭ గర్గమహర్షితో దశరథుఁడిట్లుచెప్పెను. నాయొక్క యురముల చేతను ప్రాణములచేనైనను నీవు కోరినకార్యమును నెరవేర్చెదనని చెప్పెను.

౩౮ గర్గమహర్షి రాజుతో నిట్లనెను. ఓ రాజా! కాశ్మీరదేశప్రభువగు కేకయరాజు తన పుత్రికయగు కైకేయిని ప్రతిజ్ఞపూర్వకముగ నీకు నీయఁగలఁడు.

౩౯౪ ఓ రాజా! ఆప్రతిజ్ఞను జెప్పెదను. కైకేయియందు నీకు గలిగిన కొడుకునకు రాజ్యము నిచ్చెదనని ప్రతిజ్ఞఁజేసి యా కన్యను గ్రహింపుమని యతని ప్రతిజ్ఞయైయున్నది.

౪౦ ఓ రాజా! ఈప్రతిన నంగీకరించితివైనను నామెను వివాహము జేసికొనుమని గర్గమహర్షి చెప్పెను.

రాజాస్వగతం॥ శ్లో॥ వివాహస్తు మమాభీష్టః వపుత్రే రాజ్యమర్ప
ణం। యదిచేన్మమ పుత్రాశ్చ భవిష్యంతి హ్యపుత్రిణః॥ ౪౧

తేచాపి స్వస్య వంశస్య మర్యాదాం చ కుమారకాః ।
న త్యజంతి మహాత్మాన స్త్వాదావిక్ష్వాకునాకృతాం॥ ౪౨

ఇతి నిశ్చిత్య రాజా చ । వసిష్ఠాదిభి రాత్మవాన్
పురంధ్రీభి స్సమాలోచ్య తాభిశ్చ ప్రేరితోఽవదత్ ॥ ౪౩

యథా వదసి భోవిప్ర తథైవ కరవాణ్యహం
ఇత్యుక్త్వాజనుత స్సర్వైః । కాశ్మీరం ప్రతినిర్యయౌ। ౪౪

కాశ్మీరదేశపాలేన పూజితః పరమార్హణైః
చకార గ్రహణం పాణేః కైకేయ్యా రాజపుంగవః॥ ౪౫

కాశ్మీరస్య పతిః ప్రీతః పారిబర్హం దదౌ ముదా
మంథరామపి దాసీం చ । కైకేయ్యాః ప్రీతికారిణీం॥ ౪౬

రేమే రాజా తయా సార్థం సంవత్సరగణా న్బహూన్
పౌలోమ్యా చ యథా దేవ స్త్వయోధ్యాయాం
తథా నృపః॥ ౪౭

తస్మిన్కాలే దేవతానాం దానవానాం చ సంగరః
అభవత్సంగరే తస్మి న్శంబరేణ జితాస్సురాః॥ ౪౮

తదా భవ ద్దేవవాణీ యత్రాయోధ్యాపతిర్మహాన్
జయస్తత్ర నసందేహః సమానయత తంత్వితి॥ ౪౯

---

1 సత్యోపాఖ్యాన రామాయణే.

౪౧-౪౨ దశరథుఁడు తనలో నిట్లూహించెను కైకేయిని వివాహమాడుట నాకు సమ్మతమే కాని యామెకుఁగలిగిన పుత్త్రునకు రాజ్యము నిచ్చుటకు శపథము చేయుట యనునది సమ్మతముగా లేదు. కాని సంతానమే లేని నాకుఁ బుత్త్రులు కలిగినచో నా కుమారులును దమ వంశమర్యాదను నతిక్రమింపరు.

౪౩ ఇవ్విధముగ దశరథుఁడు నిశ్చయించి వసిష్ఠాదులతోడను దనభార్యలతోడను నాలోచించి వారిచేఁ బ్రోత్సహింపఁబడి గర్గమహర్షిని గూర్చి యిట్లు బలికెను.

౪౪ ఓ మహర్షీ! నీవు చెప్పిన ప్రకారముగాఁ గైకేయిని వివాహమాడెద నని చెప్పి దశరథుఁడు వెంటనే తనపరివారముతోఁ గేకయరాజ పట్టణమున కేగెను.

౪౫ కేకయరాజుచేఁ బూజింపఁబడి దశరథుఁడు కైకేయిని యథావిధిగా వివాహముఁ జేసికొనెను.

౪౬ ఆసమయమున గేకయరాజు దశరథునకుఁ బారితోషికముల ననేకములు గనిచ్చెను మఱియు కేకయరాజు తనపుత్త్రికకుఁ బ్రేమాస్పదమైన మంథరయను దాసినిగూడ నిచ్చెను.

౪౭ దశరథుఁడు కైకేయితోఁగూడ, శచీదేవితో దేవేంద్రుఁడువలె నయోధ్యాపట్టణమున బహుసంవత్సరములు సుఖించెను.

౪౮ ఆకాలమున దేవదానవులకు యుద్ధము జరిగెను. ఆయుద్ధమునందు శంబరుడను రాక్షసునిచే దేవతలు జయింపఁబడిరి.

౪౯ అప్పుడు దైవవాణి యిట్లు వినఁబడెను. ఓ దేవతలారా? అయోధ్యాపట్టణమునకుఁ బ్రభువగు దశరథుఁడే పక్షమున నుందురో, యాపక్షమున జయము గలుగుటకు సందియము లేదు కాన నతనిని దీసికొని రండు. అని యాకాశవాణి వినఁబడెను.

1 శ్రుత్వాగిరం సుమనస స్సాకేతాధిపతిం నృపం
ఆనేతుంచ జగత్రాణం ప్రేషయామాస రథ్యభృతా॥ ౯౦

సమీరణ ప్రార్థనయా తదా దశరథో నృపః
కైకేయీసహిత స్తూర్ణం రథారూఢో వినిర్యయౌ॥ ౯౧

తత్ర గత్వా దశరథ శ్చకార కదనం మహత్
శంబరోపి మహామాయా స్సంగరే తు ప్రయుక్తవాన్॥ ౯౨

వ్యాఘ్రరూపీ సింహరూపీ వ్యాళరూప్యథ శంబరః
నానాభీకరరూప స్స నృపోపరి సమాయయౌ। ౯౩

వారయామాస మాయా స్తాః ధవళాంగ మహాత్మనా
ఉపదిష్టా న్మంత్రబలా త్కైకేయీ సంగరే తదా॥ ౯౪

ఏతస్మిన్నంతరే రాజా భిన్నాక్షం స్వరథం పునః
సంగ్రామ సంభ్రమా త్తత్ర నావిద ద్రణకౌతుకీ॥ ౯౫

---

1. ఆనంద రామాయణే.

౫౦౯ ఆకాశవాణిని దేవతలు విని, యయోధ్యాపురీశుడగు దశరథునిఁ దీసికొనివచ్చుటకు వాయుదేవునిఁ బంపిరి.

౫౧౯ వాయుదేవుడు సాకేతపురికేగి దశరథుని రాక్షసులతో యుద్ధము చేయుటకు రమ్మని కోరగా, నా వాయుదేవుని ప్రార్థనచే దశరథుడు కైకేయీ సహితముగ రథారూఢుడై బయలువెడలెను. (కైకేయి తన భర్తయైన దశరథుడు రాక్షసులతో యుద్ధమునకు వెళ్ళుచుండుటచే రాక్షసులవలన నేమిప్రమాదము వచ్చునోయని రాక్షసమాయలను దెలిసిన తానుగూడ బయలుదేరెనని యూహింపఁదగు)

౫౨౯ దశరథుడు శంబరాసురుని పట్టణమునకేగి రాక్షసులతో గొప్ప యుద్ధమును జేసెను. ఆ యుద్ధమునందు శంబరాసురుడును తన రాక్షసమాయలను దశరథునిమీదఁ బ్రయోగించెను.

౫౩౯ మఱియు శంబరాసురుడు వ్యాఘ్రరూపముతోడను, సింహరూపముతోను, సర్పాకారముతోను, మఱియు నితరములగు భయంకర రూపములతోను దశరథునిమీదికి వచ్చుచుండెను.

౫౪౯ దశరథునిసమీపమునందున్న కైకేయి, బాల్యమునఁ దండ్రిగృహమునందున్నప్పుడు ధవళాంగమహర్షి పరిచర్య చేసినందున నమ్మహర్షి సంతసించి కైకేయికి రాక్షసమాయలకుఁ బ్రతిక్రియల నుపదేశించెను. ఆ ధవళాంగమహర్షిచే నుపదేశింపఁబడిన మంత్రబలముచేతను యుద్ధములో శంబరాసురుఁడు దశరథునిమీదఁ బ్రయోగించిన మాయలనన్నిటిని నివారించెను.

౫౫౯ ఈ సమయమునందు దశరథుని రథచక్రముయొక్క శీల విఱిగి పోయెను. ఆసంగతి గుర్తెఱుంగక దశరథుడు యుద్ధమునందలి వేడుకతో తొందరలో నుండెను.

* రాజ్ఞోఽంతికే స్థితానుభ్రూః కైకేయీ స్వరథం పునః
భిన్నాక్షం తు దదర్శాథ వామహస్తం నిజం పునః
అక్షస్థానే చకారాఽశు స్వపతేర్జయహేతవే॥ ౫౬-౫౭

---

* నన్వక్షస్థానే కైకేయ్యాః హస్తనిక్షేపణే కథం తన్నభగ్నమితిచే దత్రోచ్యతే, కదాచిత్కేకయగృహం ధవళాంగముని రాగతః కేకయశ్చ నియుక్తవాన్ కైకేయీం తత్సేవార్థం. కైకేయీ చాపి బహుధా తస్య పరిచర్యాం చకార॥ శ్లో॥ గంతుకామం మునిం దృష్ట్వా వరం వవ్రేథ కైకయీ। తా మువాచ మునిస్త్వాం తు చక్రవర్తీ వరిష్యతి। తవ వామకరం వజ్రాత్కఠినం భవతి ధ్రువం। యత స్త్వం వామహస్తేనాఽకరో ర్మమ నమస్కృతిం॥ ఇత్యుక్త్వా రక్షసాం మాయానాశినీశ్చ ప్రతిక్రియాః। ఉపదిశ్య చ కైకేయ్యై గతవాన్ధవళాంగక ఇతి ఆనందరామాయణాది వచనప్రామాణ్యాత్ కైకేయ్యాః శాంబరీమాయానివారణ శక్తిః వజ్రాధిక కాఠిన్యవామకరప్రక్షేపణశక్తిశ్చ సంజాతేతి సుస్థం.

---

1 అథ జిత్వా రణే దైత్యాన్దృష్ట్వా తత్కర్మ పార్థివః
దదౌ వరౌ ద్వౌ కైకేయ్యై తయా న్యాసీకృతౌ నృపే
యదాహి యాచయిష్యామి తదా త్వం దేహి తావితి॥ ౫౮-౪

---

1 ఆ॥ రా॥

*౫౬-౫౭ దశరథుని సమీపమునందున్న కైకేయి, తన రథచక్రముయొక్క శీల విఱిగినట్లు తెలిసికొని దశరథునకు ప్రమాదము లేకుండునట్లు తన వామహస్తమును చక్రముయొక్క శీలమేకకు బదులుగా నుంచి రథము పడకుండునట్లుచేసి దశరథునిఁ గాపాడెను.

---

* ౫౭. రథచక్రముయొక్క సీలమేకుకు బదులుగ గైకేయి తన వామహస్తము నుంచెనుకదా యెట్లు కైకేయియొక్క వామహస్తము విఱుగలేదని సందేహముండవచ్చును. ఈ విషయమున ఆనందరామాయణాది గ్రంథములయం దిట్లు చెప్పబడినది- కైకేయి బాలికగా నున్న సమయమున నొకప్పుడు కేకయరాజగృహమునకు ధవళాంగుడను మహర్షి రాగా నమ్మహర్షికి బరిచర్యచేయుటకు కేకయరాజు, తన పుత్త్రికయగు కైకేయిని నియమింపగా, నామె పరిచర్య బాగుగఁ జేసెను. పిదప ధవళాంగమహర్షి వెళ్ళుచుండగా గైకేయి, మహర్షిని వరమును గోరెను. అప్పుడు ధవళాంగుడు సంతసించి నీకు చక్రవర్తియగు భర్త రాగలడని వరమిచ్చి మఱియునిట్లుఁ జెప్పెను. నీవు నాకు ఎడమచేతితో నమస్కారము చేసినందున నీ వామహస్తము వజ్రముకంటెను గఠినమగుగాక యని చెప్పి రాక్షసమాయల ప్రతిక్రియలను దత్సంబంధమైన మంత్రముల నుపదేశించి ధవళాంగుడు వెళ్ళిపోయెను. ఇట్టి యానందరామాయణాది వచనములను బట్టి కైకేయికి శంబర మాయానివారణశక్తియు వజ్రముకంటె కఠినమైన వామహస్తమును సీలమేకకు బదులుగా నుపయోగించు శక్తియు, కలిగెనని తెలియుచున్నది.

---

౫౮-౯ అనంతరము యుద్ధములో దశరథుడు రాక్షసులను జయించి, కైకేయి తనరథము పడకుండగ తన వామహస్తమును సీలమేకుకు బదులుగా బెట్టియు, శంబరమాయలను నివారించియు, రెండువిధములఁ దన కుపకారము చేసియున్న రెండువరములను గైకేయిని గోరుకొనుమన, నామె నేను కోరినప్పుడు రెండువరముల నిమ్మని చెప్పి దశరథునియొద్దనే దాచియుంచెను.

తతః పరం దశరథ శ్శంబరం హంతు ముద్యతః
నివారయామాస నృపం నారద స్తత్ర చాగతః॥ ౫౯౫.

ద్వాపరే శంబరం భూప ప్రద్యుమ్నో నిహనిష్యతి
ఇత్యుక్త్వా థ గత స్స్వర్గం నారదో రామనామకృత్॥ ౬౦

అథాఽజపుత్ర స్స్వపురీం ప్రతి సంప్రేష్య కైకయీం
దేవేంద్రేణ సమాహూత స్స్వర్గలోక ముపాగతః॥ ౬౧౫
తత్రోపవేశ్య దేవేంద్ర స్స్వార్ధ సింహాసనే నృపం
సన్మానయామాస తదా సుధర్మాయాం విశేషతః॥ ౬౨౫.
అథాగత్య పురీం స్వీయాం। రాజా దశరథోఽనఘః
వసిత్వా స్వగృహే సర్వసౌఖ్యా న్యనుభవన్ స్థితః॥ ౬౩౫.

అథ దశరథో దశరథసమానరథీ మహీయసా బలేనసుమ
నసం నామ నగరం జగమిషయా పంకేరుహానుతసుతం
వసిష్ఠ మాహూయ నమస్కృత్య మునిదత్తానుజ్ఞః శతా
క్షౌహిణీ సేనయాసహాఽరుహ్య తురగముఖ్యం చంద్రస
మానశరీర మతిరోషసమావిష్టో విష్టరశ్రవస మారాధ్య
దండయాత్రాంచకార సాధ్యోనామ స్వీయయా సేనయా
వృతో దశరథాభిముఖ మాయయౌ యోద్ధుం యుద్ధం
చాన్యోన్య మభూత్

మాస మేకం యుద్ధం కృత్వా దశరథ స్తం సాధ్యం
జగ్రాహ, అథ సాధ్యనామానం భుమోభూషణ మవ

౫౯ దశరథుఁడు పిమ్మట శంబరుని సంహరించుటకుఁ బ్రయత్నించుచుండఁగా, నా సమయమున నారదుఁడచటికి వచ్చి దశరథుని నివారించి యిట్లు బలికెను.

౬౦ ఓ దశరథా ! ద్వాపరయుగమునందు శంబరాసురునిఁ బ్రద్యుమ్నుఁడు సంహరించును. కావున నీవిపుడు పేక్షింపుమని చెప్పి నారదుఁడు రామనామమునుఁ జేసికొనుచు సర్గలోకమున కేగెను.

౬౧ అనంతరము, దశరథుఁడు కైకేయిని తన పట్టణమునకుఁబంపి తన్ను దేవేంద్రుఁడాహ్వానించినందున స్వర్గములోకమున కేగెను.

౬౨ దేవేంద్రుడు దేవసభలో దశరథుని తనయర్ధసింహాసనమునందుఁ గూర్చుండఁబెట్టి విశేషముగ గౌరవించెను.

౬౩ అనంతరము దశరథుడు తన పురమునకువచ్చి స్వగృహమునందుండి సర్వసౌఖ్యముల ననుభవించుచుండెను.

౬౪ అనంతరము దశరథికులతో సమానరథికుడైన దశరథమహారాజు గొప్ప సైన్యముతో సుమనసమను పట్టణముమీదికి యుద్ధమునకుఁ బోదలచి బ్రహ్మపుత్త్రుడగు వసిష్ఠునకు నమస్కరించితదనుమతిఁబడసి కులదైవమగు రంగనాయకుని నారాధించి చంద్రవర్ణముగల యొక యశ్వమునెక్కి శతాక్షౌహిణీసైన్యముతో సుమనసనగరముమీదికి దండయాత్ర వెడలెను. సుమనసనగరాధీశుడగు సాధ్యుడనురాజు తన సైన్యముతో దశరథున కభిముఖముగా యుద్ధముఁజేయుటకు వచ్చెను. వారలిద్దరకు బరస్పరము యుద్ధము జరిగెను. దశరథుడు సాధ్యునితో నొకమాసము యుద్ధము చేసి వానినిబట్టుకొనెను. అనంతరము సాధ్యరాజపుత్త్రుడగు భూషణుడనువాడు కొలదిపరివారముతో దశరథునితో యుద్ధముచేసెను. దశరథుడు భూమికంతకు నలంకారభూతుడుగానుండిన, సాధ్యపుత్త్రుడగు భూషణునిఁ జూచి

1 లోక్యయోద్ధ మేవనైచ్ఛత్ కథ మేతాదృశం హన్త
చాస్మిన్నజ్ఞాతేఽస్యకథం పితాభవిష్యతి, కథం తన్మాతా,
కథ మప్రౌఢయౌవనా ప్రియా భార్యా, అముష్యహి
పదాని నవీనతరదళదరవిందకుసుమానీవ దృశ్యంతే ప్రీతి
వర్ధనోనామపుత్త్రోమమ హృదయ మన్యథాకరోతీతి
మనసా వితర్క్య బాలకం గ్రహీతు మారభత, సచాపి
పరాధీనోబభూవ, సచకుమారేణసహ పరాజయఖేద
మమత్వా సుఖమధ్యువాస స దశరథోఽపి మాసం తత్ర
స్థిత్వా తత్పుత్త్రసందర్శనసుఖ మవలోక్యాఽచింతయత్.
అహో సర్వదుఃఖాపనోదనక్షమ మేతన్ముఖావలోకనం
సర్వరాష్ట్రకోఽపిజయః పుత్రవియోగ మనుస్మరణాతో
దుఃఖాయ కేవలంభవతి॥ ౬౮౫,

శ్లో॥ వ్యర్థా జనిరపుత్రస్య రాజ్యశ్రీ శ్చనిరర్థకా
పుత్రవా న్మృతి మాపన్న శ్శోభతే నాసుత స్తథా॥౬౯౭

---

1. బ్రహ్మ రామాయణే.

యుద్ధముచేయుట కిచ్చగింపక యిట్లు విచారించెను ఆయోధ్యా
నేనెటులనిట్టి సుకుమారుని యుద్ధమునఁ జంపుదును వీనినిఁ జంపి
నచో వీని తల్లిదండ్రు లెటుల జీవింపగలరు! మఱియు నవయౌవన
వతిగానుండిన యితని భార్య యెట్లు భర్తృవియోగమును సహింపఁ
గలదు! ఇతని పాదములు నూతనముగా వికసించిన తామరపుష్ప
ములవలె నెంతయో మృదువుగా నున్నవి. ఈ సాధ్యపుత్త్రుడు
నాకును బ్రీతినిఁ గలుగజేయుచు నా హృదయమును వేఱువిధముగా
మార్చుచుండెనని వితర్కించుకొనుచు, తనపైకి యుద్ధమునకు సన్న
ద్ధుడైవచ్చిన యాబాలకునిఁ జంపకుండఁగఁ బట్టుకొనెను. అతడును
పరాధీనుఁడయ్యెను బంధితుడైన సాధ్యునియొద్దనే తత్పుత్త్రుడగు
భూషణునిఁగూడ నిర్బంధములో నుంచెను. కాని, సాధ్యుడు తన
పుత్త్రుడు తనదగ్గఱ నుండుటచే దనకుఁ గలిగిన పరాజయఖేదమును
మఱచి సంతోషముతో నుండెను. అదశరథుడును, మాసమువఱకు
నచ్చట నేయుండి, సాధ్యుడు తనపుత్త్రుని జూచుకొనుచుఁ బొందు
చున్న యానందమును జూచి తన మనమున నిట్లు విచారించెను.
ఓహో! యీపిల్లవాని ముఖదర్శనము, సమస్త దుఃఖమునుఁ
బోగొట్టుటకుఁ దగియున్నది. నేను రాజుల నందఱను జయించినను
నా జయము పుత్త్రులు లేనికారణముచేతను నాకు దుఃఖకరమే కాని
నాకు సుఖకరము గాదని యిట్లు విచారించెను.

౨౫ పుత్త్రులు లేనివాని జన్మము వ్యర్థము. సంపదయు నిరర్థకము. పుత్త్ర
వంతుడు మృతినొందినను శోభించును. పుత్త్రహీనుడటులు
శోభింపడు.

స్వపుత్రి స్తు పురో గచ్ఛేద్యస్య వైశ్వానరం వహన్
స్వజనైర్నీయమానస్య మృతి రప్యుత్సవో భవేత్॥ ౬౬

ఇతి సంచింత్య సాధ్యం తం పృష్ట్వా పుత్రిజనిం నృపః
హాయమేధా త్పుత్రిజన్మ శ్రుత్వా సాధ్యముఖా త్తతః
సాధ్యం చ తత్సుతం చాపి బంధముక్తౌ విధాయ సః
అయోధ్యామగమత్క్షిప్రం పుత్రాభావవిచారవాన్॥ ౬౮

అథ మంత్రిణ మాహూయ రాజా దశరథోఽవదత్ ॥౬౯

* జరా కృతాంతదూతీవ కర్ణమూల ముపాగతా
వంశాంకురో నాభవ న్మే కిం కరోమి సుమంత్ర భోః॥ ౭౦

---

* జరాం ప్రీత్యభియుక్తైరప్యుక్తం తథాహి॥శ్లో॥ యమమివ కరధృతదండం హరిమివ సగదం శశాంకమివ వక్రం।
శివమివ చ విరూపాక్షం జరా కరోత్యకృతపుణ్యమపి॥
గాత్రం సంకుచితం గతిర్విగళితా భ్రష్టాచదంతావళిః
దృష్టిర్నశ్యతి వర్ధతేబధిరతా వక్త్రంచ లాలాయతే।
వాక్యంనాద్రియతేచ బాంధవజనైః। భార్యా నశుశ్రూషతే హాకష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రాయతే।

ఏతాదృశదోషభూయిష్ఠా జరామమసమాగతా పుత్రోఽ నాభూదితి దశరథః విచారయామాస॥

౬-౬౪ పుత్త్రవంతుడు మృతినొందినపుడు వానిపుత్త్రుడు అగ్నిహోత్రమును బుచ్చుకొని తండ్రిశవముముందు నడచుచుండగా బంధువులచే నావరింపబడి శ్మశానమునకు దీసికొనిపోబడు పుత్త్రవంతుడగువాని మరణమును మహోత్సవముగానే యుండును.

౬౭-౬౮ ఇట్లు దశరథుడు తన మనమున విచారించి తన నిర్బంధములో నుండిన సాధ్యుడనువానిని పుత్త్రోత్పత్తిసాధనము నడిగి యాతని వలన అశ్వమేధమువలన పుత్త్రోత్పత్తి కలుగునని విని యప్పుడు సాధ్యుని, తత్పుత్త్రుడగు భూషణుని, బంధవిముక్తులనుగాఁ జేసి పుత్త్రులులేని విచారముతో సాకేతపురమున కేగెను.

౬౯-౭౦ అనంతరము దశరథుడు తన మంత్రియగు సుమంత్రునిఁ బిలిచి * యిటులఁ బలికెను. "ఓ సుమంత్రుడా! మృత్యుదేవతయొక్క దూతికవలె వార్ధక్యము కర్ణమూలము నాశ్రయించెను (అనగా వెండ్రుకలు నెఱసెను.) వంశాంకురము నాకింతవఱకు లేకపోయెను. ఏమిచేయుదును అని దశరథుడు సుమంత్రునితోఁ జెప్పి మఱియు నిట్లనియె.

---

* వ్యా॥ వార్ధక్యమునుగూర్చి ప్రాచీనులగు పండితులచే నిట్లు చెప్పఁబడెను. (ఏమన) పుణ్యము చేయకపోయినను వార్ధక్యముచే మనుజుడు యముడంతవాడగును. (అనగా దండధరుడగును. కఱ్ఱ చేతికి వచ్చునని భావము.) విష్ణుమూర్తివలె గదగలవాడగును. (అనగా రోగముగలవాఁడగునని భావము. గదయనగా రోగమనికూడ అర్థముండెను) చంద్రుడువలె వంకరగలవాడగును (అనగా ముసలితనమున వంకరలు తిరిగిపోవునని భావము) శివుడువలె విరూపాక్షుడగును. (అనగా కంటిచూపు ముసలితనములో బాగుగ నుండదని భావము.) మఱియు వార్ధక్యదోషము లివ్విధముగ చెప్పబడినవి, వార్ధక్యము వచ్చుటతోడనే శరీరము ముడతలుపడిపోవును. నడక తొట్రుపడును దంతము లూడిపోవును. చూపు తగ్గును. చెవుడు హెచ్చును. నోటివెంట చొంగకారును. బంధువు లాదరింపరు, భార్య చెప్పినమాట వినదు. అయ్యో? యెంతకష్టము! ముసలివానికి పుత్త్రుడుకూడ శత్రుడై వర్తిల్లును, కాన నట్టి దోషములకాలవాలమగు వార్ధక్యము వచ్చినదనియు, సంతతి లేకపోయెననియు దశరథుడు విచారించెను.

శీఘ్ర మానయ మే సర్వా న్గురూం స్తాన్సపురోహితాన్
తత స్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరితవిక్రమః
సమానయ త్సతా న్సర్వాన్సమస్తా న్వేదపారగాన్॥ ౨౧

తాన్సంపూజయిత్వా ధర్మాత్మా శ్లక్ష్ణం వచన మబ్రవీత్॥ ౨౨

మమ రాజ్యసుఖం వ్యర్థం । నాభూ త్పుత్రసుఖం యతః
తదర్థ మశ్వమేధేన యక్ష్యామీతిమతిర్మమ॥ ౨౩

నిశమ్య వచనం రాజ్ఞో వసిష్ఠాద్యా మహర్షయః
సాధు సాధ్వితి తేప్రాహుః పున స్తా నబ్రవీ న్నృపః॥ ౨౪

కీదృశోఽశ్వ స్తత్ర భావ్యః కో విధి స్తత్ర పూజనే
కథంహి శక్యతే కర్తుం । కే జేయా స్తత్రవైరిణః॥ ౨౫

వసిష్ఠః॥ గంగాజలసమానేన వర్ణేన వపుషా శుభః
కర్ణే శ్యామో ముఖే రక్తః । పీతః పుచ్ఛే సులక్షితః॥ ౨౬

మనోవేగ స్సర్వగతి రుచ్చైశ్శ్రవసమప్రభః
వాజిమేధే హయః ప్రోక్తో శుభలక్షణలక్షితః॥ ౨౭

పత్రం లిఖిత్వా ఫాలే తు । స్వనామబలచిహ్నితం
మోచనీయః ప్రయత్నేన । రక్షకైః పరిరక్షితః॥ ౨౮

౨౧ "ఓసుమంత్రుఁడా! శీఘ్రముగా వసిష్ఠ వామదేవాది పురోహితులఁ దీసికొనిరమ్ము" అని దశరథుడు సుమంత్రునితోఁ జెప్పగా సుమంత్రుఁడు మహావేగముతోఁజని వేదవిదులగు వసిష్ఠాది పురోహితులను దీసికొనివచ్చెను.

౨౨ దశరథుఁడు తన గృహమునకు వచ్చిన వసిష్ఠాదిమహర్షుల నందఱను బూజించి మృదుమధురములగు వచనములతో వారితో నిట్లనియెను.

౨౩ ఓమహర్షులారా! నాకు బుత్త్రసుఖములేని హేతువుచే రాజ్యసౌఖ్యమును వ్యర్థమనిభావించెదను పుత్త్రసంతానముకొఱకు అశ్వమేధము చేయవలెనని తలంపు నాకుగలిగినది. మీ యభిప్రాయమేమియని దశరథుడు వసిష్ఠాదుల నడిగెను.

౨౪ వసిష్ఠాదిమహర్షులు దశరథుని వాక్యమును విని (బాగుబాగు) అని మహర్షులందఱు సమ్మతినిఁజూపిరి (అనగా పుత్త్రులుకలుగుదురని చెప్పిరి) అపుడు వసిష్ఠాదులను దశరథుడు తిరిగి ప్రశ్నించెను.

౨౫ వసిష్ఠాదిమహర్షులారా! అశ్వమేధమునకెట్టిలక్షణముగలయశ్వముండవలెను! విధానమేమి! ఎట్లుచేయశక్యమగును! ఏవైరులను జయింపవలయును వీనిని సవిస్తరముగాఁ జెప్పుమని యడిగెను.

౨౬-౨౯ వసిష్ఠుడిట్లు జెప్పెను. ఓ దశరథా! గుఱ్ఱము గంగాజలమువలె తెల్లనిరంగుగలిగి యుండవలెను. చెవులయందు నలుపు, ముఖము నందెఱుపు, తోకయందు పచ్చదనము నుండవలయును. అడ్డు లేకుండగ సర్వత్ర వెళ్ళునదిగా నుండవలెను. మనోవేగముతో సమానగమనముగలిగి యుండవలెను. వెయ్యేల? దేవేంద్రుని యశ్వమగు నుచ్చైశ్శ్రవముతో సమానముగా నుండవలెను. పైన చెప్పబడిన శుభలక్షణములుగల యశ్వము, అశ్వమేధమునకు నుపయోగించును.

౩౦ ఆ యశ్వముయొక్క లలాటమునందున నామాక్షరములతో గూడిన పత్రమును గట్టి రక్షభటుల సహాయముతో నాయశ్వమును విడిచిపెట్టవలయును.

యత్ర గచ్ఛతి యజ్ఞాశ్వ స్తత్ర గచ్ఛంతు రక్షకాః
యస్తం బలా న్నిబధ్నాతి స్వవీర్యబలదర్పితః
తస్మా త్ప్రసభ మానేయః। పరిరక్షాకరై ర్హయః॥ ౮-౯

కర్త్రా తావ త్సుధీరా స్థాతవ్యం నియమా దిహ
మృగశృంగధరో భూత్వా బ్రహ్మచర్యసమన్వితః।
వ్రతం పాలయమానశ్చ। యావద్వర్షం వ్యతిక్రమేత్ ।
తావ ద్దీనాంధకృపణాః పరితోష్యా ధనాదిభిః॥ ౧౦-౧౧

అన్నం తు బహుశో దేయం ధనం వా భూరి దీయతాం
యద్య త్ప్రార్థయతే ధీమాం స్తత్త ద్దద్యా త్కృపా
లకః॥ ౧౨

ఏవం యః కురుతే కర్మ యజ్ఞ స్సంపూర్ణతాం గతః
కరోతి సర్వపాపానాం నాశనం రిపునాశన॥ ౧౩

తస్మా ద్భవా న్సమర్థోసి। కరణే పాలనేఽశ్వనే
కృత్వాకీర్తిం సువిపులాం పావయాన్యా న్జనా న్నృప॥ ౧౪

దశరథః॥ విలోకయ ద్విజశ్రేష్ఠ వాజిశాలాం మమాఽధునా
తాదృశా స్సంతి నోవా శ్వాః। శుభలక్షణలక్షితాః॥ ౧౫

ఇతి శ్రుత్వాఽపి తద్వాక్యం వసిష్ఠః కరుణాకరః
ఉత్తస్థౌ వీక్షితుం సద్యః యోగార్హాన్వాజిన శ్శుభాన్॥ ౧౬

౧౯ ఆ యజ్ఞాశ్వము ఎక్కడికి వెళ్ళిన నక్కడకు రక్షకభటులు దానిననుసరించి వెళ్ళవలయును. ఎవరైనా యశ్వమును బలాత్కారముగఁ బట్టుకొనునో వానిని జయించి యశ్వమును రక్షకభటులు తీసికొని రావలయును.

౨౦-౨౧½ యాగము చేయువాడు సంవత్సరకాలము లేడికొమ్ములను ధరించి బ్రహ్మచర్యమును జరుపుచు నియమముతో నుండవలయు. సంవత్సరకాలమంతయు దీక్షలోనుండి దీనులకు గ్రుడ్డివాండ్రకు మఱియు నితరులకందఱకు ధనము మొదలగువానిచే సంతోషమును జేయవలయును.

౨౨½ అన్నదానము విశేషముగా జేయవలయును. ధనముకూడ విశేషముగా దానము చేయవలెను. ఎవడు దేని నడిగిన దానినంతయు నిచ్చుచుండవలయును.

౨౩½ ఓ దశరథా ! పైవిధముగా నెవడు యజ్ఞమును సంపూర్తిగఁ జేయునో వాని సర్వపాపములు నశించును.

౨౪½ "ఓ దశరథా ! నీవు యజ్ఞమును జేయుటకును అశ్వమును పాలించుటకును పెద్దలను బూజించుటకును సమర్థుడవు. యాగమునుజేసి కీర్తిని సంపాదించి యితరులనుగూడ పవిత్రము చేయుము" అని వసిష్ఠుడు దశరథునితో జెప్పెను.

౨౫½ దశరథుడు తిరిగి వసిష్ఠునితో నిటులఁ బ్రశ్నించెను. "ఓ వసిష్ఠ మహర్షీ ! నీవు అశ్వశాలను బరీక్షింపుము; అశ్వమేధమునకు దగిన శుభలక్షణములుగల యశ్వములు అశ్వశాలలో నుండినవో లేవో చూడు" మని దశరథుడు వసిష్ఠునితో జెప్పెను.

౨౬½ దయాసముద్రుడగు వసిష్ఠుడు దశరథుని వాక్యమును విని వెంటనే యాగాశ్వములను జూచుటకు లేచి యశ్వశాలకేగెను.

1 దృష్ట్వా వసిష్ఠ స్తు హయా న్రాజాన మిద మబ్రవీత్
హయమేధ క్రతో ర్యోగ్యా న్వాహాంస్తే ఒహుశ శ్శుభాన్

పశ్యతో నేత్రయో ర్మేద్య తృప్తి ర్నాస్తి రఘూత్తమ
సరయ్వా శ్చోత్తరే తీరే యజ్ఞభూమి ర్విధీయతాం ౮౮౪

సంభారా స్సంభ్రియంతాం చ తురగ శ్చ విముచ్యతాం
శాలే బధ్వా పట్ట మేకం స్వనామాంకోపశోభితం
ఇత్యుక్త్వా థవసిష్ఠ స్తు స్వాశ్రమం గత వా నభూత్
సర్వేమహర్షయ స్తస్య సంకల్పంచాశ్వమేధికం
శ్లాఘయిత్వా స్వస్వ పదం గతా దశరథాజ్ఞయా
రాజాపిసర్వసంభారాన్ సంసిద్ధాంస్తుచకారసః॥౮౯-౯౦-౯౧

ఇత్యాశ్చర్యరామాయణే సప్తమ స్సర్గ స్సమాప్తః

---

1. పా॥ రా॥

౨౭-౨౮ వసిష్ఠుడశ్వశాలలోని గుఱ్ఱములను జూచి దశరథునితో నిట్లు బలికెను. ఓదశరథా ! నీ యశ్వశాలలో యాగార్హములగు గుఱ్ఱము లనేకములుండెను. ఆగుఱ్ఱములను జూచిన నానేత్రములకుతనివి తీర లేదు (ఇంకను జూడవలెననియే కోరిక యుదయించుచున్నదని భావము.)

౨౯ ఓదశరథా! ఆలస్యమేల, వెంటనే సరయూనది కుత్తరభాగమున యాగభూమి నేర్పరుచుము, సమస్తసంభారములను సిద్ధముచేయుము అశ్వలలాటమునందు స్వనామాక్షరములతో గూడిన పట్టమును గట్టి యాయశ్వమును విడువుము అని వసిష్ఠుడు దశరథునితో జెప్పి తన యాశ్రమమునకు వెళ్ళెను.

౩౦-౩౧ మహర్షులందఱు దశరథుని యశ్వమేధసంకల్పమును గొనియాడి దశరథునియనుమతి నొంది తమతమ తావులకేగిరి - పిమ్మట దశరథుడును కావలసిన సంభారములను సిదముచేసెను.

ఆశ్చర్య రామాయణమున సప్తమసర్గము ముగిసెను.

## అష్టమసర్గప్రారంభః.

ఏతచ్ఛ్రుత్వా రహస్సూతో రాజాన మిద మబ్రవీత్
ఋత్విగ్భి రుపదిష్టోఽయం పురావృత్తో మయాశ్రుతః॥
అహ మిక్ష్వాకుసారథ్యం కుర్వ న్ఛ్రుత్వా సభాం గతః
తత్ర భావిమహీపాలప్రసంగే తవ భూపతే
అపుత్రత్వం యదా ప్రోక్త మృషిభి ర్విధిసంసది
సనత్కుమారో భగవా న్మహర్షి నవద త్తదా॥ ౧-౩

ఋష్యశృంగం పురస్కృత్య స తు యజ్ఞం కరిష్యతి
పుత్రాస్త స్య భవిష్యంతి చత్వారోఽమితవిక్రమాః॥ ౪

ఏవం స దేవప్రవరః పూర్వం కథితవా న్కథాం
తదుక్తం బ్రహ్మసదసి వాక్య మశ్రౌష మప్యహం
త దృష్యశృంగ మానీయ సమాచర నృప క్రతుం॥ ౫

ఋష్యశృంగస్య చరితం శ్రుతం తత్ర వదామి తే
శృణుష్వ రాజశార్దూల జన్మకర్మాదికం మునేః॥ ౬

ఏకదా కాశ్యప స్స్నాతుం విభాండకమహామునిః
మహాహ్రదం గత స్తత్ర మజ్జతిస్మ మహీపతే॥
తస్య రేతః ప్రచస్కంద దృష్ట్వాఽప్సరసమూర్వశీం॥ ౭-౮

## అష్టమ సర్గప్రారంభము.

౧ సుమంత్రుడు వసిష్ఠాదులు చెప్పిన వాక్యములను విని దశరథమహారాజుతో నివ్విధముగ బలికెను. ఓరాజా! వసిష్ఠాదులు చెప్పినట్లే పూర్వమునందొకరు చెప్పగా నొకకథను వినియుంటిని (చెప్పెదను వినుము)

౨-౩ నేను బూర్వకాలమునం దిక్ష్వాకుమహారాజునకు రథసారథినైయుండి ఇక్ష్వాకువు బ్రహ్మసభకు వెళ్ళుచుండగా నేనుగూడ నతనితో బ్రహ్మసభకు వెళ్ళియుంటిని. అచ్చట భావికాలపు రాజులవిషయమైన ప్రసంగము రాగా నీప్రసంగముకూడ వచ్చెను. అప్పు డచ్చటి మహర్షులు కొందఱు నీకు బుత్త్రసంతానముండదని చెప్పగా సనత్కుమార మహర్షి విని యామహర్షులతో నిట్లు చెప్పె.

౪ ఓమహర్షులారా! దశరథునకు బుత్రసంతాన ముండదని మీరు చెప్పుట యథార్థము కాదు. ఆదశరథుడు ఋష్యశృంగ మహర్షినిఁ దీనికొనివచ్చి యజ్ఞము నుజేయును పిమ్మట దశరథునకు మహాపరాక్రమవంతులగు నల్వురు పుత్త్రులు కలుగుదురు.

౫ ఇవ్విధముగ దేవర్షియగు సనత్కుమారుడు చెప్పుచుండగ నేనుగూడ బ్రహ్మసభలో నమ్మహర్షి చెప్పినవాక్యములను వినియుంటిని ఆకారణమువలన ఋష్యశృంగమహర్షినిఁ దీనికొనివచ్చి యాగము నుజేయుమని సుమంత్రుడు దశరథునితోఁ జెప్పెను.

౬-౭ ఓరాజా! ఋష్యశృంగ చరితమునుగూడ నచ్చట వినియుంటిని. అమహర్షి యొక్క జననము ప్రభావము మొదలగు వానిని జెప్పెదను వినుమని చెప్పనారంభించెను.

౮-౧౦ ఓరాజా! ఒకానొకప్పుడు, కశ్యపవంశీకుడగు విభాండకమహర్షి స్నానార్థమై యొకకొలనుకు వెళ్ళి స్నానముచేయుచుండెను. ఆసమయమున, ఊర్వశియను నప్సరస కన్పడగా నమ్మునికి రేతస్స్ఖలనమై జలములోఁబడెను.

అప్సుస్నపస్స్పృశతే రాజ న్మృగీ తచ్చాఽపిబత్తదా॥
సహాతోయేన తృషితా గర్భిణీ సమభూ త్తతః
పుత్త్రం ప్రసూయ సా శాపవిముక్తా స్వర్గతా భవత్॥ ౯॥

* సాపురోక్తా భగవతా బ్రహ్మణా లోకకర్తృణా
దేవకన్యే మృగీ భూత్వా మునిం సూయ విమోక్ష్యసే॥౧౦॥

అమోఘత్వా ద్దృష్టేశ్చైవ భావిత్వా ద్దైవనిర్మితేః
తస్యాం మృగ్యాం సమభవ త్తస్య పుత్త్రో మహీపతే
పిత్రా నీతో ఋష్యశృంగః వన ఏవాఽభ్యవర్ధత॥ ౧౧-౧౨॥

---

* దేవకన్యేతి - చిత్రరేఖానామ కాచన దేవకన్యా బ్రహ్మణ స్సదసి ప్రత్యహం నృత్యతిస్మ ఏకదా నర్తనసమయే విధి మపశ్యంతీ పరాభిముఖీ సా యదా ననర్త తదా పితామహః కుపిత స్తాం శశాప త్వం మృగీ భవేః. తయా శాపవిముక్తిం ప్రతి ప్రార్థిత శ్చాత్మభూ రనుగృహ్ణ న్నేవమువాదీత్, యదా త్వం మునిబాలకం ప్రసూతవతీ భవే స్తదా విమోక్ష్యసే, ఇతికథానుసంధేయా.

౯౫ ఓ దశరథా! ఎక్కడనుండియో యొక యాఁడులేడి దాహమై యా కొలఁకునకువచ్చి నీరు త్రాగుచుండఁగా విభాండకమహర్షి యొక్క రేతస్సు జలముతోఁగూడ లేడిగర్భములోనికిఁబోయెను. ఆ లేడియు గర్భవతియై వెంటనే యొకపుత్త్రునిఁగని శాపవిముక్తురాలై దివ్యరూపముతో స్వర్గమున కేగెను.

*౧౦౫ ఆ లేడి, పూర్వకాలమునందొక దేవకన్యకయైయుండెను. సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడొకప్పుడా దేవకన్యకను లేడిరూపము నొందుమని శపింపఁగా, నా దేవకన్యక శాపవిమోచనమును గోరఁగా మునిపుత్త్రునిఁ గనినవెంటనే శాపవిముక్తి యగునని బ్రహ్మ చెప్పిన కారణమున బుత్త్రునిగని శాపవిముక్తురాలై స్వర్గమున కేగెను.

౧౧-౧౨ విభాండకమహర్షి, యమోఘవీర్యము గలవాఁడగుటవలన దైవలిఖితము జరుగవలసియున్న హేతువుచేతను ఆ యాఁడులేడియందు విభాండకమహర్షివీర్యమువలన ఋష్యశృంగుఁడు ఉద్భవించినపిదప విభాండకమహర్షియు సర్వము నెఱిఁగి, తన పుత్త్రుని స్వాశ్రమమునకుఁ దీసికొనివెళ్ళగా నచ్చట ఋష్యశృంగుఁడు పెరుగుచుండెను.

---

* చిత్రరేఖయను నొక దేవకన్యక బ్రహ్మసభలో ప్రతిదినము నృత్యము చేయుచుండెడిదైయుండెను. ఒకప్పుడు నృత్యము చేయుచున్న సమయమున బ్రహ్మవంక జూడకుండఁ నితరుల కభిముఖురాలై నృత్యము చేయుచుండెను. బ్రహ్మయుఁ గోపమంది యామెను ఆడులేడియగునటుల శపించెను. అప్పుడామె, శాపవిముక్తినిఁ బ్రార్థింపగా బ్రహ్మ యనుగ్రహించి, యిటులఁ జెప్పెను. నీవు ఋషిపుత్త్రునిఁ గనినవెంటనే శాపవిముక్తురాలవగుదువనెను. కథ యనుసంధేయము.

శృంగం శిరసి తస్యర్షేః రాజ న్నాసీ న్మహాత్మనః
తేన స ఋశ్యశృంగ ఇత్యేవ సదా ప్రథితో ఽ భవత్॥ ౧౩.

న తేన దృష్టః పూర్వో ఽన్యః పితు రన్యత్ర మానుషః
తస్మాత్తస్య మనో నిత్యం బ్రహ్మచర్యే ఽభవ న్నృప॥ ౧౪.

* ఏకస్మి న్నేవ కాలేతు సఖ్యా తవ మహీపతే
తేన కామా త్కృతం మిథ్యా బ్రాహ్మణస్యేతి నిశ్రుతం
స బ్రాహ్మణైః పరిత్యక్త స్తదా నై జగతీపతిః॥ ౧౫.

1 పురోహితాపచారాచ్చ తస్య రాజ్ఞో యదృచ్ఛయా
న వవర్ష సహస్రాక్ష స్తతో ఽపీడ్యంత తత్ప్రజాః॥ ౧౬.

---

* వ్యా॥ మిథ్యా బ్రాహ్మణస్యేతి రోమపాదః ప్రత్యహం బాడబానాం దానధర్మాదికం కరోతిస్మ ఏకస్మిన్దినే కశ్చన బాడబః రోమపాదాదేకవారం దానం గృహీత్వా పునరాదాతుం సమాగతో ఽ భూత్॥ తదా రోమపాదః మిథ్యావాదిత్వం బ్రాహ్మణజాతావారోపితవాన్ తదా సర్వేపి బాడబాః రోమపాదం తత్యజుః, కించ తద్దేశేత్వనావృష్టి స్సంభవేదితి శశపుశ్చతే. ఇతికథాత్రానుసంధేయా.

---

1. ఆధ్యాత్మరామాయణే. స॥

౧౩ ఓ దశరథమహారాజా ! మహాత్ముఁడగు ఋష్యశృంగుని శిరస్సునందు, మాతృచిహ్నమును సూచించెడి లేడికొమ్ముకూడ నొకటి యుండెను. ఆ కారణముచేతనే ఋష్యశృంగుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడయ్యెను. ( నెత్తిమీఁదను లేడికొమ్ముగల ఋషియని ఋష్యశృంగుఁడను పదమున కర్థమని యెఱుఁగనగు )

౧౪ ఆ ఋష్యశృంగుఁడు విభాండక మహర్షి యాశ్రమమునందుఁ దపోనిష్ఠుఁడై యుండి, తనతండ్రికంటె, నన్యుని నెప్పుడు చూడకపోయిన కారణముచే నమ్మహర్షి యొక్క మనస్సు, నిత్యము పరబ్రహ్మమునందే, లగ్నమైయుండెను.

* ౧౫ ఓ రాజా! ఈసమయముననే నీస్నేహితుఁడగు రోమపాదుఁడు, బ్రాహ్మణు లస్పృశ్యవాదులని బ్రాహ్మణులయందు మిథ్యావాదిత్వదూషణము నారోపించుటచే బ్రాహ్మణులచే నతఁడు పరిత్యజింపఁబడెను.

౧౬ పురోహిత బ్రాహ్మణాపచారములను రోమపాదుఁడు చేయుటవలన దేవేంద్రుఁడు, అంగదేశమున వర్షింపకపోయెను. అనావృష్టిదోషముచే ప్రజలు పీడింపఁబడుచుండిరి.

---

* వ్యా॥ రోమపాదుడు ప్రతిదినమున బ్రాహ్మణులకు దానముచేయుచుండెను. ఒకదినమున నొకబ్రాహ్మణుఁడు రోమపాదునివలనఁ నొకపర్యాయము దానము నుగ్రహించి తిరిగి గ్రహించుటను రాజు నొద్దకురాఁగా రోమపాదుఁడప్పుడు, బ్రాహ్మణులందఱు, అబద్ధమాడువారనియు, అశపాతకులనియు దూషింపగా బ్రాహ్మణులందఱు రోమపాదుని త్యజించిరి, మఱియు నతనిదేశమున వర్షము లేకుండ నుండునట్లుశపించిరి. యను కథ గ్రాహ్యము.

స బ్రాహ్మణా న్పర్యపృచ్ఛ త్తపోయుక్తా న్మనీషిణః
ప్రవర్షణే సురేంద్రస్య సమర్థా న్పృథివీపతే
కథం ప్రవర్షేత్పర్జన్య ఉపాయః పరిదృశ్యతాం॥ ౧౭-౧౮

త మూచు శ్చోదితా స్తేన సుకృతాని మనీషిణః
తత్ర త్వేకో మునివర స్తం రాజాన మువాచ హ॥ ౧౯

1* కుపితా స్తవ రాజేంద్ర బ్రాహ్మణా నిష్కృతిం చర
ఋష్యశృంగం మునిసుత మానయస్వ చ పార్థివ॥ ౨౦

2* సచే దవతరే ద్రాజ న్విషయం తే మహాతపాః
సద్యః ప్రవర్షే త్పర్జన్య ఇతి తే నాత్ర సంశయః॥ ౨౧

ఏత చ్ఛ్రుత్వా వచో రాజ న్కృత్వా నిష్కృతిమాత్మనః
స గత్వా పున రాగచ్ఛ త్ప్రసన్నేషు ద్విజాతిషు
రాజాన మాగతం దృష్ట్వా ప్రతిసంజహృషుః ప్రజాః॥ ౨౨½

తతోఽంగపతి రాహూయ సచివా న్మంత్రకోవిదాన్
ఋష్యశృంగాగమే యత్న మకరో న్మంత్రనిశ్చయాత్॥ ౨౩½

సోఽధ్యగచ్ఛ దుపాయం తు । తై రమాత్యైర్మహీపతే
శాస్త్రజ్ఞై రఖిలార్థజ్ఞై ర్నిత్యం చ పరినిష్ఠితైః॥ ౨౪½

తత్ర త్వాజ్ఞాపయామాస వారముఖ్యా మహీపతిః
వేశ్యాః సర్వత్ర నిష్ణాతా స్తా ఉవాచ మహీపతిః॥ ౨౫½

---

1. * బ్రాహ్మణాపచారో నకర్తవ్య ఇతిసూచ్యతే.
2. * అస్ఖలితబ్రహ్మచారిణో తాదృశ మహిమాస్తీతి సూచితం.

౧౭-౧౮ ఓదశరథమహారాజా! వర్షింపజేయుటకు సమర్థులు తపస్సంపన్నులు నగు బ్రాహ్మణులయొద్దకు రోమపాదుడేగి వారినిట్లు ప్రశ్నించెను. ఓ బ్రాహ్మణులారా! దేవేంద్రుడేవిధముచే వర్షించును! ఉపాయమును విచారింపుడని రోమపాదుడు బ్రాహ్మణులనడిగెను.

౧౯ అప్పుడు బ్రాహ్మణులు రోమపాదునితో నిట్లుచెప్పిరి ఓరాజా! పుణ్యవశముచే దేవేంద్రుడు వర్షము కురిపించవలసినదేకాని వేఱు మార్గములేదనిరి. వారిలో నొక మునీశ్వరుడు రాజుతో నివ్విధముగ జెప్పెను.

1* ౨౦ ఓరాజా! నీవిషయమై బ్రాహ్మణులందఱు, కోపగించిరి. వారిని ప్రసన్నులనుగా జేసికొనుము. విభాండకమహర్షి పుత్త్రుడగు ఋష్యశృంగుని నీపట్టణమునకు దీసికొనిరమ్ము.

2* ౨౧ ఓరోమపాదుడా! ఋష్యశృంగుడు నీదేశమున ప్రవేశించినచో మేఘుడు వెంటనే వర్షించును సందియములేదని యొక బ్రాహ్మణుడు చెప్పెను.

౨౨ ఈవాక్యమును రోమపాదుడు విని బ్రాహ్మణుల సన్నిధికేగి వారి ననేకవిధములుగ సంతుష్టులనుగాజేసి తిరిగి తనచంపా పట్టణమునకు రాగా పురజనులందఱు సంతోషించిరి.

౨౩½ అనంతరము రోమపాదుడాలోచనపరులగు మంత్రులనుబిలిచి ఋష్యశృంగునిం దీసుకొనివచ్చెడి విషయమైవారితో నాలోచించెను.

౨౪½ శాస్త్రజ్ఞులును, కార్యసాధకులునగు మంత్రులతో రోమపాదుడాలోచించి వేశ్యలద్వారా ఋష్యశృంగుని తనరాజ్యమునకు రప్పించుటకు నిశ్చయించెను.

౨౫½ రోమపాదుడు వేశ్యలనందఱిని బిలిపింపగా వారలందఱు రాజునొద్దకువచ్చిరి అప్పుడు రోమపాదుడా వేశ్యలతో నిట్లుపలికెను.

---

1 * ఈ కథవలన బ్రాహ్మణాపచారము చేయగూడదని సూచితము.

2 * దీనివలన అస్ఖలితబ్రహ్మచారియందలి మహిమ సూచింపబడినది.

ఋష్యశృంగ మృషేః పుత్త్రి మానయధ్వ ముపాయతః
లోభయిత్వా సమాశ్వాస్య విషయం మమశోభనాః॥ ౨౬

తా రాజభయభీతాశ్చ । శాపభీతాశ్చ యోషితః
అశక్య మూచు స్తత్కర్తుం విషణ్ణా గతచేతసః॥ ౨౭

తత్ర త్వేకా వారయోషా రాజాన మిద మబ్రవీత్
ప్రయతిష్యే మహారాజ త మానేతుం తపోధనం॥ ౨౮

అభిప్రేతాం స్తు మే కామాం స్త్వ మనుజ్ఞాతుమర్హసి
తత శ్శక్నోమ్యానయితు మృష్యశృంగ మృషేస్సుతం॥ ౨౯

తస్యా స్సర్వ మభిప్రేత మనుజానీత పార్థివః
నావి వృక్షా నథాకార్య ఫలాకారాం శ్చ మోదకాన్
సురసాం శ్చ సుగంధీని మధూని రసవంతి చ
తతో రూపేణ సంపన్నా వయసా చ మహీపతే
స్త్రియ ఆదాయ కాశ్చి త్సా జగామ వన మంజసా॥
30-31-32

సా తు స్థిత్వా కియద్దూరం సంస్థాప్య శ్రమ ముత్తమం
దృష్ట్వాంతరం కాశ్యపస్య ప్రాహిణో త్తత్ర పుత్త్రికాం॥ 33

సా తత్ర గత్వా కుశలీ తపోనిష్ఠస్య సన్నిధౌ
ఆశ్రమంతు నమాసాద్య దదర్శ త మృషే స్సుతం॥ 34

౨౩ ఓ వేశ్యలారా! విభాండకమహర్షి పుత్త్రుడగు ఋష్యశృంగుని నెవ్విధముచేతనైనను నిచ్చటకు దీసికొనిరండని రోమపాదుడు వేశ్యలతో జెప్పెను.

౨౪ అప్పుడు వేశ్యలందఱు రాజభయముచేతను, శాపభయముచేతను కాంతివిహీనులై మనస్స్వాస్థ్యములేనివారలై ఋష్యశృంగునిఁదీసికొని వచ్చుట యశక్యమనిచెప్పిరి. (అనగా వెళ్ళకునిన రాజు దండించు ననియు వెళ్ళినచో ముని శపించుననియు భయపడిరని భావము.)

౨౫-౨౯ వారిలో నొకవేశ్య రాజుతో నివ్విధముగఁబలికెను ఓ మహారాజా! ఋష్యశృంగుని దీసికొనివచ్చుటకు బయత్నించెదను నాకు కావలసిన వస్తుసంభారములను సిద్ధముఁజేయించినచో ఋష్యశృంగుని దీసికొనివచ్చుటకు నాకు సమర్థతకలదనియెను.

౩౦-౩౧-౩౨ అనంతరము రోమపాదుడు వేశ్యకుగావలసిన వస్తుసంభారముల నడిగితెలిసికొని యొక నావయందు కృత్రిమవృక్షముల నేర్పఱిచి ఫలములయొక్క యాకారముగ భక్ష్యములనుసిద్ధముజేయించి వానిని నానావయందుంచియు సువాసనగల రసవంతములైన రసాయనములనాయత్తపరచియు నా మెకోరినవిధముగ సమస్తము రాజునొనగూర్చ పిమ్మట నావేశ్య, సౌందర్యవతులు యౌవనవతులునగు మఱికొందఱువేశ్యాస్త్రీలను వెంటదీసుకొని ఋష్యశృంగునియాశ్రమ సమీపమునకు వెళ్ళెను.

౩౩ ఆవేశ్య ఋష్యశృంగుని యాశ్రమమునకు గొంతదూరమున దనపడవను నిలిపి యొక్క యాశ్రమమును గల్పించుకొని విభాండక మహర్షి లేని సమయమును జూచి తనపుత్త్రికను ఋష్యశృంగుని సమీపమునకుఁ బంపెను.

౩౪ ఆవేశ్యాపుత్త్రిక, తపోనిష్ఠుడగు ఋష్యశృంగుని యాశ్రమమునకేగి యమ్మహర్షిని జూచి యివ్విధమున గుశలప్రశ్నములను జేసెను.

1 కచ్చిత్తపో వర్ధతే తాపసానాం కచ్చిత్తపో ధ్యాన ఫలం ప్రభూతం
కచ్చిత్త్వయా పీడ్యతే నైవ విప్ర కచ్చిత్స్వాధ్యాయః క్రియతే చర్షిశ్రేష్ఠ॥ ౩౫

ఇతి శ్రుత్వా వచస్తస్య మునివేషధరస్య హి
ఉవాచ వాక్యం వాక్యజ్ఞో మునివేషవిధారిణీం ౩౬

బుద్ధ్యా భవాన్జ్యోతి రివ ప్రకాశతే మన్యేచాహం త్వామభివాదనీయం, పాద్యంచాహం సంప్రదాస్యామి తేऽద్య యథాసిద్ధ్యై తత్కర్మఫలానిచైవ॥ ౩౭

కాశ్యాం బృస్యామాస్వ యథోపవేశం కృష్ణాజినే వా స్తృతాయాం సుఖాయాం
క్వ చాశ్రమ స్తవ కిం నామచేదం బ్రాహ్మ్యం భాతి తదేవ వ్యక్తం॥ ౩౮

తతో వేశ్యా ప్రత్యువాచ ద్విజేంద్రం శంకాయుక్తా కాశ్యపస్యాగమే తు
మమాऽऽశ్రమః కాశ్యపపుత్త్రి రమ్య స్త్రియోజనం శైలమిమం పరేణ॥ ౩౯

అత్ర స్వధర్మోऽనభివాదనం మే న చోదకం పాద్య మిమం స్పృశామి॥ ౩౯-౪

---

1. అధ్యాత్మరామాయణే.

౩౫ ఓ ఋష్యశృంగమహర్షీ! ఆశ్రమవాసులగు మహర్షులందఱకుఁదపస్సు బాగుగజరుగుచున్నదా! కందమూలఫలాదులు విస్తారముగ లభించుచున్నవా! స్వాధ్యాయము హోమము మొదలగునవి బాగుగ జరుగుచున్నవా (అని ప్రశ్నించెను.)

౩౬ ఋష్యశృంగుడు మునివేషధారిణియగు వేశ్యయొక్క మనోహర వాక్యములను విని యా వేశ్యనుగూర్చి యిట్లుఁబలికెను.

౩౭ నీవు సాక్షాత్పరబ్రహ్మవలె ప్రకాశించుచున్నావు. నీవు నమస్కరింపఁదగినవాడవు. నేనుచేసిన తపస్సంతయు నీకుసిద్ధించునట్లు నర్ఘ్యపాద్యాదుల నిచ్చెదను. స్వీకరింపుము.

౩౮ నీవు కుశాసనమునందుఁగాని కృష్ణాజినమునందుఁగాని సంతోషముతోఁగూర్చుండుము. నీయాశ్రమమెక్కడనున్నది! నీపేరేమి! నీవు సాక్షాద్బ్రహ్మ దేవుడవై యిచ్చట ప్రకాశించుచున్నావు (అని ఋష్యశృంగుడు వేశ్యతోఁబలికెను.

౩౯ అనంతరము వేశ్య, విభాండకమహర్షి వచ్చునేమోయను సందేహము కలిగిఋష్యశృంగునిగూర్చి యివ్విధముగ బలికెను. ఓ ఋష్యశృంగ మహర్షీ! మా యాశ్రమము మిక్కిలి రమణీయముగా నుండును ఇచ్చటికి బం(డెండుక్రోసుల దూరములోనున్నది.

భవతా నాభివాద్యోహ మభివాద్యో భవా న్మయా
వ్రత మేతాదృశం బ్రహ్మ న్పరిష్వజ్యో భవా న్మయా
ఇతి శ్రుత్వా వచ స్తస్య పున రాహ తపోధనః॥ ౪౦ ౪౧

ఫలానిపక్వాః దదాని తేఽహం భల్లాతకాన్యామలకానిచైవ
కరూషకానీంగుదకాని తావద్యథోపజోషం ఫలమత్ర
భుంక్ష్వ॥ ౪౨

సా తాని సర్వాణి చ వర్జయిత్వాభక్ష్యం మహార్హం
ప్రదదౌతతోఽస్య
తాన్యృష్యశృంగస్య మహారసాని భృశం సురూపాణి
రుచిం దదుర్హి॥ ౪౩

తదా చుచుంబా మలగండమూలే సమాశ్లిష చ్చాసకృ
ద్దృష్యశృంగం
అవేక్ష్యమాణా శనకై ర్జగామ కృత్వాగ్నిహోత్రస్య
తదాపదేశం॥ ౪౪

తస్యాం గతాయాం మదనేన చిత్తవిచేతనః ప్రీతివ దృష్య
శృంగః
తామేవ చిత్తేన గతేన శూన్యో వినిశ్వస న్నార్తవపు
ర్బభూవ॥ ౪౫

౪౦-౪౧ ఋష్యశృంగమహర్షీ! మా నిజధర్మములను జెప్పెదను వినుము. మేము ఇతరుల నమస్కారములను స్వీకరింపము. మఱియు నితరుల యర్ఘ్యపాద్యాదులనుగూడ గ్రహింపము కాన నీవు నాకు నమస్కరింపకుము. నేను నీకు నమస్కరించెదను. ఈ సమయమున నిది మా వ్రతము. నిన్ను నేను కౌఁగిలించుకొనెదనని యవ్విధముగఁ జేసెను. ఇవ్విధముగా వేశ్యావచనములను విని ఋష్యశృంగుడు తిరిగి వేశ్యతో నిట్లు పలికెను.

౪౨ నీకు జీడిమామిడిపండ్లను నారికేళఫలములను ఇంగుదీఫలములను మఱియు నితరములగు ననేక కందమూలఫలాదుల నిచ్చెదను. భుజింపుమని యా ఫలములను, మునివేషధారిణియగు వేశ్యకు ఋష్యశృంగు డిచ్చెను.

౪౩ అప్పుడు మునివేషధారిణియగు వేశ్య, ఋష్యశృంగునిచే, నీయబడిన ఫలముల నన్నిటిని విడిచి, తనచే దీసికొనిరాబడిన మధురములగు భక్ష్యములను ఋష్యశృంగునకు నీయగా ఋష్యశృంగుని వాని నన్నిటిని భక్షించెను. ఆ భక్ష్యములన్నియు మహర్షికి రుచికరములుగా నుండెను.

౪౪. అప్పుడు మునివేషధారిణియగు వేశ్య, ఋష్యశృంగుని గండస్థలము నందు ముద్దుపెట్టుకొనెను. మఱియు ఋష్యశృంగుని నాలింగనము జేసికొనెను. ఇట్లు చేసి వేశ్య, తా నగ్నిహోత్రమును జేసికొనవలయుననెడి మిషతో మెల్లగా దన నివాసమునకు వెళ్ళెను. ఋష్యశృంగుడామెనుఁ జూచుచునే యుండెను.

౪౫ ఆ వేశ్య వెళ్ళినపిమ్మట, ఋష్యశృంగుడు మన్మథవికారములతో గూడి మునివేషధారిణియగు నా వేశ్యనే మనమునందుఁ దలచుచు నిట్టూర్పు విడుచుచు, శరీరములో బాధగలవాఁడువలె నుండెను.

తతో ముహూర్తం హరిపింగళాక్షః ప్రవేష్టితో రోమభి రానఖాగ్రాత్
స్వాధ్యాయవాన్ దృష్టసమాధియుక్తో విభాండకః కాశ్యప ఆవిరాసీత్॥ ౪౬

సోఽపశ్య దాసీన ముపేత్య పుత్త్రం జ్యాయం స్త మేవం విపరీతచిత్తం
వినిశ్వస న్తం ముహు రూర్ధ్వదృష్టిం విభాండకః పుత్త్ర మువాచ దీనం॥ ౪౭

నత్వం యథా పూర్వమివాసి పుత్త్ర చింతాపర శ్చాపి విచేతనశ్చ
దీనోఽతిమాత్రం త్వ మిహాద్య కింను పృచ్ఛామి త్వాం క ఇహా భ్యాగతోఽభూత్॥ ౪౮

నకల్ప్యంతే సమిధః కింను తాత కచ్చి ద్ధుతం చాగ్ని హోత్రం త్వయాఽద్య
సునిర్ణిక్తం స్రుక్స్రువం హోమధేనుః కచ్చి త్సవత్సా చ కృతా త్వయాఽద్య॥ ౪౯

ఋష్యశృంగః ॥శ్లో॥ ఇహా గతో జటిలో బ్రహ్మచారీ నవై హ్రస్వో నాతిదీర్ఘో మనస్వీ
సువర్ణవర్ణః కమలాయతాక్షః సుతం సురాణామివ శోభమానః॥ ౫౦

౪౬ అనంతరము కశ్యపపుత్త్రుడును, స్వాధ్యాయవేత్తయు, సమాధివంతుడును నఖశిఖాపర్యంతము రోమములతో నిండిన వాడునగు విభాండకమహర్షి క్షణకాలములో స్వాశ్రమమునకు వచ్చెను.

౪౭ విభాండకమహర్షి తన యాశ్రమమునకు వచ్చి పుత్త్రునిఁజూడగా నతడు దేనినో ధ్యానించుచున్నవాడుగాను, విపరీతచిత్తుడుగాను, మాటిమాటికి నిట్టూర్పువిడుచువాడుగాను, కన్పడినందున దీనభావముతోనున్న పుత్త్రుడగు ఋష్యశృంగునిగూర్చి విభాండకమహర్షి యివ్విధముగఁ బలికెను.

౪౮ పుత్త్రుడా! నీవుపూర్వమువలె కన్పడవు, ఎందువలన విచారముతోనున్నవాడవుగాను మనస్థిమితములేనివాడవుగాను దుఃఖితుడవుగాను కన్పడుచుంటివి కారణమేమి, ఇచ్చటికెవ్వరైనను వచ్చిరా!

౪౯ సమిధలను దెచ్చితివా! అగ్నిహోత్రమును జేసితివా! యజ్ఞపాత్రలగు స్రుక్స్రువములను శుభ్రము చేసితివా! హోమధేనువును బాలుపితికితివా! (అని విభాండకమహర్షి, పుత్త్రుడగు ఋష్యశృంగునిఁ బ్రశ్నించెను.

౫౦ ఋష్యశృంగుడు తండ్రితో నివ్విధముగ జెప్పనారంభించెను. ఓతండ్రీ! ఇచ్చటకు జటాధారియగు, బ్రహ్మచారియొకడు వచ్చెను. అతడు విశేషముగా పొట్టివాడుగాగాని పొడగరిగాగాని లేడు సమాంగుడై యుండెను. మేలిమిబంగారముతో సమానమగు వర్ణముగలవాడై యుండెను. పద్మపత్రములవలె విశాలనేత్రములు గలవాడై యుండెను. మఱియు దేవతలనుగూడ మోహింపఁజేయువాడుగా నుండెను.

ఆలంబమానా పునరస్య కంఠే విరాజతే విద్యుదివాంతరిక్షే
ద్వౌ మాంసపిండౌ వధరేణ కంఠౌ దలోమశౌ చాపి మనోహరౌ చ॥ ౫౧

నచాపి పాద్యం బహుమన్యతే ఽసౌ ఫలాని చైతాని మయాహృతాని।
మయోపభుక్తాని ఫలాని తస్య నేమాని తుల్యాని రసేన తేషాం॥ ౫౨

ఇచ్ఛామి తస్యాంతికమేవ తాత కానామ సా వ్రతచర్యాను తస్య। ఇచ్ఛామ్యహం చరితుం తేన సార్ధం యథా తపస్సచరత్యుగ్రకర్మా॥ ౫౩

ఇత్యేవ వాక్యం మునిరాత్మజస్య శ్రుత్వా మహావాక్యవిశారదోఽసౌ। ఉవాచ వాక్యం పరిశాంతయంశ్చ విభాండక స్తపసా జ్ఞాతతత్త్వః॥ ౫౪

రక్షాంసి చైతాని చరంతి పుత్ర। రూపేణ తేనాద్భుతదర్శనేన। అతుల్యవీర్యాణ్యతిరూపవంతి విఘ్నం సదా తపసశ్చింతయంతి॥ ౫౫

రక్షాంసి తానీతి నివార్య పుత్రం। విభాండక స్తపసే నిర్జగామ। యదా పునః కాశ్యపో నిర్జగామ ఫలాని హర్తుం విధినా వనాద్ధి॥ ౫౬

౫౧ ఓ తండ్రీ! ఆకాశమునందు మెఱుపుతీగవలె నతని కంఠమునందు జడ వ్రేలాడుచు ప్రకాశించుచుండెను. ఆతని కంఠమునకు క్రింది భాగమున, రోమరహితములగు రెండు మాంసపుముద్దలు మనోహరముగా నున్నవి.

౫౨ ఓ తండ్రీ! నే నిచ్చిన కందమూలఫలాదులనుగాని యర్ఘ్యపాద్యాదులనుగాని భుజింపలేదు. నాకు ఫలాదుల నిచ్చెను. మనయొద్దనున్న ఫలములు, మాధుర్యములో ఆ తపస్వి యిచ్చిన ఫలములతో సమానము కానేరవు. ఆ తపస్వి యిచ్చిన ఫలములను నేను భక్షించితిని. మధురములగు జలములను ద్రాగితిని. ఫలములుగాని రసములుగాని బహువిధములుగా నుండెను.

౫౩ ఓ తండ్రీ! నే నా తపస్వియొక్క సమీపమునుండఁ గోరికగా నున్నది. ఆ తపస్వియొక్క వ్రతచర్య యేదైయుండును. (అనగా వ్రతచర్య పేరేవి) ఆ బ్రహ్మచారితోఁగూడ, నేనుగూడ నిట్టి వ్రతచర్య చేయవలయునని కోరుచుంటిని. ఎందువల్లననగా నాతఁ డిట్టి వ్రతచర్య చేయుటచేతనే గొప్ప తపస్వియయ్యెను. కాన నేనుగూడ చేసెదననియె.

౫౪ ఈప్రకారముగాఁ జెప్పబడిన తన కుమారుని వాక్యమును విభాండక మహర్షి విని, తపోబలముచేత యథార్థమును దెలిసికొని తన పుత్రునిఁగూర్చి యివ్విధముగాఁ బలికెను.

౫౫ ఓ పుత్రుడా! నీవు చూచిన యాశ్చర్యరూపమును గురించి నే నాలోచింపగా రాక్షసుడిట్టి యద్భుతరూపముతో సంచరించుచున్నట్లు తోచుచున్నది. మిక్కిలి వీర్యము సౌందర్యముగల రాక్షసులు మహర్షుల తపస్సులకు విఘ్నములఁ జేయుట కాలోచించుచుందురు అని విభాండకుడు ఋష్యశృంగునితో జెప్పెను.

౫౬ ఓ పుత్రకా! నీవా రాక్షసుల దెరవునకుఁ బోవద్దని పుత్రుని నివారించి తన యాశ్రమమునుండి కందమూలఫలాదులను దీసికొని వచ్చుటకు మఱియొక వనమునకు విభాండక మహర్షి వెళ్ళెను.

తదా పున ర్లోభయితుం జగామ సా వారయోషా
ముని మృష్యశృంగం । దృష్ట్వైవ తాం మృష్యశృంగః
ప్రహృష్టః సంభ్రాంతరూపో న్యపత త్తదానీం॥ ౫౮

1 ప్రోవాచ చైనాం భవదాశ్రమాయ గచ్ఛామి యావ
న్నపితా మమైతి । తతో వేశ్యా కాశ్యపస్యైకపుత్రం
ప్రవేశ్య యోగేన విముచ్య నావం॥ ౫౯

* ప్రమోదయంత్యో వివిధై రూపాయై రాజగ్ము రంగాధిప
రాజధానీం । సర్వ స్సువృష్టిశ్చ బభూవ దేశే తత్పాద
విన్యాసవశా త్సుభిక్షం॥ ౬౦

స లోమపాదః పరిపూర్ణకామ స్సుతాం దదౌ
ఋష్యశృంగాయ శాంతాం॥ ౬౧

---

* వ్యా॥ నను వేశ్యాలింగనాదినా తద్దత్త భక్ష్యభో
జ్యాదిభోజనాదిభిశ్చ ఋష్యశృంగస్య మహా న్తపోహానా
పత్త్యాం తస్యపాదప్రక్షేపణేనైవ రోమపాదరాష్ట్రే సువృష్టి
రభూదితి కథన మనుపపన్నం స్యాదితి చేదత్రోచ్యతే తస్య
స్త్రీవిషయకజ్ఞానస్యై వాభావాత్ వారస్త్రీవిషయకజ్ఞానం
కథంవా భవేత్ అపిచ మనశ్చాంచల్యస్య హేతురేవ నాస్తి

---

1. అ॥ రా॥

౫౪ విభాండకమహర్షి, వనమునకు వెళ్ళిన యవకాశమునుజూచి వేశ్యలు తిరిగి ఋష్యశృంగుని లోభపెట్టుటకు ఋష్యశృంగాశ్రమమునకు వెళ్ళగా దన సమీపమునకువచ్చిన వేశ్యను ఋష్యశృంగుడుచూచి సంతుష్టుడును భ్రాంతచిత్తుడునయ్యెను

౫౫-౫౯ ఋష్యశృంగుడు మునివేషధారిణియగు తపస్వినిఁగూర్చి యివ్విధముఁబలికెను, నాతండ్రియగు విభాండకమహర్షి రాకమునుపే నీయాశ్రమమునకు వెళ్ళుదమని బయలుదేఱి వేశ్యలందఱు నివసించిన కల్పితాశ్రమమువద్దకు ఋష్యశృంగుడు వచ్చి వారున్న నావమీదనెక్కెను ఆవేశ్య లిట్లు ఋష్యశృంగుని తనపరివారయొద్దకుఁదీసికొనివచ్చి యతని సమాధితోఁగూడ నావను విడిపించెను (అనగా జీవబ్రహ్మైక్యానుసంధానరూపమగు ఋష్యశృంగుని సమాధిని భంగపరచెననియు, ఆశ్రమమువలె కల్పింపబడిన పడవను రోమపాదుని నగరమునకు విడిచిపెట్టించినదనియు భావము.) ఇట్లు నావనువదలి వేశ్యలందఱు వివిధోపాయములచే ఋష్యశృంగుని సంతోషపెట్టుచు రోమపాదుని రాజధానియగు చంపాపట్టణమునకు దీసికొనివచ్చిరి ఋష్యశృంగుని పాదవిన్యాసమా రోమపాదనగరమున కలుగుటతోడనే సువృష్టి, సుభిక్షముకలిగెను అప్పుడు రోమపాదుడు తన యభీష్టము నెరవేరినందున ఋష్యశృంగునకు దన కొమరితయగు శాంతనిచ్చి వివాహముచేసి తనపట్టణముననే యుంచుకొనెను.

---

*వ్యా॥ వేశ్యాలింగనాదులవలనను వేశ్యలిచ్చిన భక్ష్యాదులను భుజించుట చేతను, ఋష్యశృంగమహర్షికి దపోహానికల్గి మహిమయే పోగా నతని పాదవిన్యాసమాత్రమునే రోమపాదునిరాష్ట్రమున సుభిక్షము సువృష్టియు కలిగెనని చెప్పుట యుపపన్నము కాదని పూర్వపక్షము రాగా సమాధానము చెప్పబడుచున్నది. ఋష్యశృంగునకు స్త్రీవిషయకజ్ఞానమే లేనపుడు వేశ్యాస్త్రీవిషయకజ్ఞాన మెట్లుండును?

మఱియు, మనశ్చాంచల్యమునకుఁ గారణమే లేదు (ఏలయన) రాగయుక్తమగు మనస్సుతోఁగూడిన బహిరింద్రియవ్యాపారమే ఫలకారియగును. ఇవ్విషయమున, వస్త్రములు తొలగిపోయిన రాక్షస

క్రోధప్రతీకారకరంచ చక్రే గాత్రేష్వేవ మార్గేషు చ కర్షకాంశ్చ । విభాండకస్యాశ్రమత స్స రాజా పశూన్ కృషిభూతాన్ పశుపాంశ్చ వీరః ॥ ౬౦౪

సమాదిశ త్పుత్రిమార్గే మహర్షి ర్విభాండకః పరిపృచ్ఛే ద్యదా వః । సవక్తవ్యః ప్రాంజలిభి ర్భవద్భిః పుత్రస్య తే పశవః కర్షకాశ్చ ॥ ౬౧౪

---

రాగయుక్త మనస్సంయుక్తేంద్రియ వ్యాపారస్య ఫలకారి భవేత్ అత్రాపసారితచేల రాత్రిసీపరిశీలకః హానమానేవ సాక్షీ, తస్మాత్తపోహాని ర్నాస్తి. కించ వేశ్యాదత్త భక్ష్యభోజనాదినా కించిద్దోషసంప్రాప్తావపి తపోమాహాత్మ్యాత్తద్దోషోపి దగ్ధఏవేతి జ్ఞేయం.

నను ఋష్యశృంగేణ శాస్త్రాణి పఠితానివా నవా? యదిపఠితాని తదా శాస్త్రేషు స్త్రియ ఈదృశ్య ఇతి, తత్సాహచర్యం బ్రహ్మచారిణః దోషావహ మితి కథంన జ్ఞాతం. అపిచారణ్యక స్త్రీ దర్శన మపి, నకదాపి తస్యాభవద్వా, యది న పఠితాని తేనశాస్త్రాణి, అజ్ఞస్తదాభవేత్, అజ్ఞశ్చేత్కథమస్యానుగ్రహ సామర్థ్యం భవేత్॥ తస్మాత్సర్వజ్ఞ ఏవాయమితి వక్తవ్యం, తథా సత్య కృత్యకరణేన తస్యతపోహాని రభూదితి చేదత్రోచ్యతే॥

బ్రహ్మవేత్తాతు యద్యత్పశ్యతి తత్తత్సర్వం బ్రహ్మైవేతిమనుతే తదనుగుణతయా ప్రవర్తతే సర్వాణ్యపి కార్యాణి. ఋజుబుద్ధ్యా కరోతి నతువిషయాభిలాషతః॥

౨౦-౨౧ రోమపాదుడు విభాండకమహర్షికిఁ గోపోపశాంతి జేయుటకుఁ దనపట్టణమునకు విభాండకాశ్రమమునకును మధ్యలో గోవులను ఇతరపశువులను వ్యవసాయకులను గోపాలకులను నుండనేర్పఱచి పశుపాలకులు మొదలగువారితో నిట్లుజెప్పెను. ఓ వ్యవసాయకులారా! ఓ పశుపాలకులారా! విభాండకమహర్షి తన పుత్త్రుని వెదకికొనుచువచ్చుసమయమున నతఁడు మీరెవరని కాని యీ పశువులు భూములు ఎవరివని కాని మిమ్ములనడిగినచో వినయముతో మీరలు విభాండకునితో మీకుమారునివే యీ పశువులు భూములు మేము అనిచెప్పవలయునని వారలకు జెప్పిపంపెను.

---

స్త్రీలను బరిశీలించిచూచిన హనుమంతుడే సాక్షి. ఆ కారణమున తపోహాని, ఋష్యశృంగునకు నయ్యెనని చెప్పుట సమంజసముకానేరదు. ఇదియునుంగాక, వేశ్యలచేనీయబడిన భక్ష్యములనుభుజించుటచేఁ గొంచెముదోషము సంప్రాప్తమైనను దపోమహిమచే తద్దోషము దగ్ధమైనదని తెలియనగు ఇట్లుచెప్పినను కొందఱు క్రింది విధముగా శంకించెదరు. (ఏమన) ఋష్యశృంగుడు శాస్త్రములను బఠించెనా లేదా, పఠించెనని యంగీకరించిన స్త్రీలు, ఇట్టివారని కాని, స్త్రీసాహచర్యము బ్రహ్మచారికి దోషావహమనికాని యెట్లు తెలియదు? ఇదియునుంగాక, యారణ్యక స్త్రీలనైనను ఋష్యశృంగుడెప్పుడైనను, చూచియుండలేదా? మఱియు, శాస్త్రములను బఠింపలేదని యంగీకరించినచో ఋష్యశృంగుడు మూఢుడై యుండవలసివచ్చును. అట్లైనచో జ్ఞానవిహీనునకు, అనుగ్రహసామర్థ్యమెట్లుకలుగును కాన ఋష్యశృంగుడు సర్వజ్ఞుడనియే చెప్పవలయును.

అభక్ష్యభక్షణాదులవలనఁ దపోహానియేకలిగెనని పూర్వపక్షవాదమునిల్చియున్నది. (ఇందుకు సమాధానమేమనగా) ఋష్యశృంగుడు బ్రహ్మవేత్తయనియందరును, అంగీకరించినవిషయమే కదా. బ్రహ్మవేత్త, యేయేవస్తువులనుజూచునో యాయావస్తువునంతయుబ్రహ్మ

అథోపజాతం స ముని శ్చకోప స్వమాశ్రమం ఫలమూలం గృహీత్వా। అన్వేషమాణశ్చ న తత్ర పుత్రీం దదర్శ చుక్రోధ తతో భృశం సః॥ ౬-౨౫

తతస్సకోపేన విదీర్యమాణ మాశంకమానో నృపతే ర్విధానం। జగామ చంపాం ప్రతి వీక్షమాణ స్తమంగ రాజం సపురంస రాష్ట్రం॥ ౬-౩౫

సవై శ్రాంతః క్షుధితః కాశ్యప స్తాన్ ఘోషా న్వేశా న్సాధిచరా న్సమృద్ధా న్। గోపైశ్చ తై ర్విధివ త్పూజ్యమానో రాజేవ తాం రాత్రి మువాస తత్ర॥ ౬-౪౫.

అవాపసత్కార మతీవ తస్య ప్రోవాచ స్య ప్రహితాస్త గోపాః। ఊచు స్తత స్తేఽభ్యుపగమ్య సర్వే ధనం తవేదం విహితం సుతస్య॥ ౬-౫౫

---

ఋజుబుద్ధేః పాపప్రసక్తిరేవ న తథాసతి తపోహానిః కథంభవేత్, అపిచబ్రహ్మవిదోపి ప్రారబ్ధమపరిత్యాజ్యంఖలు॥

తస్మాదేవ తత్పితా యోగదృష్ట్యా సర్వంజ్ఞాత్వా కౌమారపవాయం దోషః రాజావా, వేశ్యావా నిమిత్త మాత్రమితి మత్వైవరాజ్ఞః వేశ్యానాంచ శాపంనదత్తవాన్ అపిచ వారస్త్రీస్పర్శః బలీయాన్వా తత్తపో బలవద్వేతి విచార్యతాం, శక్తిమానశ్శక్తం స్పృశతిచేత్ శక్తస్య శక్తి రశక్తస్యైవ కించిద్గచ్ఛేత్, తస్మాదేవ సదాచారవతాం చండా

౬౨-౬౩॥ అనంతరము విభాండకమహర్షియు కందమూలఫలాదులను దీసికొని తన యాశ్రమమునకు రాగా దన పుత్త్రుడు కన్పడనందున మిక్కిలి కోపగించి రోమపాదునివలననే యీపని జరిగినదని తెలుసుకొని రోమపాదునిదేశమును జూచుకొనుచు చంపాపట్టణమును గూర్చి వెళ్ళుచుండెను.

౬౪-౬౫॥ విభాండకమహర్షి క్షుద్బాధతో గూడినవాడై దేశములను, గొల్లపల్లెలను సర్వసమృద్ధితో నొప్పుచుండెడిగ్రామాదులనుజూచుచు నాయా గ్రామాదులయందలి ప్రజలచే మిక్కిలి పూజింపఁబడుచు రాత్రియందు నొక్క గొల్లపల్లెలోనుండి యా గోపాలకులచేతను బూజింపబడి విభాండకమహర్షి వారల నిట్లడిగెను. ఓ గోపాలకులారా! మీరలెవ్వరు? ఎవ్వరిచే బంపబడిరి యని యమ్మునీశ్వరుఁ డడుగగా వారలిట్లు చెప్పిరి. ఓ మునీంద్రా! మేము నీకుమారుని సేవకులము. ఈ భూములు గ్రామములు ఈ గోవులు నీపుత్త్రునివే యని బదులుచెప్పుచుండిరి.

---

రూపమునుగానే, తలచును, తదనుగుణముగానే ప్రవర్తించును. సమస్తకార్యములను ఋజుబుద్ధితోనే చేయునుగాని విషయాభిలాషతోఁ జేయఁడు. ఋజుబుద్ధితోఁ జేసినవానికి పాపప్రసక్తియే లేదు. అట్లయిన దపోహాని, యెట్లు సంభవించును?

ఇదియునుంగాక, యెట్టి బ్రహ్మవేత్తకైనను బ్రారబ్ధము అనుభవింపఁ దగినదైయున్నదికదా! అందువలననే ఋష్యశృంగునితండ్రి యోగదృష్టిచే సర్వమును దెలిసికొని యీ దోషము తన పుత్త్రునిదేయని నిశ్చయించెను. రోమపాదుఁడు కాని, వేశ్యకాని నిమిత్తమాత్రమని తలఁచిరోమపాదునకుగాని, వేశ్యలకుగాని శాపమిచ్చియుండలేదు.

ఇదియునుంగాక, వేశ్యాస్త్రీస్పర్శదోషము బలవత్తరమైనదా! ఋష్యశృంగునితపస్సు బలవత్తరమైనదా! అని విచారించెదము.

ఏవం స దేశేష్వభిపూజ్యమానస్తాంశ్చైవ శృణ్వన్మధుర
ప్రలాపాన్। ప్రశాంతభూమిష్ఠరజాః ప్రహృష్టః సమాససా
దాంగపతిం పురస్తాత్॥ ౬౬

సపూజితస్తేన నరర్షభేణ దదర్శపుత్రీం దివి దేవమింద్రం।
శాంతాం స్నుషాం చైవ దదర్శ తత్ర సౌదామినీ ముచ్చ
రంతీం యథైవ॥ ౬౭

గ్రామాంశ్చ ఘోషాంశ్చ సుతస్య దృష్ట్వా శాంతాం చ
శాంతశ్చ పరం సకోపః। చకార తస్మై చ పరం ప్రసాదం
విభాండకో భూపతయే నరేంద్ర॥ ౬౮

---

లాస్పర్శనేత్యే దమేవ కారణమితిజ్ఞేయం కించ వారస్త్రీ
స్పర్శాదినా మునిపుత్రస్య యదితపోహానిస్స్యాత్తర్హి
వాతాపిభక్షకాగస్త్యస్య అఘోరణమాస్యగతపక్వచణకభక్షిణః
శ్వేపస్త్రిబ్రాహ్మణస్యచ శ్వమాంసభక్షిణః కౌశికస్యచ
కావాగతిరితి సమాధేయం॥ వస్తుతస్తు. ఋష్యశృంగస్య తప
సిస్థితస్యాలికట పురః। పితామహస్సమాగత్య దదౌ తస్మై
వరాన్బహూన్॥ యత్రత్వం సంస్థితస్తత్ర సుభిక్షం క్షామ
నాశనం పశుప్రజాభివృద్ధి స్స్యాత్త్వత్సంకల్పః ఫలీభవేదితి
బ్రహ్మవరానుసారేణ తత్పాదవిన్యాసవశాత్సుభిక్షమితి
సర్వం రమణీయం॥

౬౬ విభాండకమహర్షి యీ ప్రకారము రోమపాదుని దేశములో గ్రామాదుల యందలి ప్రజలచేఁ బూజింపఁబడుచు నచ్చటివారల నడుగుచు మీపుత్త్రికివే యని మధురమైన సమాధానములను వినుచు కోపము కొంతశాంతించినవాఁడై సంతోషముతో రోమపాదుని పట్టణమును జేరెను.

౬౭ ౬౮ ౬౯ రోమపాదుడర్ఘ్యపాద్యాదులచే విభాండకమహర్షినిఁ దనయంతః పురమునకు దీసికొనిపోగా నచ్చట స్వర్గములో దేవేంద్రుడువలె మహావైభవముతో నున్న తనపుత్త్రుని, మెఱుపుతీగవలె ప్రకాశించుచున్న తనకోడలినిఁ జూచెను. తన కుమారుని వైభవమునుజూచి కోపము పూర్తిగా శాంతించినవాడై రోమపాదునియందు దనుగ్రహము కలవాడయ్యెను.

---

శక్తిమంతుడు, శక్తిహీనుని స్పృశించినయెడల శక్తిమంతుని శక్తియే యశక్తునకుఁ గొంచెముచేకూరునుగాని యశక్తునిదోషము శక్తిమంతునకు సంక్రమింపదు. కావుననే సదాచారవంతులు చండాలాదులను స్పృశింపకపోవుటకుఁ గారణముకూడ నిదియే యని యూహింపనగును. ఇదియునుంగాక వేశ్యాస్త్రీస్పర్శము మొదలగువానిచే ఋష్యశృంగునకుఁ దపోహాని కలిగెననిన చో, వాతాపిని భక్షించిన యగస్త్యునకును, వాపటివానిచేతిలోని శనగగుగ్గిళ్ళను లాగుకొనితినిన యుషస్తి బ్రాహ్మణునకును శ్వమాంసభక్షకుడగు విశ్వామిత్రునకును గతి యేమిచెప్పనగునని సమాధానమిచ్చుకొనదగినది. వాస్తవికము విచారించినచో దపోనిష్ఠుడగు ఋష్యశృంగునియొద్దకు నొకప్పుడు బ్రహ్మవచ్చి యమ్మహర్షికి వరములనేకము నిచ్చెను. (ఏమన) ఓఋష్యశృంగుడా! నీవెచ్చటనుండెదవో యచ్చట సుభిక్షము, క్షామము లేక పోవుట, పశువృద్ధి, ప్రజావృద్ధి కలుగును. మఱియు నీసంకల్పమున ఫలముగునని యట్లుబ్రహ్మ వర మిచ్చిన హేతువుచే మునిపాదన్యాసముచే సుభిక్షము కలిగెనని యెఱుగనగు.

1 సతత్ర నిక్షిప్య సుతం మహర్షి రువాచ సూర్యాగ్ని సమ ప్రభావః । జాతేతు పుత్త్రే వన మావ్రజేథా రాజ్ఞః ప్రియాణ్యస్య సర్వాణి కృత్వా॥ ౬౯.

ఇత్యుక్త్వా ఋష్యశృంగం తం దంపత్యో శ్చాభిషంచగః
అనుగృహ్యాంగరాజంచ జగామస్వాశ్రమం మునిః॥ ౭౦.

ఇత్యే తదృష్యశృంగస్య చరిత్రం పాపనాశనం
కథితం తే మహారాజ త మానీయా చర క్రతుం॥ ౭౧.

తచ్ఛ్రుత్వా రాజశార్దూలః ప్రహృష్ట హృదయ స్తదా
సమానేతుం ఋష్యశృంగం గంతు కామోఽ భవ
త్స్వయం॥ ౭౨.

ఆ శ్చ ర్య రా మా య ణే

అష్టమ స్సర్గ స్సమాప్తః

---

1. అ॥ రా॥

౧౯॥ అనంతరము మహాప్రభావముగల విభాండకమహర్షి, కుమారుని నక్కడనే యుండునట్లు నియోగించి తాను తన యాశ్రమమునకు వచ్చుచుఁ దన పుత్త్రునితో నిటులఁ జెప్పెను. కుమారా! నీవు రోమపాదుని యభీష్టమును నెరవేర్చి పుత్త్రసంతానము కలిగిన పిమ్మట వనమునుగూర్చి రావలసినదియని చెప్పెను

౨౦॥ ఈప్రకారము విభాండకమహర్షి ఋష్యశృంగునిగూర్చి చెప్పి నూతన దంపతుల నాశీర్వదించి రోమపాదునియందనుగ్రహము గలవాడై తన యాశ్రమమునకు వెళ్ళెను.

౨౧॥ ఓ దశరథమహారాజా! పాపహరమైన ఋష్యశృంగని చరిత్రమును నీకుఁ జెప్పితి. ఋష్యశృంగుని దీసికొనివచ్చి క్రతువును జేయుము అని సుమంత్రుడు దశరథునితోఁ జెప్పెను.

౨౨॥ దశరథుడు మహాప్రభావముగల ఋష్యశృంగని చరిత్రమును విని సంతోషించి యమ్మునినిఁ దీసికొనివచ్చుటకు రోమపాదుని పట్టణమునకు బోవ నుద్యుక్తుడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున

ఎనిమిదవ సర్గము సమాప్తము.

## నవమసర్గప్రారంభః.

* అథ రాజా దశరథ స్సభార్య స్సుహృజ్జనః
వసిష్ఠేనాఽభ్యనుజ్ఞాతః రోమపాదపురీం గతః॥ ౧

తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః
సత్కృత్య తస్య వై రాజ్ఞః ప్రహృష్టేనాంతరాత్మనా॥ ౨

---

* వసిష్ఠేనాభ్యనుజ్ఞాత ఇతి. అనేన ప్రాచీనఋత్విగభ్యనుజ్ఞానేనైవ అస్య ఆనేయ్యః నతు తదతిక్రమణేనేతి. సూచితం॥ తథాచబోధాయనః॥ యో స్యసంస్తుతమః స్యాత్తం ప్రథమం వృణీత తేన సచివేగాన్యం లిప్సేతేతి అపిచాయమర్థోఽన్వయవ్యతిరేకాభ్యాం ఫలముఖేన స్పష్టీక్రియతే. అన్వయస్తావత్ అంగదేశానీత ఋష్యశృంగ కారిత క్రతునా చత్వారః పుత్రాః భవిష్యంతీతి సనత్కుమారవాక్యం సుమంత్రేణ కథితం శ్రుత్వా వసిష్ఠాభ్యనుజ్ఞాంవినా ఋష్యశృంగానయన మయుక్త మితి నిశ్చిత్య అవాప్య తదనుజ్ఞాం దశరథ స్సమానీయ ఋష్యశృంగం వసిష్ఠఋష్యశృంగాభ్యాం కారితయాగేన సకల దురిత నిరసనపూర్వక మభిలషితసిద్ధిమవాపేతి వ్యతిరేకస్తావత్ ఏతద్వంశ్య స్త్రిశంకుః సశరీర స్వర్గప్రాప్తయే యజ్ఞః కారయితవ్య ఇతి ప్రార్థితేన వసిష్ఠేన గురుణా ప్రత్యాఖ్యాతో గురుపుత్రానాసాద్య తైశ్శప్తః ప్రాప్తనీచజాతిః విశ్వామిత్రం శరణం ప్రాప్తః తేన ప్రతిజ్ఞాపూర్వకం సశరీరం స్వర్గం ప్రాపితోఽపి దేవైః పాతితః అ

## నవమసర్గప్రారంభము.

* ౧ అనంతరము దశరథమహారాజు వసిష్ఠునియనుజ్ఞనుబొంది త
భార్యలతోడను, బంధువులతోడను రోమపాదునిపత్తనమునకేగె

౨ ఆరోమపాదుడును, తనకు దశరథుడు పరమ మిత్రుడును, బంధ
వుడును గాన సంతుష్టాంతరంగముతో నారాజునకుఁదగిన గౌర
మును జేసెను.

---

* దశరథుఁడు ఋష్యశృంగునిఁ దీసికొనివచ్చుటకు వసిష్ఠుని యనుజ్ఞ
బొంది వెళ్ళెనని చెప్పుటచేఁ బూర్వమునందుండిన పురోహితు
యనుజ్ఞనుబడసియే మఱియొక పురోహితుని దీసికొనిరావలయు
ననియు ప్రాచీన పురోహితుని నతిక్రమించి తీసికొనిరాఁగూడద
రూఁడి ధర్మము దీనిచే సూచింపఁబడినది. "బోధాయనుఁడు
నవ్విధముననే చెప్పెను." (ఏమన,) ఏపురోహితుఁడు పూర్వమ
నుండి యజమానునిచేఁబూజితుఁడయ్యెనో, వానినే కర్మలందు వరిం
వలయును. వారి యనుమతిచే నితరుని కోరవలయునని—ఇ
యునుండగాక యీ విషయ మన్వయవ్యతిరేకములచే ఫలముఖముగా
స్పష్టపరుపబడుచున్నది. అన్వయమనగా, ఏదియుండిన నేదియుండు
నో, యది యన్వయమనియు, ఏదిలేనిచో నేదయుండదో యదవ్య
తిరేకమనియును శాస్త్రి మర్యాదయై యున్నది.

అంగదేశమునుండి తీసికొని రాబడిన ఋష్యశృంగునిచేఁజేయింప
బడిన యాగమునచే నల్వురు పుత్రులు కలుగుదురని సనత్కుమా
రుఁడు చెప్పిన వాక్యమును సుమంత్రుఁడు చెప్పగా దశరథుఁడి
విని వసిష్ఠానుమతిలేనిదే ఋష్యశృంగునిఁ దీసికొనివచ్చుట న్యాయ
ము కాదని తదనుమతినొంది దశరథుఁడు ఋష్యశృంగుని దీసికొ
వచ్చి వసిష్ఠఋష్యశృంగులచేఁ జేయింపఁబడిన యాగముచే సక
పాపక్షయపూర్వకమైన యభీష్టసిద్ధి నొందెననునది యన్వయము
స్వర్గప్రాప్తికొఱకు యజ్ఞమును జేయింపుమని త్రిశంకుడు త

